# ఆగమ గీతి

## కవితా సంచయనం

ఆలూరి బైరాగి

ప్రచురణకర్తలు :

**ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక కమిటి**

నెం. 13, అరుణా కాలని

సైదాపేట రోడ్డు, వడపళని, మద్రాసు-600 026

ప్రథమ ముద్రణ :
మే 1, 1981

సాదాప్రతి : రు. 20/-
మేలుప్రతి : రు. 25/-

ప్రతులు దొరకుచోటు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
చంద్రం బిల్డింగ్స్,
విజయవాడ - 520 004.

ఎ. బి. సి. ప్రచురణలు
6-1-1081/6 లక్డికాపుల్,
హైదరాబాద్ - 500 004.



ముద్రణ :
ఉదయ ఎంటర్‌ప్రైజెస్
11-4-668/1 రెడ్‌హిల్స్,
హైదరాబాద్ - 500 004.

# అనుక్రమణిక

## అనువాదాలు

# నావాడు

దాదాపు పాతికేళ్ళ క్రితం.

నా మనస్సు చాలా ఉల్లాసంగా ఉండేది ఆ రోజులలో. నాకూతురు వెళ్ళిపోలేదు. పద్మరాజు మా యింట్లోనే కాపురం అప్పుడు.

నా కాటూరి బావ, శివశంకరులు అందరూ నన్ను వదలలేక నాతోనే ఉండేవారు, త్యాగరాజనగరం హబీబుల్లా రోడ్డులో సిమ్లా హౌస్‌లో.

సిమ్లా హౌస్ చాలా పెద్దది.

తెరచి ఉన్న ఏ కిటికీలోనుంచో చల్లగాలి కెరటాలు వస్తూ - ప్రతీ గాలికెరటం మా కవి మిత్రులతో కలసి ఏదో మాట్లాడేది. ఒకనాడు మాకు గాని, ఆ గాలులకు గాని తెలియకుండానే మరొక వింత గాలికెరటం చల్లగా లోపలికి పాతస్నేహితుళ్లాగ వచ్చింది.

ఆ రావడం కూడా భోజనాల గదిలోకే, నేరుగా. అక్కడ సొంత యింట్లోలాగ కూర్చుని, "ఊఁ" అంది - పోనీ అన్నాడు. "వడ్డించండి" అన్నట్లు! మాతో హాయిగా కబుర్లు చెప్తూ భోజనం చేసేడు.

అక్కడ ఉన్న మిత్రులు అందరూ పరమాప్తులు చిరకాలం నుంచీ. అయినా అతిథులు.

ఈ వచ్చిన గాలికెరటం - ఈయన ఇంట్లోవాడాయెను - బైరాగి.

బైరాగి గాలికెరటమున్నూ, మనిషిన్నీ.

బైరాగి మనిషినీ్న, బైరాగినీ్న.

బైరాగి అరేబియావాని ఒంటెనూ్న.

ఒక అరబ్బీవాడు ఒక డేరా వేసుకొని దానిలో కాపురమున్నాడు. గడ్డు వేసంగి వచ్చింది. పాపం! ఒకనాడు ఒక ఒంటె వచ్చింది డేరా వద్దకు. మూతితో డేరా వాకిలి కదిపింది. వాడు ఇవతలికి వచ్చి, "ఏం ? ఎందుకు ?" అన్నాడు.

నా మూతి లోపలికి చొరనిమ్మంది.

"ఊఁ" అన్నాడు.

మెల్లగా మెడ, ఆవెనుక ముందుకాళ్ళు, తరువాత పూర్తిగా లోపలికీ వచ్చేసింది.

వచ్చి, ఆ ఒంటె ఏమందీ - "నాకు ఇరుగ్గా ఉంది, నీవు బైటికి వెడతావా"అని.

బైరాగి అరేబియావాని ఒంటె - మన హృదయంలో మూతి పెట్టడంతో ప్రారంభించి, మనిషంతా దూరిపోయి నిండిపోతాడు, మనలోనుంచి మనల్నే బైటికి తోసేసి - అంటే "తన తనం" అంతా తోసేసి.

ఆ రోజుల్లో చందమామలో పడేవి చిన్నపిల్లలకోసం వ్రాసిన అతని గేయ కథలు; నన్ను ఎంతో ఆకర్షించాయి మొదట.

అవి ఎంత సులభసుందరంగా ఉండేవో, అంత గడుసుగా ప్రౌఢంగా ఉండేవి.

రచన పిల్లలకోసం; రచయిత చాలా గడసరీ, ప్రౌఢుడూ అనిపించింది.

ఇవి వ్రాసినవాడు ఎవడు చెప్మా అని ఎవరినయినా అడిగానో యేమో! ఒకనాడు చల్లగా వచ్చి కూర్చున్నాడు నా యింట్లో బైరాగి. అతగాడే వ్రాసేడు ఆ గేయకథల్ని.

అలాగా కాస్సేపు కూర్చుని వెళ్ళిపోయాడు.

తరువాత, మరునాటినుంచే పూర్తిగా నావాడు. నా యింట్లోవాడూ అయి పోయాడు. ఒక్కొక్కప్పుడు తిన్నగా భోజనాల బల్ల వద్దకు మాటాడకుండా వచ్చి "ఊఁ" అనేవాడు. "వడ్డించండి" అన్నట్లు. భోజనం చేసి పేకాడేవాడు. చనిపోయిన నా కూతురు చిన్నపిల్ల - దానితో కూడా.

తరువాత, అతని కంటపడింది ఒకనాడు. ఎవరో నా పద్యానికి హిందీలో చేసిన అనువాదం. "చెస్ ! బాగాలేదు. మీ కవిత అనువాదం చేయడం చాలా కష్టం" అని తల పంకించి ఆలోచించాడు - తానుగాని చేస్తాడా ఆ పని అని నాకు ఆశ కలిగేటట్టు.

ఆ రోజులలోనే అచ్చయి వెలువడి వచ్చిన (1955 కాబోలు) "నూతిలో గొంతుకలు" చదివాను.

మానవుడి సహజవేదనలో మథనపడి పూర్ణత్వాన్ని దాదాపు కవిగా బైరాగి అందుకున్నాడా అనిపించింది.

అమ్మ ! బైరాగీ ! ఎంత గొప్పగా అన్నాడు కవిత్వ తత్వవేదీ, అచ్చమైన గొప్ప కవీ అయిన బైరాగి.

"శబ్దాల అసమర్థత ప్రతి కవికీ ఏదో ఒక సందర్భంలో తట్టే ఉంటుంది. కవితాకామిని చేలాంచలాల కొస విసురులు ఎప్పుడూ ఒక బారెడు దూరానే మాయమై నట్లు అగుపిస్తాయి" అని.

బైరాగికి మాత్రం ఆ కొస విసురులు దూరాన మాయమైనట్లుగాక, దగ్గరగా వచ్చినప్పుడు అతనిని నిలువునా నిమిరి, అంతరంగాన్ని పలకరించేవి.

బైరాగి మన కవులు - వ్రేళ్ళమీద లెక్కపెట్టదగిన బహుకొద్దిమందిలో ఒకడు.

కృష్ణశాస్త్రి

# ఆగమగీతి

మానస యజన వాటికపై మరల నేడు
ముసురుతోంది సందేహాల మందేహాంధ దేహచ్ఛాయ.
ద్విధా మోహిత ద్వ్యర్థా సహజాసుర మాయ.
సుడిగాలుల వడిలో ఏడి ఎడమైనాయి
హృదయావేగ హేమంతాల జీర్ణ శీర్ణ పర్ణాలు.
విశ్వాసాలు, ఆస్థలు, శ్రద్ధాసక్తులాచారాలు,
ప్రాత రోత బూతుల తెరిపిలేని ప్రచారాలు.
బ్రహ్మాండ కటాహంలో సల సల సల మరుగుతోంది నూతన జీవనపాకం
ఊహల ఈహల పెనగిన కల్పిత భూతల నాకం.
ప్రాక్తన శిథిలాలయాల దివాంధాల పక్షస్వనం,
విస్మృత మంత్రోచ్చారణ సుస్వరాల దీన విహీనానుకరణం.
దీపారాధనలు కావు, నిశ చరాల భాస్వన్నయన జ్యోతులు
పరిమళధూపాలు కావు, తిక్తాతీతపు చేతల తలలుచెడిన తలపోతలు.
మినుకుమనవు ప్రామినుకులు, గౌరవనీయులు నిన్నటి దేవ ముఖ్యులిప్పుడేరి ?
జగదాలయపీఠి వీడి వెరచి పారినారా విని, నవయుగ దైత్యుల దురంత విజయభేరి.
ఎప్పటినుంచో ఉన్న ఊడలు దిగిన వటవృక్షాలు కూలిపోయి
వాటి జటిల జటల్లోంచి నానావిధ శకుంతాలు వృంతచ్ఛిన్న లతాంతాల్లా రాలిపోయి
ప్రశాంతాశ్రమ పరిసరాల మహోపద్రవ పరిస్థితులు
భావిత భీత వనచరాల కెక్కడ ఇక పుట్టగతులు ?
మనమెరిగిన జగతికంతకిది అంతం, కల్పాంతం:
ఇది విలయం. జన క్షయం, ఇది ఆదిమ భ్రాంతి ధ్వాంతం.
త్రోవ చూపే వారెవ్వరు ? నమ్మకాల ఏ దివిటీ వెలుగుల్లో
దిక్సూచిక పలుకుతుంది, ఏ పులుగుల ఎలుగుల్లో ?
విధ్వంసం నర్తించే ఈ రుద్రస్థలులందున, ఈ ఊషరసీమల్లో

వేచి ఉన్నవే బీజాలే ఆశలు, ఏ మును నోచిన పంటలు ?
ఈ కోలాహల కల్లోలార్భటిలో ఏ ఉదర్క జయఘంటలు ?
ఏ రేపటి తీయ వాయలీ నిముసపు పెనుబాముల వేముల్లో
జీవమంత్ర మేది అహో ! ఈ మిత్తవ జాముల్లో ?
మనుజుని ప్రేమ "పద్మ పత్ర మివాంభసా" జారిపోయే ఈక్షణాన
మనుజుని ఆస్థ మధ్యాహ్నపు మంచులాగు కరగి నీళ్లు కారిపోయే ఈక్షణాన
మనుజుని ఆశ యక్ష్మార్తుని దగ్గులాగు పచ్చి నెత్తురులు క్రక్కే ఈక్షణాన
మనుజుని ఆత్మ కుష్ఠ జర్జర దుర్గతిలో చివికి క్రుళ్ళి
గుప్పెడు ధూళికి మ్రొక్కే ఈక్షణాన

ఆరతి వెలిగించే దెవరు ? కుష్ఠురోగి కౌగిలి నాదనగల వారెవ్వరు ?
ఆమ్రపాలి ప్రేమికు లెవరు? చుంబించిన హస్తానికి ద్రోహులుకాని వారెవ్వరు ?
శిలువ మోయగల వారెవరు ?

శూలాగ్రాన్నధిష్ఠించి "అనలహక్" అని ఖంగున మ్రోయగల వారెవరు ?
దుర్బల రక్త మాంసాల్లోంచి పిండిన వజ్రఖండం వంటి విశ్వాసం
భ్రాతల ఎడ వాసుకి బంధ సుదృఢమైన ప్రేమపాశం
హిమాచలంవంటి దీక్ష, నయాగరావంటి కరుణ
శరదాకాశ సారల్యం, జాహ్నవీ జలంవంటి, వహ్నివంటి నైర్మల్యం
పిల్లలవంటి తెల్లని మనసు కలిగినవాడు,
ఏడీ, ఆ అపరాజేయ మానవేయుడు ?
జితేంద్రియుడు, వీతభయుడు, మృత్యుంజయుడు;
ఏడీ, ఆ మహనీయుడు ?

వస్తున్నా డొస్తున్నా డరుదెంచక తప్ప దతడు !
జగతీవిషసారపాయి, సంతత శూలాగ్రశాయి,
కరుణా జల నిధులు కంట, ఎదలో కార్చిచ్చుల మంట;
పన్నగ భూషణుడతనికి, అస్థికలాయుధాలంట !

వస్తున్నా డొస్తున్నా డరుదెంచక తప్పదతడు !
"సంభవామి యుగే యుగే" అశనిఘోషితాశ్వాసం
కురిసిన కరుణాకణాల ఆరుతుంది జనుల మనో సంత్రాసం.
అడుగుల సవ్వడి వినబడి తలవంచిన భూధరాలు
పాయలుగా విచ్చి త్రోవ నిచ్చిన రత్నాకరాలు,
జీర్ణ పర్ణ మర్మరాల కర్ణాకర్ణి విన్న కీర్తి
కింశుక చరణాల హసన్నవ రాగాగమచ్ఛాయ,
రుక్ష- శుష్క- పరి పాండుర శీర్ణధరా జీర్ణకాయ
హరితభరితమై తలిర్చి, ప్రావృడభ్రమంద్రాశ్వాసన సువార్త.
వృథాకాదు, తామస గర్భవేదన, మనుజుని గరళాస్వాదన
తామరసం హసిస్తుంది, శ్వసిస్తుంది ప్రాతర్వాతంలో తన
పరిమళాలు, నిన్నటి శంపాలంకాచ్ఛాదన తొలగి మరల
విరుస్తుంది ధర రుధిరచ్ఛవి జీవనదీప్తి తెరల.
ఈ సంధ్యాధూళినుంచి, వికృత భస్మపాళినుంచి
ఉదయిస్తా డనిల సంభవ దాత్మభవుడు, నవమానవుడు;
అతని కొరకే వేచి ఉంది యుగయుగాలనుంచి ధరణి.
అతని వ్యోమమార్గంలో ఉల్కాధర ప్రహరి తరణి.

# క్షమించండి

అనుభవానికందని ఆనందపు ఆక్రోశం
రోడ్డు మలుపు నీడల్లో కళ్ళు కప్పి
మాయమైన అదృష్టపు మోసం
చేతకాని తోలుబొమ్మల ఉక్రోషం
త్రోవతప్పి తొంగిచూచే మహాత్తర సన్నివేశం -
అది నా కవిత.

జీవితపు ఊబిలోన; గొంతువరకు దిగి కొట్టుకలాడుతోన్న
వీనికి వినిపించకండి మీ బాధలు, మీ గాథలు!
క్షమించండి!
తన హృదిలో రేగే సుడిగాడ్పు హోరు,
పడి పరుగిడి ఉరికే చక్రాల పోరు,
చావు బ్రతుకుల ఆలాపన, భూమ్యాకాశాల నటన
తాకినంత తీగల్లా మ్రోగే శబ్దాల బాట
వెలువరించ చేతగాక, కలవరించి, పలవరించి,
మూలుగులో అంతమైంది, ఎంతకూ పిగిలిరాదు నోట మాట
పొగ సెగలై రగులుతోన్న పీడా?
మీ గుండె దడల మెరుపు ఉలల
జీవిత కావ్యాల కలల సెలగా, ధ్వనిలో అనువదించి
గత చరిత్రల చొరరాని చీకటి దరబారులోన
ప్రతిధ్వనింప చేయువాడు? ఇతనిది కాదా భాగ్యం!
లక్షల వక్షస్థలాల కదలికలో ఒక లయగా
కోటి తలల నాలుకగా, నిశ్శబ్దపు గొంతుకగా
జీవిత జయఘోషల పల్లవిగా
నోచుకొన్నవారెవరో! ఇతడు కాదు!
క్షమించండి!
ఇతడు కాదు మీ పూజారి!
ఇత డొంటరి బాటసారి!

## 5

జీవన సభాభవన ప్రాంగణాల కట్టిన తోరణాలు
మారాని కడలిహోరులా ఖర కరతాళధ్వనులు
ఆ చక్కని పూలమాల
ఇతని కొరకు కాదు, ఇతడు వాకిటిలో నిలబడి చూచే బికారి
ఇతడు కాదు మీ పూజారి !
కాని బహుశా
ఆకాశం మన్ను తిన్న పాములాగు
రక్తపింజేరులాగు ఉన్నవేళ
రానిపోని జ్ఞాపకాల సంజ మసక
ఆరిపోయే పాడెలోంచి కమురుకంపు
జీవితం ఉరిత్రాటి ఉచ్చులాగు
ఒంటరి సున్నాలాగు పిలుస్తోన్న రోజున
నీ గుండెల దమదమాల బండి మోత సద్దుమణగి
నీడలేని మైదానంలో, ఒంటరి బాటసారిలా ప్రాణం
మొండి గుర్రమై చతికిలపడినప్పుడు నా గానం
నైరాశ్యపు కొండబాటపై, తడబడు అడుగులలో కొనఊపిరి వెదుకులాట
నీ మండిన గొంతుకలో
నీ ఎండిన పెదవులపై
మంచుబొట్టు చెమ్మలాగు నాపాట ఆరిపోతే చాలు
నీ కన్నుల కోరుల్లో నీడల్లా చిరునవ్వులు జారిపోతే చాలు
బ్రతుకు కిటికీ రెక్కలోంచి
నీ వెరిగిన మొగం ఒకటి మెరసిపోతే చాలు !

# మధ్యాహ్నం వేళ

తమ్ముడూ! తమ్ముడూ! ఏమిటి చేశాను నిన్ను!
మింటినుంచి మండుటెండ కురుస్తోంది
రాతిరోడ్డు మెరుస్తోంది.

సాగినాయి పడగాడ్పులు;
ఎదలో ఎండిన ఏడ్పులు
మండే వీథుల్లోన ఎండుటాకులు, వాడిన పూలరేకులు
చెమటలు కారుతున్నయ్! చూపులు పోరుతున్నయ్
తీక్ష్ణ సూర్యకాంతులతో!

నడుస్తున్నాం మనుషులం తలలు వంచి తొందరగా,
మూసిన దుకాణాలు, ఇళ్ళ తలుపులు
మూసిన మనసులు!

ప్రపంచం మండుతోంది, తమ్ముడూ! తమ్ముడూ!
ఈ అట్లపెనం మీద, ఈ ముళ్ళదొంకలోన
ఈ రాక్షస లంకలోన, ఎందుకు నిలబడ్డావో?
ఈ దుమ్మూ! ఈ చెమటా! నీ నరులు చింతనిప్పులు!
నీ కన్నులు! నీ కిన్నులు! వేసవికాలపు మిన్నులు!
ఎందుకు నిలబడ్డావో?

ఆ బయటకురాని పిలుపు!
ఆ చూపుల ఆరాటం!
తెరచీ తెరువని పెదవుల
పిగిలిరాని పోరాటం!
ఈ మండే మధ్యాహ్నపు రోడ్డుమీద
ఎందుకు నిలబడ్డావో?

నీ హృదయంలో వినయం, నీ బెదురు కనుల చూపు
సగం ఆశ, అయోమయం. ఒక సత్తువలేని ఊపు
నీ వడుగని ఒక ప్రశ్న, నీ పలుకని ఒక్క పలుకు
కాల హృదయశల్యంగా మరి మరి వేస్తోంది కలత

గుడ్డివాణ్ణి; చూడలేదు నీ హృదయపు పెనుగులాట
చెవిటిని: వినలేకుంటిని, నీ పెదవి పాడని పాట.
నా దేహపు రాతి గోడ మూసిన గ్రంథపు భావం !
మరి తెలియుటమెలాగ హృదయపు రక్తస్రావం ?
ఏమిటి చేశాను నిన్ను తమ్ముడూ !

కొన్ని ఏళ్ళ మైలు రాళ్ళు, దుమ్ము త్రోవలో అలసట
మధ్యాహ్నపు మండుటెండ, మాడిన దేహాల చెమట
మూర్ఛిల్లిన యాత్రాంతం, గిర్రుమనే జ్ఞాపకాలు
నీవడుగని ప్రశ్న నేడు వేస్తున్నది నన్ను సవాలు.
ఆరిన బూడిదలో ఒక నిప్పురవ్వ రగులుతోంది
మరల తిరిగివచ్చిన ఒకక్షణపు బాధ మిగులుతోంది.
బాధలేని గాథలేదు, నీడపోని వాడలేదు
మధ్యాహ్నపు పొద్దుమీద
ఏమిటి చేశాను నిన్ను తమ్ముడూ !

# చెప్పనిది

ఇది ముందే ఎందుకు చెప్పావుకావు
ఇది మొదటే ఎందుకు చెప్పావుకావు

తూరుపు క్రౌంజిపురు కెంపు మాయకముందు
పగటి హంగుల అంగడులు తీయకముందు
వివిక్త వాంఛా వీథుల యుద్ధవిరమణ వేళయందు
దూరపు తీరపు పిలుపు వినుపించే వీలున్నపుడు
మొదటే నీవు ఎందుకు చెప్పావుకావు !

ఆశల ఇన్ఫ్లేషన్ హృదయావేశపు రేషన్
కోరికల, తీరికల, ధరల, జీతాల కంట్రోళ్ళు
(ధర హెచ్చుట తగ్గుట కొరకు కాదీసారి)
జీవితపు బెలూన్లో ఇంకా గేసు లేనపుడు
(చిల్లి పొడవటంతప్ప లేదిక దారి)
మొదటే నీవు ఎందుకు చెప్పావుకావు !

అమాయకపు మోముపైన గడుసరి మచ్చలు కానరాకముందు
(కుమారసమీరంలో తృణదీలాల పసి గుసగుసలు)
వివేకపు రక్షణలకు పార్శ్వభంగ ప్రమాదంలేకముందు
సత్తువలేని చేతులు వణకనపుడు
మెత్తని గాత్రమంతా ముదిమిచేత రౌణకనపుడు
మొదటే నీవు ఎందుకు చెప్పావుకావు!

ఔను పాపం! నీకు మాత్రం ఏమితెలుసు !
కనుపించదు కంటి నలుసు !
ప్రాతశ్శాంతి ద్వీపం గూర్చి ఏమీ ఎరుగమపుడు
హెచ్చరికలైనా లేవు, లాభం లేదిపుడు
తిరుగుత్రోవ కనుపించదు మలుపు తిరుగలేను నేను
ప్రాతశ్శాంతి ప్రదేశానికి తిరిగి యరుగలేను నేను

రాత్రి సమీపిస్తున్నది, ముసురుతున్న మురికినీడలు
వేచి ఉన్నాయి ముళ్ళపొదల మృగాల అలికిడికొరకు,
వాయుశ్వాసల వెదలుతోంది భీతి ద్వేష దగ్ధ గంధం
అలసిన అడుగులు చేరుతున్నాయి కడ వాడలు
కథ ముగిసింది; అర్థంకాని ఆశ్వాసపు పునరావృత్తి
అసంభవం గతం గతం నిరుల్లంఘ్యం, నిర్ద్వంద్వం.
అనాగతం వేచి ఉండదు మనిషి సిద్ధమయ్యేవరకు

బాలారామం వచ్చేశాను
తిరిగి పోవలేను నేను
స్వర్ణసుమనోద్యానానికి.

ఇప్పుడెందుకు ఆ దృశ్యాలు? పచ్చని ముసుగులోంచి
పృథ్వీ విధూ మందహాసం; పితృవత్సల నీలాకాశం,
పైగా పూలు, సురభిత శంపాలతలు, మంత్ర ముగ్ధ స్నిగ్ధ హృదయోల్లాసం
ప్రేతాలను మేలుకొలపట మెందుకిప్పుడు మరుగులోంచి;
చెప్పని దానిని గురించి పెందుకిప్పుడాలోచన?
'సంభూత మొకటే నిజం! సంభావ్యం ఒక యోచన
వలసిన దేశం వాడెడు కటికనేల!
వలసిన కాలం ఒక క్షణమాత్రపు సంజ వేళ
పెనుగాడ్పులు రేగినపుడు పండుటాకులన్ని ఎగిరి
ప్రళయ తుషార జ్వాలల అశ్రుకణములన్ని ఇగిరి
నీలి నిద్రలో, తడిసిన హేమంతపు కౌగిలిలో
శయనిస్తాం, శూన్య తమస్సుల చిక్కని ఉక్కని చలిలో,

# త్రిశంకుస్వర్గం

గాలిరాని చీకటి గదిలో
మారుమూల మదిలో
నిర్మించిన మహా ప్రపంచం; నేను విరించిని —
భారంగా ప్రేలాడే సిగరెట్ పొగ, పారాడే బండరాయి
చీకటితో పోరాడే వెలుతురుతో నోరాడని కటికదుమ్ము,
భూమ్యాకాశాల మధ్య ఆ త్రిశంకుస్వర్గంలో
తారాడే సాలీడుకు ఈడు జోడు వాడు వీడు
చాపమీద పొరలాడే నరాధముడు !

పాత బూజు జార్జిరాజు ఈ గదిలో
ఆకాశపు కిటికీల్లా, చీకటిలో చుక్కల్లా
ఇంటి కప్పులో చిల్లులు —
నిశ్శబ్దపు గాత్రంలా చిట్టెలుకల కీచులాట
ఆలకించి ఆనందించే బల్లులు.
చాపమీద యోగనిద్ర. పొర్లాడే నరాధముడు.

బయట జీవితపు తొందర
భుగ భుగ భుగ ఇంజన్ పొగ
తారురోడ్డు నిగ నిగ నిగ
ధగ ధగ లాడే కారులు, కూర్చున్న కులుకులాడులు.

హోటల్లో మహాజనం
కడిగే కప్పుల చప్పుడు
మ్రోగే మాటల డప్పులు
బల్లపైన చిల్లరకై వినాయకుడు యజమాని;
తొండ మొక్కటే తక్కువ !

మహా ప్రపంచపు హోటల్ వాకిట్లో అడుక్కొనే బిచ్చగాళ్ళ
కసురుతాడు వినాయకుడు అదృష్టపు లంజకొడుకు !
దుమ్ము ! దుమ్ము ! దుమ్ము !

మూసిన కన్నుల చీకటి కలలాగా క్లియోపాత్ర !
తన ఊర్వశి, హెలెన్ ఆమె,
కుందేందు తుషార హార ధవళ శుభ్ర సుమ కోమలి!
తల వైపున పూలగుత్తి!
దేవదూతలా నిలచిన నర్సు ఆమె!
తన తెల్లనిమల్లె వెనక, అతని కొరకు అమృతపాత్ర
కాచి దాచి తెచ్చిందట!
జీవితాల ఎంగిలితో నిండి ఉన్న ఈ గదిలో
అది రాలిన ఎండు మెతుకు, ఇది వాలిన పండుటాకు
జహ్నుమౌని మూత్రంలో జన్మించిన పవిత్ర దేవనదిలో
కొట్టుకువచ్చే చచ్చిన పందిపిల్ల!
ఉబ్బి, పొంగి, పాచిపోయి, తెల్లబడి పవిత్రమైన పందిపిల్ల!
గదిలో పొరలాడే నరాధముడు.

తలకడ తెలి పూలగుత్తి
తెల్లమల్లెలో దాగిన దేవదూత
గాలిలో జాలి జాలిగా మూల్గే శవవాద్యం
అన్నీ, ఇవి అన్నీ, ఆ కాలసముద్రపుటొడ్డున కడుగబడే గులకరాళ్ళు
అవి నురుగులు, చిరుబుడగలు, చీకటిలో చిన్ని కలలు,
నిత్యమేది? సత్యమేది?
ఇది సత్యం, ఇది నిత్యం.
ఒక్కక్షణపు మెలకువలో యుగయుగాల పెనుమంటలు
నెత్తురులా ఎర్రబడిన కడ్డీపై సుత్తి దెబ్బ
అపాయాల జయఘంటలు, పొక్కిన అరచేతి బొబ్బ!
జ్వరతీవ్రత, అంపసెజ్జపై భీష్ముడు
ఇది సత్యం, ఇది నిత్యం - గుండెలు పిండేటి బాధ!
నెత్తురుతో ఎర్రబడిన లోహగాథ!
చైతన్యం చరమసీమ చేరుకొన్న ఒక్క క్షణం!
జపాపుష్ప కాంతిలాగు, పచ్చిపుండు వాంతిలాగు
పసినెత్తురు కారుతోన్న ఒక్క క్షణం!

13

చావు పుట్టుకల బ్రతుకుల, విషమబాహు త్రిభుజంలో
మధ్యనున్న ఒక అదృశ్య బిందువులా
ఘనీభూత వాస్తవ కేంద్రీకరణం, ఒక్క క్షణం !
బ్రతుకు రంపపు రాపిడిలో రజనై రాలి
పొరల పొరల చెరగి నురిగి,
కాలపు అడకత్తెర మధ్య నలిగి
కంది కనలి కెంపెక్కిన, ఒకే జ్వలిత జీవ క్షణం !
లోకానికి నాడి ప్రీగి, కాలానికి గుండెలాగి
బ్రహ్మాండపు పుర్రెలోని భూకంపం !
ఒక క్షణమో, ఒక యుగమో, ఇది ఎవ్వడు చెప్పగలడు !
కండ్లలో మెరుపు తీగె ! చెవులను కరిగిన సీసం !
రక్తంలో లావా జ్వాలా కీలలు !
నే నెవ్వరు ? నీ వెవ్వరు ?
మాటాడకు ఒక్క క్షణం !

*

కండ్లలో ఎరద మడ్డి ! ఒంటిపైన బురద జిడ్డు !
తల నాదు ! కండరాల కటిక తీపు !
ఏడివడ పలవాటు తప్పి కనురెప్పలు !
రగిలే చీకటి తప్పులు !

జిగురు, జిగురు, చమురు, చమురు, మెలకువ అది !
పారుబోతు అడుగుల చిరు అలికిడి అది !
ఏదో పోగొట్టుకొన్న ఒక భావన ! అది మెలకువ
సర్వస్వం పొట్టబెట్టుకొన్న రక్కసి !

*

విసుగు ! విసుగు !
కనులముందు విసుగులేని ఇసుకబయలు
జీవితపు శూన్యంపై ముసుగు విసుగు !
ఎంతకూరాని తుమ్ము, వెళ్ళిపోని వాంతి
కడుపులో త్రిప్పుతోంది విసుగు త్రేపు !

అరగని అన్నపు మెతుకులు !
చెవిమూసిన ఈగ రొదలు !
అస్పష్ట కింకంఠంలా అనతి బాధ !
        సోదిలాంటి గాథ !
గుబులుకొనే మత్తుపొరలు
        రగులుకొనే చైతన్యం
జీవితమొక అప్రతింత
జీవితమొక పాళ్ళ పిరుపు
జీవితమొక గజ్జి కురుపు
మెరిసే నున్నని చర్మంపై ప్రాకే దురద విసుగు !
        విసుగు ! జీవితాల ముసుగు !

*

అది తెల్లని విసుగు గోడ !
అంతులేని దుప్పటిలా పరచుకొన్న దానిపైన
        నల్లని చిరుమచ్చలాంటి
        ఆశ్రయం వెదుకుతాయి అలసిన కనులు !
కాని దృష్టి గూడులేని పక్షిలాగు
        రోడ్డుమీది కుక్కలాగు
తిరుగుతోంది, తిరుగుతోంది, తిరుగుతోంది
        విసుగెత్తి. విసుగులేక !
గూటిలోని చిలుక కాదు !
కోనలో బెబ్బులి కాదు !
పిల్లినోట చిక్కుకొన్న ఎలుక అతడు !
శ్లేష్మంతో తన్నుకొనే ఈగ అతడు !
దేవనది నీటిలో మునిగి తేలి
చచ్చి, ఉబ్బి, పాచిపోయి
తెల్లబడి పవిత్రమైన
        పందిపిల్ల !

# మల్లెపూలు

మహానగరమధ్యంలో ప్రమోదవనంలాగు
హఠాత్తుగా గుండెలు పట్టుకొనే పలువిధాల పరిమళాలు !
వెచ్చని వేసవిరాత్రి ఒరుగుతోంది బరువుగా నగరంమీద
వెలిగే దివ్వెలమీద. తెరచిన షాపులమీద, తిరిగే జనంమీద !
వెచ్చని చీకటి రాత్రి. జీవం కరిగి ఊపిరిపీల్చే
నల్లని దేహంలా, ఒరుసుకొని తాకుతోంది ప్రపంచాన్ని.
చీకటి చెమ్మదనం తెలుస్తుంది కొంచెం గమనిస్తే
చీకటి చలిస్తోంది మానవుల కదలికతో !
చక్కిలిగిలి రగిలినట్టు కిలకిలలాడుతోంది విశ్వ హృదయం !
మంత్రంతో మాయానగరి ద్వారాలు తెరచినట్లు
జ్ఞాపకాల తేనియ పిండి బ్రతుకు పులుపు పంచినట్లు
సర్గ స్వర్గ విపినంలో ఒక్కక్షణం మాధవుని
మోహనమురళి మారుమ్రోగి తరంగాన్ని వినినట్లు !
జీవిత సంపుటిలోన పరిమళ మొలకెత్తి పుటలు అలరినట్లు
పూల అంగడిలోంచి పూలు పలకరిస్తున్నవి నన్ను
పన్నీరు చిలకరిస్తున్నది తెన్ను !

*

ఈ పూల బజారంటే ఇష్టం నాకు !
ఇక్కడికొచ్చి నిలబడతాను సంజ వేళ
ఒత్తుకొని, త్రొక్కుకొని, త్రోసుకొని, రాసుకొని
వచ్చే పోయే మహాజనసందోహం మధ్య.
మానవదేహాల చెమట వాసనలు కూడ పూల పరిమళాల
తేలి, కలసి ప్రసరిస్తాయి ఇచ్చటి గాలిలోన !
శత సహస్ర ప్రశ్వాసోచ్ఛ్వాస బాష్పోచ్ఛ్వాసన్న దిశా పాళిలోన !
ఈ గుంపు అన్ని రసులు, అన్ని వెర్రులు, అవయవాలు.
పరిమళ ప్రేరిత ప్రాణ ప్రకంపాత్త కణాలు !
స్త్రీలు, పూరులు, పిల్లలు, చీరలు, నగలు, ధరలు
వ్యాపార వివరాలు మాటాడుతూ, నవ్వుతూ !

ఈ మహాజనంమధ్య అహాన్ని మరచిపోయి
ఐక్యం కావచ్చు ఒక అదృశ్య పరమాణువులా !
వినీల సాగరంలో ఒక అల్పాశ్రుబిందువులా !
ఎలా తిరిగి వెళ్ళేది ఒంటరి గదిలోకి ?
గదిలో కడు ఒంటరి చీకటిలోకి ?
పూలు పలురకాలు !
దివంగత మాతృస్మృతులు కొనివచ్చే పారిజాతం
మాగిన సాఫల్యాన్ని సూచించే సంపెంగలు
చక్కని కళాకృతిలా చక్కిలిగిలిలా సన్నజాజులు
విరజాజులు, మందారాలు, చామంతులు, బంతులు
జూకామల్లె, రేరాణి, ఇంకా ఎన్నో పూలు !
అన్నిటినీ మించిన జీవరుధిరంలాంటి రోజాలు
అలౌకికానుభూతుల కలువలు, తామరపూలు
పూలు పలురకాలు !
కాని మానవజీవితాల మధుర మృణ్మయగంధంతో మరిపించే
మల్లెలను మించినది ఏదీ లేదు వాటిలో.
మల్లెపూలు ! మల్లెపూలు ! మట్టిలోంచి పుట్టుకొచ్చిన మల్లెపూలు !
మనుషుల్లా మాట్లాడే మల్లెపూలు !
నీ హృదయపు కథ విప్పి చెప్పటానికి !
ఒంటరితనాన్ని ఒంటరిని చేయటానికి !
మల్లెలను మించినది ఏదీ లేదు; అందుకనే
మల్లెపూలు కొని పట్టుకవెళ్ళాను నా గదిలోకి !
నా గదిలో మసకవెలుగు; మల్లెదండ బల్లమీద !
నేను పడకకుర్చీలో; పొగ క్రక్కే సిగరెట్‌తో —
బయట చీకటిరాత్రి, మూసిన ద్వారంలా,
స్పర్శ గంధ రస రూపాల జగత్తును బంధిస్తో
బాహ్యాంతరాల నడుమ సంపర్క సూత్రాలు ఖండిస్తో —
ఒంటరిగా నేను గదిలో, మసక వెలుగు.
మెరుస్తున్నవి పటాలు గోడలమీద
అతీతస్మృతుల్లాగ అలికినట్లుగ అద్దాలు !

17

బల్లమీద మల్లెపూలు, గాలి గప్పతిలా
పరిమళంతో బరువెక్కి నిండినది తనలో తాను !
కదులుతున్నది కమాను అవ్యక్తపు వయొలిన్‌పై
గడచిన మరచిన సంగతులు పలుకుతున్నది !
ఏ ఆశలు, ఏ వాంఛలు ఈ గదిలో
స్వప్నంలోనైనా నే సాహసించని స్వప్నాలు !
ఈ మల్లెల వాసనతో కలవరపడి మేల్కొన్నాయి !
రక్తం పరుగిడుతోంది మత్తిల్లిన మూర్ఛలోకి !
అర్థోక్తుల ముక్కల్లో, గీతల్లో !
ఎక్కడ నీవు ! ఎక్కడ నీవు !
తెల్లగా మెరుస్తున్నవి బల్లపైని మల్లెపూలు
బాధల చిరునవ్వుల్లా, టూత్‌పేస్ట్ ప్రకటనలా
బర్మా బియ్యంలా, ఆపరేషన్ గది గోడల్లా
దేవతల వస్త్రాల్లా, పసిపాపల ముఖాల్లా
మల్లెపూలు మేళవిస్తాయి సత్యాన్ని, స్వప్నాన్ని.
పరాన్ని, అపరాన్ని. భావాన్ని, ఊహనూ
సౌకుమార్యాన్ని, శక్తినీ, మోహాన్ని, ముక్తినీ, చావునూ, బ్రతుకునూ !
నిష్క్రియ చైతన్యంలో లీనమైనవి క్రియలన్నీ-
దేహం కరుగుతోంది ఆత్మగా - "ఏక మేవా ద్వితీయం" !
ఎక్కడ నీవు ? ఎక్కడ నీవు ? కలలాగా ఒక్క పిలుపు.
ఎక్కడ నీవు ? ఎక్కడ నీవు ? ఒక్కసారి రాలేవా ?
ఒక్క క్షణం నా గుండెల మబ్బుల్లో మెరుపువై రాలేవా ?
హోరెత్తి పోటెత్తే ఈ రక్తపునదుల వానకట్టపై
నా నిరర్థకాభినయపు యవనికపై
నా మరచిన పాటలోని పదాల పొందికపై
రాలేవా? రావా? రావా? రా! రా!
రా! ఇక్కడ ఈ గదిలో, ఈ మసక చీకటులలో
ఈ పిడికెడు మన్నుముద్దల చావులేని కలలో
నేను నీకు నిశ్చలంగా మృత్యువును మోహించటం నేర్పుతాను.
నీవు నాకు జీవితాన్ని ప్రేమించటం నేర్పుదువుగాని !

మనమిద్దరం ముక్తులై ద్వైతంలో అద్వైతాన్ని
నేర్చుకొని, తెలుసుకొందాం అనేకంలో ఏకాన్ని.
రా ! మనమిద్దరం వేళ కాలాల పరిమితులు దాటి
అస్తిత్వపు గుహలో, అనంతశూన్యంలో, గదిలో, చీకటిలో విహరిద్దాం.
పెదవులమై, చేతులమై, కౌగిలియై, చుంబనమై
ఒక జ్యోతిర్మయ క్షణమై చరిద్దాం !
ఒక్కక్షణం పొదల్లు, నిబ్బులు, సోమనాశక ద్రవ్యాలు మరచిపోదాం !
మరచిపోదాం క్రామిస్లు, నాడీలు, అభిశంసలు, దీర్ఘశంకలు !
జ్యోతి ఒకటి వెలుగుతుంది అశాశ్వత జీవితాల
చమటీమల భిన్న భిన్న చిహ్నాలు చెరిపివేస్తూ !
క్షణమాత్రం ఏమీ ఉండదింక, నీవుతప్ప, నేనుతప్ప !
నిగ్రో చీకటుల మల్లెల నవ్వుతప్ప –
మన శ్వాసల తుఫాను –
జీవనజలధి మథన జనిత వినీల హాలాహల కీల జ్వాల
హృత్కంప భూకంపాలు, మర్దిత పయోధర భూధరాలు
తాండవ నృత్యాందోళిత గ్రహ గోళ హిందోళాలు –
ఒక్క క్షణం గడుపుతుంది ప్రతి నరమూ, ప్రత్యణువూ
అస్ఖలితమైన, అనన్యమైన, ప్రత్యేకమైన జీవితం !
ఒకే ఒక అగ్నిశిఖలో అన్నీ లీనమైయున్నా !
తరువాత మరి ఏమిటని అడుగకు నన్ను !
బహుశా ఒక హిమశీతల మృత్యు నిద్ర
మూస్తుంది ముద్దులతో కాలిన పెదవులనూ, పెదవులనూ !
అలసిన రక్తం విశ్రమిస్తుంది నిశ్చల నీల సాగరంలో !
బహుశా మనం ఉండమేమో ఇక్కడా, అక్కడా, ఎక్కడా !
రా ! ఈ క్షణం ఇక్కడ మల్లెపూల సన్నిధిలో
రాజీ పడదాం మన కరడుగట్టిన అహాలను కరిగించి.
విరిగినా వంగిపోని ఉక్కు బెదదల విడుదలకై
మెత్తని వెన్నెల వెన్నలా, జున్నులా మరిగించి.
మహాత్ముల ఉచిత వాంఛల విశిష్టాద్వైతంలో
ఏకం చేదాం మనం మల్లెలను మంటలతో !
ఎక్కడ నీవు ! రా! రా! మల్లెలు పిలుస్తున్నయ్ !

# కామ్రేడ్ రాయ్ స్మృత్యర్థం

**'But that which is only living, can only die'.**

*T. S. ELIOT (Burnt Norton)*

పొగమంచు క్రమ్ముతున్నది
శిథిలాంగాల వైరస్యం క్రుంకుతున్నది
త్వరత్వరగా చలికాలపు ప్రొద్దులాగు.
తృషిత మృత్యు వైతరణిలో ప్రాణరసం ఇంకుతున్నది
ఎగిరిపో నుంకిస్తోంది రామచిలుక
పెదవులపై ఇగిరిపోయే ముద్దులాగు
కడిగివేసి పాత జ్ఞాపకాల పలక!
సంధ్యారాగపు రేటాని అలలు విరిగి పడుతున్నవి.
తెరువని తలుపు తడుముతున్నది.

*

ఇది కాదా మన మృత్యువు —
చిరపరిచిత మిత్రుడు మృత్యువు!
పెరిగినదంత చెరిగిపోయే
మహాశూన్యపు మర్గపు మూల తీరాలంట
పులుగు గూటికి తిరిగిపోయే చరమక్షణం!
సర్వ విరమణ పరమక్షణం!
మాసిన చొక్కాలా ఈ దేహాన్ని విడిచివేసి
శబ్దాలందని త్యజించి విహరించే ధ్యానంలా
కనుపించని కిరణం దాటి, అయినవారి అకళ్ళల్లో అశ్రులు తుడిచివేసి
పయనిస్తున్నాడు దేహి మునుపెరుగని మార్గమూని.
దారి ఖర్చు అక్కరలేదు వెళ్ళికాని!
ఇచ్చటనే ఉన్నది చిన్నబోయిన గూడు
పెదవి విరుపు, కన్ను మోడ్పు, నొసటి ముడుత, వల్లకాడు!
　　మనమెరిగిన ఈ దేహం
　　మంటిని మొలచిన మోహం!

*

శేషమేమిటి ?
జయాపజయాల జమాఖర్చులు చూసినాక
కలుషం కలసిన కర్మల కషాయాన్ని రాచి వడపోసినాక
మిగిలే సత్యలేశమేమిటి ?
పొగమంచుల మసకలోంచి
త్రుటి మాత్రం తొంగిచూచి మాయమయ్యే జ్యోతిర్లేఖ ?
మృణ్మయ మరణంలోంచి మరల మరల మొలకెత్తే జీవితాశ ?
అవినశ్వర రవి కిరణం
శాశ్వత శతదల గంధం !
సకల సంశయాల శరణం
నిర్మోహం, నిర్ద్వంద్వం
సంధ్యా సాగరతటాన జాగ్రత జ్యోతిఃస్తంభం !
అన్ని యాత్రలకు అంతం, ఆరంభం !

*

ఎక్కడున్నవి సామ్రాజ్యాలు ?
విద్వేషాల విలయాగ్నులకు ఆకాంక్షల ఆజ్యాలు !
ధ్వస్తావ్యస్త జనపదాల, పత్తనాల పథంపై
విహరించిన వాహినులేవి ?
వాహనాలు రేపిన దుమ్ము మాత్రముంది ?
సాహసించిన కరాలేవి ? కరవాలాల గురుతేముంది ?
కూలిన కోట గోడలపైన నీచపు నాచు ముసురుతోంది !
చలువరాతి తిన్నెలమీద పిరికి పాచి పెరుగుతోంది !
నేటి క్రొత్తఢిల్లీ రేపటి ఇంద్రప్రస్థం !
నేటి క్రెమ్లిన్ రేపటి బేబిలోన్ !
నీరో లేడు, ఫిడేల్లేదు, కాని ఇంకా ఆరిపోని దహనాలు
మాయకున్నవి మానవ హృదయఫలకంమీంచి.
చాణక్యుడు, మేకియావిలీయు మరుగుపడినా,
బుద్ధుడు, క్రీస్తు మరుపుకురారు !
పొగమంచుల మసకలోంచి మరల మరల కాంతికిరణం వ్యాపిస్తుంది.

క్షత విక్షత వక్షంలో ఛిద్రపడిన మనుజమాత్రుల ఏకైకాశ ఫలిస్తుంది.
చరమ విజయ ముహూర్తాన లాజరస్ లేస్తాడు యూదా!
మానవ సూతి కోరుకొన్నది శిలువ కాదా?
మంటిముద్దల నెత్తుటిజల్లు కురిసిన కుసుమ పారిజాత పరిమళాలు శ్వసిస్తాయి
కంటకావృత భయద సంశయవిపినంలో పురోగాముల పదముద్రలు
ప్రసవిస్తాయి
పరాజయం పొంచి ఉన్న హృదయాలను పరిహసిస్తాయి!

*

నేడు ఇచట పగిలి రాలే రాజ్యాంగాల ధ్వంసంలో
నిలుచున్నాడు నిలువొకడే మృత్యుంజయుడు.
పొగలు సెగలు క్రమ్ముతున్నవి, కన్నులు నీరు చిమ్ముతున్నవి
తీసిపోడు ఆతడు ఏ అంశంలో మునుపెరిగిన మహానీయులకు.
వినిపించని శిలువ నేడు, అదే ప్రశ్న, శబ్దాల్లో మారుతున్నది.
"దేవా! వదిలేశావా నీవు కూడా?" బరబ్బాను విలపిస్తాడు.
యుగ యుగాల ఆవేదన నెత్తురుగా పారుతోంది
ఎండి మండిన ఈ కటిక నేలమీద!
మళ్ళీ మానవ హృదయం బ్రద్దలయ్యి, పచ్చినెత్తురు ముద్దలయ్యి
ప్రసవిస్తోంది, స్రవిస్తోంది
తృషా దగ్ధ వసుధా కంఠ గహ్వరంలో
కొంచెం కరుణ
తులసి నీళ్ళు
నవ్య సృజన బీజాలు!

# అమాత్యుని అకాలమరణం

"నిన్న ఉదయం ఎనిమిదింటికి
మద్రాసున స్వగృహంలో
పోర్టుఫోలియోలేని మంత్రి "శ్రీ ఫలానాగారు"
హృద్రోగం చేత మరణించారు.
కుటుంబాన్ని, దేశాన్ని దుఃఖాంబుధిలో ముంచారు!
వయస్సు ఎంతో లేదు. (పాపం) 45.
ఈ కష్ట సమయంలో వారి నుంచి
ఎంతో ఆశించింది దేశమంతా!
గొప్ప రాజకీయవేత్త; అర్థశాస్త్రంలో నిపుణుడు
(మంచి సాహిత్యవేత్త, సినిమాలను బాగా వినికిడి.)
నాలుకపై ఆడేవి జనాభా లెక్కలన్నీ.
ఆయన కూర్చోగానే సభా భవనాలకు
వచ్చేదొక వింత అందం! శ్రోతలకు ఆనందం!
ఆయన గర్జించినపుడు శత్రువుల గుండెల్లో
పరుగిడేవి చిట్టెలుకలు!
ఆయన మంచినీళ్ళప్రాయంగా మాట్లాడుతూ ఉంటే
హాయిగా నిద్ర వచ్చేది జనసమూహాలకు.
ఇంకా వృద్ధిలోకి రావలసినవాడు, హఠాత్తుగా పాపం ..
వారి కుటుంబీకులకు, మిత్రులకు సంతప్త హృదయాలకు మా సానుభూతి!"
(ఆయన పడుచు కార్యదర్శిని సంతాపం పీకెలుగును!)
ఈ విధంగా చిక్కని నల్లగీతల మధ్య రాశాయి పత్రికలన్నీ!
"ఒక తార రాలిపోయింది. ఒక చెట్టు కూలిపోయింద"ని
అనన్య ప్రచారంగల ప్రముఖ దినపత్రిక సంపాదకీయం!
నాయకుల సానుభూతి సందేశాలు, శోక సభలు
అశేష ప్రజానీకపు విశేషమైన జోహారులు
మరణానంతర సన్మాన ప్రదర్శనాలు
చూచి ఆనందించనివాడల్లా, పాపం, అమాత్యుడొక్కడే!

అమాత్యుడు లేడిప్పుడు !
మిగిలినవి ఎలుకల చప్పుడు !
అందమైన బంగాళా అద్దె కిచ్చేశారు !
అమ్మేశారు సర్క్రాంత్తి కారు !
చత్రం కట్టిన సన్మానపత్రాలు మూటకట్టి
పెళ్ళాం పిల్లలు స్వగ్రామానికి తరలిపోయారు !
అమాత్యుని శేషచిహ్నాలు
అతడావిష్కరించిన ఎలుకరన్నాలు !
అమాత్యుడు చనిపోయాడు
పట్టని ప్లేట్‌ఫారం మీద మూగిన మహాజనం
నినాదాలు, పూలమాలలు, నగుమొగాలు
వెదుకుతోన్న వేయికనుల స్వాగతాలు
అతని కొరకు కావిప్పుడు !
అతనికి ఎలుకల చప్పుడు !
అమాత్యుడు నిదురించాడు
జీవిత సప్తపర్ణాల స్వప్నాలు సోకలేని
జీవిత జ్వరోన్మాదపు పలవరింతలు ప్రాకలేని
మంచుదుప్పటి కప్పుకొన్న మరణశయ్యను.
కౌగిలించుకొన్నాడొక కొరకరాని కొయ్యను.
చనిపోయిన చరిత్రల గ్రంథిల గ్రంథాల్లో
చిరిగిన, మురికి మరకలైన పేజీలవి !
భూలుంఠిత కిరీటాలు
బద్దలైన కవాటాలు !
సమాధులు, శ్మశానాలు
నాచుపట్టిన శిథిలాల్లో
పాచిపోయిన జ్ఞాపకాలు
గబ్బిలాల నృత్యాలకు
ఉలూకాల గానాలు !
రాజ్యాలివి; అద్దెకిచ్చిన బంగళాలు !

అమాత్యు డెక్కడున్నాడు ? ఏం చేస్తున్నాడు ?
చలికాలం, చీకటిరాత్రి
హోరున వీస్తున్నది ఈదరగాలి:
నిర్జన వీథుల్లో ఈలవేస్తూ.
మూసిన కిటికీలపైన జాలిగా సోలి, వాలి.
మాతృపరిష్వంగంలో శయనించిన శైశవం.
ఉష్ణ పరిరంభంలో నిదురించిన యౌవనం.
ముదుసలులకు పరుపులనుంచి, రగ్గులనుంచి పరువొచ్చిన వెచ్చదనం :
కాని ఇచట శీతలసమాధిలో కటికనేల
మృతకాత్మలు కలవరించి, పలవరించి పొరలేచే.
కనులముందు స్వర్గ నరకచ్ఛాయా చిత్రావళి
అతీత ప్రేత స్మృతుల నృత్యావళి !
కటికనేల, వాలు కుదరక కునుకుపట్టక
పొరలుతోంది అమాత్యుని గౌరవనీయమైన శవం !
చావుకు మర్యాదలేదు; గౌరవనీయులకూ పరాభవం !
అమాత్యుడు చనిపోయాడు.
రాజకీయపు ఎత్తుగడలు
ప్రజాక్షేమ పంచవర్ష ప్రణాళికలు
కుర్చీలు, మేజాలు, ముఖ్యమైన కాగితాలు, పత్రాలు,
పత్రికా విలేఖరుల సమయోచిత ప్రశ్నలు
ఎముకపిండి ఫేక్టరీ తెరువవలసిన అగత్యాలు
పందుల పెంపకానికి ప్రత్యేక పథకాలు
అన్నీ మరచిపోయి....
కొడుకు చదువు, మేనల్లుడి ఉద్యోగం.
బంధుమిత్ర ప్రముఖులకు లైసెన్సులు, పర్మిట్లు.
ఎందుకో తలపుకొచ్చే సుందర వదనారవిందాలు
కార్యదర్శినీ పక్షోజ కందుక క్రీడలోని ఆనందాలు
అన్నీ మరచిపోయి, చటుక్కున చనిపోయాడు.

పురుగుల పురిటిగది
అమాత్యుని సమాధి అది !

హోరున వీస్తోంది శరదంగాలి,
చెడిన, త్రుప్పుపట్టిన జీవిత యంత్రాలపైన వాలి.
జాలిగా తాకుతోంది మొండి మ్రోళ్ళను,
చలికి బిగిసిపోయిన కీళ్ళను,
అమాత్యు డెక్కడున్నాడు;
        ఏం చేస్తున్నాడు ?
పత్రికల శోకసంచికలు పరిచుకొని నిదురించాడా ?
గాలిలో ఎవరిదా కేక ?
మృతకాత్మల అశాంత ఆర్తనాదం !
కాళ్ళు చాపుకొనేందుకు చోటుచాలక వివాదం !
చీకటిలో చెరిగిపోయే చిత్రాలు
అమాత్యుని శ్వేతపత్రాలు !
ఎక్కడయా ఆయన చేవ్రాలు !
మంచు కురుస్తున్నదా సమాధిమీద ?
మరచిపో, మరచిపో, మరచిపో జీవితాన్ని !
గానుగటెద్దుల గతాన్ని !

*

రాక పోకలులేని బాట
ఇరుసు విరిగిన బండిలా నాగరికత
గాలిలో జోలపాట —
ఈ కటిక నేలపైన నిర్మించిన అంతరాలు
పిరమిడ్లు, తాజమహల్, ఉన్నత మృత్యుశిఖరాలు
బ్రతుకొక పంటలరాటం --
అది తీరని ఆరని ఒక ఆరాటం !
నిదురపో ! నిదురపో ! నిదురపో !
ఈకటికనేలపైన ఇక్కడ సంప్రాప్తశాంతి !
        ఇంకా తీరలేదా భ్రాంతి !
మృతకాత్మల అనాథశరణాలయం !
        ఇక్కడ ఇంకేమి భయం ?

హోరున వీస్తోంది గాలి !
చల్లని వ్రేళ్ళకొనల తాకుతోంది
విషపుశ్వాసలా చెంపకు సోకుతోంది
పగిలిన తలుపుల కిటికీల సందుల్లోంచి మూల్గుతోంది, నీల్గుతోంది.
శీతలసమాధిలో ఒమాత్యుడు అశాంతిగా
        పొరలుతున్నాడు నిద్రపట్టక
జీవితం ప్రశ్నిస్తోంది ఎదురుతిరిగి
        ఆత్మ నసుగుతోంది జవాబుతట్టక !

# పలాయనం

(తొలి పలుకు)
జీవితం తింటోంది తనను తాను,
కాలె కడుపు నింపుకొనేందుకుగాను
క్రొవ్వొత్తిలా తింటోంది తనను తాను !
        నిలకడగా
        నెమ్మదిగా
        తొందరగా
        చిందరవందరగా
                తింటోంది తనను తాను.
అనుక్షణం గుప్పిటలోంచి
ఇసుకలా జారిపోయి
చిల్లికుండలోంచి కాలపు
నీటిలా కారిపోయి
టికటికమని కొట్టుకొనే
గుండెల గడియారంలోంచి
నిమిషాలు లెక్కపెడుతోంది
ఆఫీసు మూసివేసే గంటకొరకు
నాటిన విత్తనాల పంటకొరకు.
మృత్యువు ఏదో ఒకపూట
చూచిపోయే అతిథి కాదు;
వెంటబడిన అప్పులవాడు !
పుట్టుకతో పుట్టిన చావు
చావుతో చస్తోంది.
ఈదేహంతో బాటే
మన్నులో కలుస్తోంది.
        ముందుకు సాగటమెలాగ ?
పెట్రోలు కాలుతోంది.

యాత్రకు అంతంలేదు
పెట్రోలుకు ఉంది.
మరుక్షణం ఈ కారు
(మధ్యలో ప్రమాదాలు లేకున్నా)
ఏ నిర్జన వనంలోనో
ఏ ఎడారి సగంలోనో
ఆగిపోక తప్పదిది: పెట్రోలు చాలని కారు!
కొలతబద్ద లేని లెక్క,
అంచనాలు పనికిరావు!
కారులో పెట్రోలు ఎన్ని మైళ్ళు వస్తుందో
ఎవ్వడూ చెప్పలేడు,
చెమటలు, కన్నీరులు వృథా, వృథా.
నెత్తురైనా ఈ కారును నడుపలేదు!
పాలిన ముఖాలు
చితికిన సుఖాలు
పుస్తకాలు, దృష్టి మాంద్యం
మతిమరుపు, బుద్ధిమాంద్యం
పలుచబడిన కేశాల్లోంచి
తొంగిచూచే బట్టతలలు
జీవితం తింటోంది తనను తాను.
క్రొవ్వొత్తిలోంచి క్రొవ్వు
చుక్కలుగా నేలమీద రాలుతోంది,
ఆ ఎర్రగులాబి పువ్వు
పడమటి సంద్రంలో వాలుతోంది.
కూతవేసింది ఇంజన్
సమీపిస్తోంది స్టేషన్.
మరుక్షణం మిగిలేవి
రాలిన క్రొవ్వుచుక్కలో
గుప్పెడు బూడిద మసిలో

దాగిన ఎముకముక్కలో ?
రైలుదిగి టికెట్టు ఇచ్చివేసి
మసక సంజ చీకట్లో
ఖాళీ జేబులతో
బయలుదేరుతాం మనమిక.

దిక్కుల్లేని దిక్కువైపు
చుక్కల్లేని చుక్కవైపు
లెక్కల్లేని లెక్కవైపు.
(పలాయనం)

పోదాం పద !
జీవితపు జమ ఖర్చు ఖాతాలిక మూసివేసి
బ్రహ్మాండపు గోడికలో కాలాన్ని తీసివేసి
మిగిలిన శూన్యం చేపట్టుక పోదాంపద !
కనుమరిగిన ఆకాశపు వెయికనుల నాగుబాము
బుసకొడుతోంది భూగర్భపు కండ్లులేని కొండచిలువ.
మమకారపు విషపుపోటు మందగించి
కలవరించి కదిలినాడు కటికచెరల ఒక ఖైదీ –
"ఏది ముక్తి, నాకేదీ ?"

నిద్రా మధు పానముచే
ఒడలు మరచి నిదురించే ప్రహరీలకు
నీడల కదలిక తెలియదు
గోడలు ప్రిదులుట తెలియదు.
తెలియదు అర్ధరాత్రి హెచ్చరికలు.
నలుదిక్కుల నిశ్శబ్దం
రాకాసి గుసగుసల్ని వినిపించదు

ఎక్కడయా రామమూర్తి ?
రామమూర్తి లేడేమో, నాకిప్పుడు తోడెవ్వరు ?
ఒంటరినపు పొదల గుబురు !

అడవిజంతువుల కదలిక
ముందడుగెట్లాగ ఇక ?
ఈరేయి జీవితాల
చవిటిపర్రపై వెన్నెల కాస్తున్నది !
నిశ్శబ్దం మూస్తున్నది
గుండెమీది బరువులాగ,
నవనాడుల తీగెలాగ.

మంచు తగిలి ముడుచుకొన్న
పుష్ప ప్రేతముల పుప్పొడి
చమురునిడుకొను బ్రతుకుల
దివ్వెల మలిజాముల కాడి
ఈ వెన్నెల !
మెలకువ నెరుగని కిన్నెర కన్నెల కల
నిద్రారుద్రస్థలిలో నిశ్శబ్దపు సవ్వల జల
ఈవెన్నెల, తెలివెన్నెల !

ఈబీడులోన నేడు తెల్లని వెన్నెల చూపాను
ఎండిన ఆకుల గలగల కదతే పయొంజిన్ కమాను.
రాకుమారి ! రాకుమారి !
నీవే నా రాకుమారివి !
ఏడు మల్లెల తులతూగే సుకుమారివి !

ఈరేయి తోడు రావా ?
నన్ననుసరించలేవా ?
మరచిపో రోడ్ల దుమ్ము !
మరపు ఎవని సొమ్ము ?

ఆఫీసు మెట్ల మూళ్ళు, టైప్‌రైటర్ టక టక
పీనుగ కుర్చీల నీళ్ళు, బల్లపైన సిరామరక !
కళ్ళ జోళ్ళ కటికచూపు
రాకాసి రూపు —

మరచిపో నిన్ను నీవు !
[జీవితమొక తెల్లటావు !]
చెరవీడిన రాకుమారీ ! పోదాం, పద !

ఈ వెన్నెల దుప్పటిలో
కునికే కృష్ణచ్ఛాయలు
పాతాళపు పీడకలల
భీకర శాంబర మాయలు
రేపు పగటి వెలుగులోన
నిజమై, నిజరూపం ధరించి
తూరుపు నెత్తురుముద్దల
కనుగుడ్లు మిటకరించి
మన త్రోవకడ్డమై నిలువకముందే పోదాం, పద !
పోదాం, పద !

*

ఎకరాడికని అడుగవద్దు !
ప్రశ్నలు అనుమానాలన్ని రద్దు !
చేతబట్టి ఖాళీ సంచి
పోదాం, పద ముందిక్కడినుంచి !

ఎకరాడికైనా సరే
బ్రతుకు వేటగాడు విసరే
ద్వేషపు బాణాలనుంచి
కాబూలివాని చక్రవడ్డీలాంటి
ఉదయాస్తమానాలనుంచి.
ఆసక్తినుంచి
విరక్తినుంచి
సర్వనామంనుంచి, విభక్తినుంచి
జీవితపు వ్యాకరణంనుంచి
ఇంద్రియాల సహాయ నిరాకరణంనుంచి
అంకెల నిరంకుశత్వంనుంచి

యంత్రాల శత్రుత్వంనుంచి
మూకల భ్రాతృత్వంనుంచి
నిప్పు నిరుల వావినుంచి
అరనుంచి. పాపునుంచి
వైసందిని వ్యవహారిని
పరాంశ భిన్నాలనుంచి
బీజగణితపు ధర్మపన్నాలనుంచి
ఎక్కడికైనాసరే, దూరంగా పోదాం. పద!
ప్రచారం నుంచి
వ్యభిచారం నుంచి
నినాదపు కోలాహలం నుంచి
ఘోషా చీకటినుంచి
స్నానపు దుస్తులువేసిన
బట్టబయలు పట్టపగలునుంచి
రికపైరుకు పట్టుకున్న తెగులునుంచి
జలగల విశ్వాసంనుంచి
రాబందుల ఆశ్వాసంనుంచి
తోడేళ్ళ జాలినుంచి
మొసలి కన్నీరునుంచి
నక్క వినయంనుంచి
కొంగ జపంనుంచి
తుమ్మెద ప్రేమనుంచి
కుశల ప్రశ్నలనుంచి
పోదాం పద దూరంగా!
ఎక్కడికైనా సరే
శిథిలగృహపు నీడదాటి
హంతకుని జాడదాటి
గూఢచారి కన్నుల్లా వెలిగే దీపాలుదాటి
గొందుల పాపాలుదాటి

33

దప్పిగొన్న పెదవుల్లా ఎండుకొన్న చేలు దాటి
చింపిరి తలలాంటి అరణ్యాలు దాటి
గొడ్రాలి రొమ్ములాంటి
కటిక కొండ కనుము దాటి
పేరుకొన్న నెత్తుటితో నల్లబడిన
బ్రహ్మాండపు కోట దాటి
అదృష్టం గీసిన గిరి దాటి నేడు
దూరంగా పోదాం పద !

గడిపాం చాలారోజులు –
గాథలతో బాధను మురిపిస్తూ
ప్రణయంలో ప్రళయం మరిపిస్తూ
పెదవులపై నవ్వులు కురిపిస్తూ
మనసులలో పువ్వులు చిదిమేస్తూ
హాస్యానికి దాస్యం చేస్తూ
రుదనానికి భాష్యం రాస్తూ
గడిపాం చాలారోజులు
దులిపాం ఎన్నో బూజులు.

పార్కుల్లో సాయంకాలం
కాలానికి వేశాం గాలం.
వేరుసెనగ పప్పులు తింటూ
రేడియో సువార్తలు వింటూ
కానీ సిగరెట్టు నిషాలో
నిరుపాయపు పగటికలలు కంటూ
"మూలనున్న బెంచీ చివరన
కూర్చున్నది ఊర్వశి" అంటూ
పనికిరాని మాటల అడుగున
ఆరాటపు గంటల గణగణ !
పులిజూదం, బ్రతుకొక జూదం
నీకెందుకు ఇక ఈ ఖేదం ?

ఎన్నటికీ తీరని కోరిక
ఎన్నటికీ ఆరని దప్పిక
గులకరాళ్ళ మేకలు చస్తే
కొండెక్కిన పులులు గెలిస్తే
        ఇది యుద్ధం. కరువు కాటకం
      జీవితమొక మాయనాటకం !
జీవితమొక క్షణికోన్మాదం
జీవితమొక వ్యర్థ వినోదం
కాటుక చీకట్ల అగాధం
నీ కెందుకు చెప్మా ఖేదం ?
స్వప్నాల్లో ఎరిగినదానికి
ఎన్నటికీ జరుగనిదానికి
ఎందులకో కాచాం తెన్నులు
కిటికీల్లా తెరచిన కన్నులు
చీకటి పడిపోయింది
నిరాశల, అపజయాల దీపాలు వెలుగుతున్నాయ్ ఒక్కటొకటే -
                                        పాపాలు పొగులుతున్నాయ్ ఒక్కటొకటే
అలసిన పాదాలు ఇంటివైపు నడుస్తున్నాయ్
అలసిన నేత్రాలు ఆశ్రయం వెదుకుతున్నాయ్
        నిద్రా వటవృక్షంపైన
        కలలగూళ్ళు చేరేందుకు
            త్వరపడుతున్నాయ్ పక్షులు.
        లేచి ఇంటి కెళ్దామా ?
        ఇంకా కూర్చుందామా ?
మరి కొంచెం సేపటిలో పురుగైనా ఉండదిచట
నిశ్శబ్దపు చీకటితో గుసగుసలాడుతోన్న నిర్జన వీథుల్లోన
త్రోవతప్పిన బాటసారి చెప్పుల చప్పుడు తప్ప
                                                            కుక్కల మొరుగుడు తప్ప
                                                                ఏమి వినిపించదు !

వీథి దీపం వెలుగుతప్ప ఏమీ కనుపించదు!
లేచి ఇంటి కెళ్దామా ?
ఇంకా కూర్చుందామా ?
పోదాం, పద !
పులిలాగా విరుచుకపడే రేపు నుంచి
చలిలాగా గిరిలాగా వెంటబడే నిన్ననుంచి
హోరునుంచి, జనంనుంచి
వెలుగునుంచి, సందడినుంచి
నిశ్శబ్దపు చీకటినుంచి
ముఖాలు, ముఖాలు
విసుగెత్తే తోలుబొమ్మల
జీవంలేని ముఖాలనుంచి
పోదాం, పద !
ఏదో ఒకటి చేదాం, పద !
పద....పద....పద....పద ! పద ! పద !
ఎక్కడుంది మెరుపులేఖ
ఎక్కడుంది మన కాశీ ?
మన మక్కా !
సంతప్త ప్రాణికోటికి నీడనిచ్చే బోధివృక్షం ?
ఎక్కడుంది ? ఎక్కడుంది ? ఆత్మల తీర్థస్థానం ?
పారిజాత దివ్యాఘ్రాణం ?
పాలకడలి, నీళ్ళకడలి, నెత్తురుకడలి, అన్నీ దాటి
రాక్షసవక్షంలో కత్తి నాటి
కాకులు దూరని కారడవుల్లో
చీమలు దూరని చిట్టడవుల్లో
వేయితలల నాగుబాము
మోస్తున్న మణిదీపం చేతబట్టు !
మూడుతలల వేటకుకర

కాక మాంసపు ముకలి వెయ్యి !
బండరాతి గుండెలు బ్రద్దలుకొట్టు.
బండరాయిలో నున్నది పంజరం
పంజరంలో నున్నది రామచిలుక
రామచిలుకలో నున్నది నీప్రాణం
ఆత్మల తీర్థస్నానం !
పోదాం, పద !
ఎటువైపని అడుగవద్దు
అనుమానాలన్నీ రద్దు
అనుమానం తీర్చేందుకు
సమాధాన మిచ్చేందుకు
లేదు నేడు త్రోవ తెలిపే
గండభేరుండాల జంట
రా సాహసించదు మన
నీడైనా మన వెంట !
నీడలేదు, తోడెవ్వరు ?
పడగవిప్పి బుసకొట్టే నాగుబాము
వెంటబడే వేటకుకలి
నాకు నీవు దకలి
నీకు నేను దకలి
తోడెవ్వరు, నీడెవ్వరు ?
మన అడుగుల సందడులే
మన గుండెల దడదడలే తోడుగాగ
నాగుబాము వేయిపడగలు నీడగాగ
వేటకుకలి తోడుగాగ
పోదాం పద వెనుదిరిగి చూడకుండా !
అహోరాత్రులు అలాగ నడుస్తూ
ఆయాసపు నిట్టూర్పులు విడుస్తూ
పోదాం పద !

యాత్రకు మజిలీ ఉంది.
పలాయనానికేది మజిలీ ?
గమ్యస్థానం యాత్రికులకు
శరణార్థులకు గమ్యస్థాన మెక్కడిదీ ?
శరణునుంచి పారిపోయే
శరణార్థుల చరణాలకు
శరణు ఎవ్వడివ్వగలడు ?
తన నీడ చూచి తానే
భయపడి పరుగిడువానికి
అభయమెవ్వడివ్వగలడు ?
నడకకు అంతం పడక
ఈ నడకకు పడక లేదు
ఈ నడకకు అంతం లేదు
ఈ నడకకు అర్థం లేదు
    అయినా ఇది వ్యర్థం కాదు !
నడకలో ఉన్నదొక అందం
నడకలో ఉంది ఆనందం
నడకలో యతి ప్రాసలు
నడకకొక ఛందస్సుంది.
    నిట్టూర్పులు విడుస్తూనే
    అలాగ నడుస్తూనే పోదాం, పద !
వేసవికాలపు ఎండల
మాడిన వెచ్చని గాడ్పులు
చల్లని చీకటి గుండెల
తాకి చల్లబడు వేళల
    నేను నీకు నిర్జన వనపథంలోన
    నిలబడి చుక్కలు చూపిస్తా!
"అదిగో ధ్రువ నక్షత్రం!
సప్త ఋషులు, అదిగో అరుంధతి, పతివ్రత!"

వర్షాకాలపు రాత్రుల తమః తమచ్ఛాయల
ఎగిరే మిణుగురు పురుగుల
గుప్పిట్లో పట్టుకొని విడిచిపెడదాం !
ఫోరుమని జోరుమని వర్షం కురిస్తే పురాతనపు
మర్రిచెట్టు ఊడలక్రింద నిలబడదాం !
వర్షం వెలిసిపోగానే వెడదాం !
చలికాలపు ఉదయాలను
లేత వెలుతురుల మిసిమిని
మన శ్వాసలు ఆవిరిగా లేచిపోవటం చూద్దాం !
ఎండిన రాలుటాకులు అడుగుల క్రింద
విరిగే సడి వింటూనే నడచిపోదాం !
నడచి నడచి భూమి అంతమొందే చోట
కాలమాగిపోయే చోట
పండుకొని ప్రశాంతంగా ఆకసంవంక చూస్తూ
మనం కళ్ళు మూసుకొంటే
అదే మన యెరుషలేము
మన కాశీ, మన మక్కా
నీడనిచ్చే బోధివృక్షం

ఆత్మల తీర్థ స్నానం,
పారిజాత దివ్యాఘ్రాణం !

(మలి పలుకు)
జీవితం తింటోంది తనను తాను.
కాతర నేత్రాల్లో ఆశలను వెలిగించిన
దీపాలు ఆరుతున్నాయి ఒక్కొక్కటే.
నల్లతెరలు జారుతున్నాయి ఒకటొకటే.

సృష్టి వేదికపైన మరుక్షణం
మెరుగులు తీస్తవి వెలుగులు
పారాడుతవి పురుగులు !
ప్రేక్షకులు ఒక్కొక్కరు

మరలినారు ఇంటివైపు !
నాటకం ఎంతసేపు ?

అది ఇంద్రుని సంస్థానం
గంధర్వ దివ్యగానం.
ఏది రంభ ? ఏది ఊర్వశి ?
ఆ అప్సరస లందరేరి ?
మ్రోగింపవా పైఫప ప్రస్థానభేరి ?
ఈగలు ముసురుతున్నాయ్.

తీగెలు తెగిన తంబురాలు
తిరుగబడిన ఖాళీపాత్రలు
ఒలికిన ద్రవాలు !
ఎండిన గంధపు పూతలు, వాడిన పూలు,
[జీవితపు టెంగిలిని
ఊహలనే అంగలతో దాటిపోదాం, పద !]
ఇక్కడ ఈగలు ముసురుతున్నాయ్ !

*

[చావునుంచి పారిపోవటమే బ్రతుకు]
బ్రతుకునుంచి పారిపోవట మెక్కడికి ?
[తలపునుంచి పారిపోవటమే మరుపు]
మరుపునుంచి పారిపోవట మెక్కడికి ?
జైలునుంచి పారిపోతే బయలు
బయలునుంచి పారిపోవట మెక్కడికి ?
గోడను తప్పించుకొంది నీడ
నీడను తప్పించుకొనే దెప్పటికి ?
జీవితంనుంచి పలాయనమే కళ
కళనుంచి పలాయన మెలాగా ?
మెలకువనుంచి పలాయనమే కల
కలనుంచి పలాయన మెలాగా ?

బాటను మరిపించేది పాట
　　పాటను మరిపించే బాట ఏది ?
ప్రవేశాన్ని తప్పించేది ప్రస్థానం
　　ప్రస్థానాన్ని తప్పించే బాట ఏది ?
శ్మశానానికి పంటచేలు పట్టణాలు
　　పట్టణానికి శ్మశానాలు కూడానా ?
వంటచెరుక్కి పంటచెరుకు దేహాలు
　　దేహాని కభిమానాలు కూడానా ?
కన్నీళ్ళపై తేలే నురుగు నవ్వు
　　నవ్వుల్లో తేలిపోవట మెలాగా ?
ముళ్ళపొదల అలంకారమే పువ్వు
　　పువ్వులు సింగారించట మెలాగా ?
శాంతినుంచి పారిపోవటమే అశాంతి
　　అశాంతిని శాంతిపరచట మెలాగా ?
జీవితాన్ని గడిపివేస్తోంది కాలం
　　కాలాన్ని గడిపివేయట మెలాగా ?
ఖైదీలోనున్నది జైలు
　　జైలును తప్పించుకోవట మెలాగా ?
జైలులోనున్నాడు ఖైదీ
　　ఖైదీ తప్పించుకోవట మెలాగా ?
　　　　పారిపోవట మెలాగా ?
　　　　జారుకోవట మెలాగా ?
　　　　కాలపు గుప్పిటలోంచి ఇసుకలా
　　　　కారిపోవట మెలాగా ?

# ఫోను పిలుపు

'Speech without Word and Word of No Speech.'

*T. S. ELIOT*

"హలో! హలో! ఎవరు మీరు?"
కొంచెం విసుగు, నిర్లక్ష్యం, సణుగుతున్న నీ నరాలు
అనాగతపు ఆవేదన — అపరిచితపు చిరపరిచిత యమయాతన.
"హలో! ఎవరు? నేనంటే ఎవరు మీరు? చెప్పండి తొందరగా."
ఒక్కొక్కసారి అక్కరలేని ఆవేశాల అగణిత హస్తాలనుంచి
తప్పించుకు పోవాలనుకొంటావు నీలోనికి, నీకవచంలోనికి నీవు.
కాని అదే వలనుపడదు — పరిచయానికి మెరుగుదిద్దక తప్పదు నీకు.
చాచిన చేతులతో చేయి కలపక ఏమిటి సాకు?
"ఓహో! మీరేనా? నేనెవరో అనుకొన్నా!"
ఎవరిని అనుకొన్నావు! జ్ఞాపకం లేదా నీకు ఆ గొంతుక?
నీ వెరుగని పరిసరాల, పరస్థలపు పరస్వరాల కాననంలో
నినదించిన చిరదూరపు తలువని తలపుల పిలుపు!
ఎక్కడ విన్నావది? అవచేతన నిద్రితమైన అర్థ విస్మృత శైశవ స్మృతి.
వెలుతురులో రూపరసే అంధ గృహాస్ఫురదాకృతి.
శబ్దాధారం కలుగని భావనలా, ఒక అస్పృష్టానుభూతి
మేధకు దూరమైనా, మనసుకు చేరువైన ఒక ప్రతీతి.
పరిమళ స్ఫురణ గురుతైనా ఉద్గమం తెలియనపుడు
పరిమళమే ఉద్గమాన్ని గురుతించే సాధనమైనటులపుడు.
చెడిపోయిన యంత్రంలా మూర్గే నీమెదడులోంచి
రకరకాల ఊహలు నీడల్లా తడబడి, గుంపులుగా కలబడి
నిలబడతై ఒకే ఒక రూపం ధరియించి కడకు.
నిశ్చిత నిర్ణయంవెంట వెల్లువలా ప్రవహించిన ఆనందం
తెస్తుంది నీ ముఖానికి వింత కళ, ఒక అందం!
(నీవా? నీవు! నీవేనా?) ఏమిటా జ్ఞాపకాలు?
దూరాగత మురళీరవపు చెదరిన పూజల్లులాగు.
ఈజగతికి చెందని ఒక జగదంతర్జగతిలోకి గొనిపోతూ;

ప్రాతరాతపస్నాతపాదపాల మిసిమిగల పసిడి ఊయల
హైమాశ్రువులు తుడుచుకొని నవ్వుతోన్న పూలరేకులు
ప్రాతశ్శాంతుల ప్రదేశాన పయనించే పాంథుని పాట.
ఉండు, ఉండు, అదృష్టాన్ని గుర్తించేందుకు కొంచెం స్పృహ అవసరం.
(నువ్వనుకోలేదు నేను.) ఏమున్నది ? ఏమీలేదు.
చెప్పదగినదేమీలేదు. అసలు ఇది సమయం కాదు.
అన్నీ మాటాడగలం ఒకటి తప్ప, మనసులో ఉన్నది తప్ప.
కాలం వెళ్ళబుచ్చగలం ఊసుపోక కబుర్లతో. నొచ్చిన నిశ్శబ్దంతో.
పై మెరుగుల చిరునవ్వుల ముసుగు వెనుక.
చెప్పవలసి చెప్పలేకపోయినదాన్ని నొక్కిచెప్పింది నిశ్శబ్దం
సమయం కాదు, సమయం కాదని సూచించింది నిశ్శబ్దం.
ప్రయోజనం ఉన్నప్పుడు పలుకలేకపోయ్యాం మనం.
తెలుసులే దీని ఇప్పుడు ఏరికి ప్రయోజనం.
ఒక్క పలుకు మార్చగలిగి ఉండేది విగతగాథను.
హర్షంగా, అమర్షాన్ని; ఉత్కృష్టంగా బాధను.
ఇప్పుడింక పలుకవలసిన దేమున్నది కుశలప్రశ్నలు తప్ప !
"సరే ! సరే ! మంచిది. ఉంటాను నేను."
చెదిరిపోయినదా స్వప్నం. నిశ్శబ్దత అలముకొన్నది
కొలనులో అనధికార ప్రవేశాన్ని వారిస్తూ
చుట్టూ నీరు క్రమ్మినట్లు. ఊపిరి విడచినది తంతి
నీడలు గుమిగూడి చిలుగు వెలుగు ప్రోగు త్రెంచినట్లు,
దాపుననే చీకటి ముసుకు వదలి వెనుక.
చేతిలోనే ఉన్నది ఫోను. నిలబడినాను.
దేనికొరకు ? దేనికొరకు ? ఏదా గొంతు ?
ప్రాణం విడచిన ఫోను హస్తంలో.
ఊపిరిలేని మొండికట్టై; లేనే పండిన తేనెపట్టై.
నిలబడ్డాను. దేనికొరకు ? ఏదా గొంతు ? ఎక్కడిద నీవు ?
ఎదురుగా పసి పచ్చని ఆకులమీద లే ఎండల నిండు చాయ
మిలమిలలాడే మెరుగుల మెత్తని మోహాల మాయ !

కదలే కొమ్మలు, రెమ్మలు; వణకే నీడల బొమ్మలు
మరలరాని కనులముందు వెలుగుల రవ్వల అమ్ములు
ఒక్క క్షణం క్రితం నిన్ను చూచాన్నేను
నా ఊహా యవనికపై, రశ్మిరేఖల విద్యుద్వల్లి రూపంలో
నీ కంఠపు మృదు గుంజన్మంత్రోచ్చరితా వాహన ధూపంలో
రూపొందిన పసిడి పువుల పూచిన పాపపుగా!
అనుకొన్నాను — "అదిగో; ఆ చిలిపి తలపుల నవ్వుల పంట.
కుటిలాధర రేఖా గణిత జటిల సమస్యల జంట!"
ఒక్కొకసారి కంఠస్వరపు ప్రఖరతలో పరికించాను
వక్ర భ్రూ మేఘాచ్ఛన్న ధూళి ధూసర దిగ్దాహ భీమ ధూమం.
మరొకసారి గమకంలో గమనించాను
వాన వెలసిన వ్యోమంలో శక్ర ధనుర్విజయదామం.
ఒక్కక్షణం క్రితం నేను వీక్షించాను నీరూపం
మనో నయన జ్యోతిర్వృత్తమధ్యంలో.
కాని ఇప్పుడెక్కడ నీవు? ఏదా గొంతు?
"హలో! హలో!" అని మళ్ళా పిలిచేదా?
నీ వక్కడనుంచి మారు పలుకుతావా?
నీవులేక బోసిబోయిన గదిలోపల నాగొంతుక
నీవులేని చీకటి గదిలోపల
దిక్కులేని కుక్కలాగ మొరుగుతుంది.
గూడులేని పక్షిలాగు తిరుగుతుంది.
నీవులేని గదిలోపల నాగొంతుక,
పురాస్మృతుల ఉలూకాల
పురాకృతుల దివాంధాల దరబారున,
ప్రేతాత్మల ఊపిరిగా, ప్రేతాత్మల ఇహవాంఛల కాపరిగా
బూజు తేలే మూలల తారాడుతుంది.
ధూళి రాలిన నేలను పారాడుతుంది.
నీ వక్కడ ఉండవు కాని, నా గొంతుక
మన భౌతిక చైతన్యపు ప్రాకారాల దాటుయిదాటి

ప్రాచేతల గీతలతో చిక్కుపడిన దారులుదాటి
అనంత దిగంతాంతరిశూన్యంలో, ధ్వాంతాక్రాంత గ్రహ పథాన
వ్యోమ మహో వట శాఖల, బాష్పాచ్ఛన్నచ్ఛాయా జ్యోతిర్లేఖల
క్షేత్రంలో చరిస్తుంది. ప్రచ్ఛన్న పదధ్వనియై ప్రసరిస్తుంది.
దేశం, కాలం కరిగిన కడలి దరిని
తరగల పరుగు మెరుగులు చెరిగినపుడు
మృదులస్వాపపద లలితారుణోమల సుఖస్వప్నంలో
పలుకులేని పెదవుల మరి కదలికగా,
నా గొంతుక; నిర్జనభవనంలో అశరీరవాణి ఫోను పలే మాట
మాటకి మ్రోగుతుంది. తెంపులేని ప్రశ్నపతే తలలువేసి సాగుతుంది.
నామ రూప రహిత తిమిర గర్భంలో అస్తిత్వం
కునుకులాగ, మినుకులాగ, కనుపించని కిలకలాగ ఉన్నప్పుడు,
రేగాడ్పుల్లో నీడలు రాలుటాకులై గలగలమన్నప్పుడు
ఒంటరినై నేను నిన్ను పిలుస్తాను —
"హలో, హలో, ఉన్నావా నీవక్కడ ఇంకా?" అని.
అప్పుడు నీవు మారు పలుకుతావా మరి?

# పరాజితులకొకపాట

"ఏక్లాచలో, ఏక్లాచలో, ఖుకేరపాంజారే ఆగున్ జాలో!"
ఒంటరిగా సాగిపోవాలి ముందుకు!

ఇప్పుడు కాదు, ఎప్పుడైనా
ఇక్కడ కాదు, ఎక్కడైనా

ఒకటి మాత్రం జ్ఞాపక ముంచుకో నీవు —
ఒంటరిగా సాగిపోవాలి ముందుకు.
ఈ నీడలు నీకు తోడు రావు.
ఒంటరిగా సాగిపోవాలి ముందుకు.

కటిక చీకటి అన్నమాట నిజం, కాని
నీ మదిలో నలుపుకంటే కాదు.
ఎగుడుదిగుడు ఇరుకు బాట, నిజం కాని
నీ తలపుల మలుపుకంటే కాదు.
వలపు పిలుపుల గెలుపు మాట, నిజం కాని
తెరచిన చెర ఓరతలుపుకంటే కాదు.

సెలల జలల కలకలాలు
పుష్ప వాటల పరిమళాలు
రసకిసలయ మసృణారుణ
చరణ చలన సుస్వనాలు.
అణగిన సంతసపు కసిని
గుసగుసలాడే తృణాలు

ఆ సైగ నిజం కాని, నీ బోంట్ల కొరకు కాదు
దేవపంక్తి దాటి సుధాభాండం నీ వరకు రాదు
నీ కోసం కావు పచ్చని మైదానాలు
పచ్చని పసి పైరుల ప్రక్క చల్లని పచ్చని కొంపలు
నీ కోసం తెరవులేని కరుకు వనమున
బ్రహ్మజెముళ్ళు, రక్కెసలు, ముళ్ళకంపలు.

పెద్దమ్మ ముద్దుబిడ్డా !
నీ మంత్రం జ్ఞాపకముంచుకో నీవు !
చలనంలేని నీలినీడల దేశంలో
ఒకరుకన్న ఎక్కువ పట్టని ఇరుకుత్రోవ.
ఒంటరిగా సాగిపోవాలి ముందుకు,
సాగిపోవాలి, సాగిపోవాలి, ఒంటరిగా !

"చీకటి రాత్రి
నిర్జల ధాత్రి
కంటక గాత్రి."
అన్నవారు
ఎవరువారు ?
ఖంగారు
పెడతారు ?

నీడ, నీడ, ఒత్త నీడ !
నీలో ద్రోహి, నీలో నీడ !
నీడ గుసగుసలు వినకు నీవు.
చెడిపోతావు.

వెనుదిరిగి చూచావంటే
శిలవై పడిపోతావు.
నీచుట్టూ సుడులు తిరిగి ఉరుముతుంది.
వినీల విధ్వంసపు వారి ధార !
వెనుదిరిగి చూచినవారు
శిలలై పడిపోతారు.
వారిచుట్టు సుడులు తిరిగి ఉరుముతుంది
వినీల విధ్వంసపు వారి ధార.
ప్రళయ నిర్ఝర పరిమార్జిత పాషాణాలు
వీడలేవు స్వస్థానాలు
నిశ్చల చైతన్యపు సంస్థానాలు.

చలనంలేని నీలినీడల దేశంలో
వేసిన కేక తిరిగిరాదు,
వచ్చిన త్రోవ తిరిగిపోదు.
మరచిన పాట మరచిపోగా
ఆడినమాట కల్లకాగా
నీలినీడల దేశంలో మిగిలిందొకటి
ప్రణయ నిష్ఠుర గర్జనాస్ఫుటి.
వెనుదిరిగి చూడకయ్యా!
వెనుక నీలినీడలయ్యా!
నీ చూచిన హాస్య లాస్య ఫలిత హరిత
నవ మరకతమయ మేదిని!
స్వర్ణాతప జ్వలల్లలిత
విహగ స్వర కలవాదిని.
ఏకరూపమంది? మరుభూమయింది వెనుక.
మసక మబ్బు పొరల వెనుక.
వెనుదిరిగి చూడకయ్యా!
అడుగుజాడ లుండవయ్యా!
ఎప్పటి కప్పు డనాగతం
ఆగతమై గతమౌతోంది.
అప్పటి తప్పు అనుస్మృతం
ఇపు డొప్పై, సమ్మతమై, మరపౌతోంది.
గతమై, మరపై అది హాయిమౌతోంది.
జీవిత సైకతపథాన నీలినీడల అడుగుజాడ
రూపం మారి రూపం మాస్తోంది.
వింత రేపు, కొంత సేపు, ఎంత నైపు?
అంతలో పాట రోత మాస్తోంది.
సంతత సంచలన జ్వలన పరిస్థితి ప్రకృతిరేఖ.
విప్ర గుణముల కొట్టివేసిన భాగ్యరేఖ.

ఏ: శాశ్వత సౌఖ్య పీఠి
లో వెదకిన యాత్రి యూథ

మొక్కొక్కని దొక కంఠం.
ఒక్కొక్కరిని దొక విశ్వం.
బాట మలుపు దాటలేని
సంపదరం అతి హ్రస్వం.
జ్ఞాపకాల గుహాలోపల
మైమరచిన చిరుచీకటి
చెరిగిన చిరునవ్వుల కల
చెప్పిన తిరుమంత్ర మొకటి —
"ఒంటరిగా సాగిపోవాలి ముందుకు —
సాగిపోవాలి. సాగిపోవాలి ఒంటరిగా."

ఓడిపోయిన పటాలాల
అజ్ఞానత నిటాలాలతో భటులు మీరు.
తలకో తెరువు, చీకటి బరువు, వెలుగు కరువు
అడుగుతీసి అడుగువేస్తూ పోతున్నారు.
ఎవడికివాడే దళపతి
ఎవడికివాడే ఆనతి
ఈ వినీల సువిశాలాంబర తలాన —
ఎవడికివాడిదే ఆన!
ప్రతిఒక్కడు సమ్యక్ స్వేచ్ఛానిష్ఠుడు
ప్రతిఒక్కడు తనలోతానే బద్ధుడు.
కుటిలపథం జటిల ప్రగతి.
ఎక్కడుంది మీ పతాక?
హర్ష గుంజద్వాద్య ఘోష?
ఏ విహాసద్యశోయోష
దాచుకొన్నది మీకై రాక?
భయంకరం మీ ఆత్మల ఏకాంతం
పరిక్రాంత. పరిభ్రాంత, ధ్వాంతాక్రాంత
మానవాత్మల ఏకాంతం.

భయంకర చైతన్య మహాశాపం

భయంకర పుట్టుకలోని పాపం.
ఓ ఓడిన జోదులార!
కళ్ళుగల కబోదులార!
ఈ ఓటమి మీది కాదు.
ఒకొరొకరిని ఓటమిలో
ప్రతి ఒక్కని పాలున్నది.
మానవ హస్తం మలచిన
శిల్పంలోనే ఓటమి చాలున్నది.
మానవ హృదయం పలచిన
స్వల్పంలోనే ఓటమి జాలున్నది.
మీ ఓటమి మీది కాదు,
ఈ ఓటమి ఓటమి కాదు.

ఒక గుప్పెడు మంటిలోని జీవచింత
ఇది పావక వీణాపాణి స్వర్ణగీతి
ఈ మైలురాతి కవల లేదు పంత
మించింది తనను తా మనుష్య జాతి.

ఇటవేసిన ప్రతి అడుగూ
సంఘర్షప చరమజయం!
ఇటవేసిన ప్రతి అడుగూ
ఆదర్శపు పరమజయం!
వెలుగు అరిగిపోతేనేం
చాలకనా చీకటి చేయూత మీకు?
తరగ తిరిగిపోతేనేం
చాలకనా గట్టున చేవ్రాత మీకు?
పంట మాట పై పెరుగును
విత్తులకా పొత్తెందుకు?
కంటకాల వెన్నంటిన
పూల గుత్తులిక ముందుకు?
ఇచ్చట నమ్మగు బ్రతుకే

పలు చావుల నోముపంట.
ఇచ్చుట కమ్మని చావే
బహుజన్మల వేము పంట.
మీ గమనంలో గమ్యపు శుభాగమం
మీలోనే సకలతీర్థ సమాగమం :

మీ ఓటమిలోన గెలుపు
వీడకండి ఒకరోతలపు

సాగిపోవాలి, సాగిపోవాలి ముందుకు.
ఎలాగైనా సాగిపోవాలి ముందుకు.

# నాకొంచెం నమ్మకమివ్వు

నాకొంచెం నమ్మకమివ్వు!
కొండలు పిండి కొట్టేస్తాను
చితికిన టొమేటోలాంటి సూర్యుణ్ణి
ఆరిన అప్పడంలాంటి చంద్రుణ్ణి
ఆకాశపు ఎంగిలి పళ్ళెంలోంచి నెట్టేస్తాను!
నాదగు బాహుబంధనంలో ఈ విశాల బ్రహ్మాండాన్ని
చాపలా చుట్టేస్తాను!
నిస్సహాయ మానవేయుని నొసటివ్రాలు
ఒక్క కలంపోటుతోటి కొట్టేస్తాను.
జీవిత సభా భవన ద్వారంనుంచి
అన్యాయాన్ని, అక్రమాన్ని మెడబట్టి గెంటేస్తాను.
ఇంకా ఎన్నో ఎన్నెన్నో చేసేస్తాను.
కాని ఒక్కటి—
నాకొంచెం నమ్మకమివ్వు.
కాలునిమీద కలబడతాను;
పరమశివుని శూలాగ్రాన తలక్రిందుగ నిలబడతాను
ఇంటింటా గగనకుసుమాలు మూడుపూవులుగా
నందన నికుంజాల అమృతఫలాలు ఆరుకాయలుగా
పూయిస్తాను, కాయిస్తాను,
కొయ్యమపాకి పోరనౌతాను,
బావులు పూడ్పిస్తాను, చెరువులు త్రవ్విస్తాను
ఆకాశపు పందిరిక్రింద
నయాగరా నిర్ఝరాల చలివేంద్రాలు స్థాపిస్తాను.
ప్రపంచమనే మహాసత్రం నిండిపోతే
మరో సత్రం కట్టిస్తాను.
ఆకాశపు ఊదారంగు తాను చించి
చొక్కాల్లేని వారందరికి కుట్టిస్తాను.

ఒకటేమిటి, ఏదైనా చేసేస్తాను
కాని ఒకటి —
నాకొక్కించెం నమ్మకమివ్వు.
నమ్మకంలేని బొంది ఖాళీ సిగరెట్టు టిన్ను
నమ్మకంలేని ఆత్మ పుల్లలులేని అగ్గిపెట్టె
నమ్మకంలేని బ్రతుకు కాలిన సిగరెట్టు బూడి
అన్నీ ఉన్నాయి కాని, నమ్మకమొకటే లేదు
నాకొరించెం నమ్మకమివ్వు !
నమ్మకమివ్వు !
నమ్మకమివ్వు !

# ఎంతెంతదూరం?

అలసిన బాట ఆకసంకేసి నిస్పృహగా చూస్తోంది
వెల్లికిలా పండుకొని మెల్లగ కాళ్ళు చాస్తోంది
జోగుతున్న దిక్కులు, ఆవులించే గహ్వారాలు
అలసిన గాలి మ్రోయలేని వాయుటాకుల మర్మరాలు
నడక కూడ కునుకుతోంది, చెప్పుల కౌగిలి విడదు
ఎంత విసుగు, ఎంత వేసట, చిన్ని బ్రతుకులో ఇమడదు

ఎంతెంత దూర మింక తమ్ముడూ!
"కోసెడు, కోసెడు దూర మోరి అన్నయా!"

మూడే మూడు మజిలీ లివట, పుట్టుక, ప్రేమ, చావు
ఎంత సేపు నడచినా గడచిపోము బయలుదేరిన తావు
గతి ఉన్నది, ప్రగతి లేదు, ముది పెదవిని లేదు పాట
తమ్ముడూ! ముమ్మాటికి చెబుతున్నా, బాటసారి తోటిది బాట
మన తోడుత పొడచిన ప్రొద్దు మన వెనకే క్రుంకుతోంది
పగటి నొసటి పసిడిచెమ్మ నల్లనినేల నింకుతోంది.

ఎంతెంత దూర మింక తమ్ముడూ!
"కోసెడు కోసెడు దూర మోరి అన్నయా!"

ఎగురరాని ఎత్తుల మిన్ను తిన్నగా తలపైనుంది
పాతాళపు అందని లోతు కాళ్ళ క్రింద దాగి ఉంది
మిన్నుల నొసలు ముద్దిడుకొనగ ఎగురలేము
మన్ను ప్రేవుల అట్టడుగుల లోతులంటగ దూరలేము
మధ్యమార్గపు మకిలి బ్రతుకు, ఎత్తుల చరమ చేతన లేదు
సౌఖ్యాన్ని పోలిన మరుపు లోతుల మరణయాతన లేదు

ఎంతెంత లోతు లోరి తమ్ముడూ!
"అడ్డం బడితే గడ్డం లోతు రన్నయా!"

బ్రతుకు ఎంగిలి మెతుకు లేరుకొంటూ అలా పయనిస్తాం
చివరకు ప్రాత సర్క్యూలర్‌లా చెత్తలోన శయనిస్తాం

# ఎవరు?

భయద మరణ గహ్వర తటాగ్రమున ఊయలలూగే వారెవరూ ?
తెగిన తలను తన చేతబట్టుకొని ముందుకు సాగే వారెవరూ ?
మోహన మురళి మూగవోయిందట తీగెలు తెగినాయట మహతికి,
ఆది పినాకపు నారి మీటుచూ భైరవి పాడే వారెవరూ ?
కోమల కావ్య కన్యకలకోసం వేచి ఉన్నవారే అంతా
కంటక గాత్రి కుబ్జతో కోయక సరసాలాడే వారెవరూ ?
నయనాల్లో నివసించే దేవత కోరిన కెంపామణి లేదే ?
నయనాంబుజ మర్పించి అర్చనను పూర్తిచేయగల వారెవరూ ?
బాల రసాల సాల నవ పల్లవ తల్పశాయు లెందరు లేరు,
డమరుక లయకు త్రిశూలాగ్రంపై నృత్యం చేసే వారెవరూ ?
లోయలలో తోటల పూవులకే మేను మరచినారే అంతా,
ఉసల శైల శిఖరాగ్రప్రోజ్జ్వల పద్మం కోసే వారెవరూ ?
దివిజ దనుజు లిరువురికీ వలసిన దమృతం, దక్కని ఎడ వారుణి,
సాగర గర్భ వేదనల గరళం, అది చవి చూసే వారెవరూ ?
దక్షాధ్వర విధ్వంస హేతువది, శర్వ జటా జన్య జ్వాలిత
శప్తమృకండు సుతుని కంఠపు యమపాశం కోసే వారెవరూ ?
గగన సుమాల గంధ మధువులకై అర్రులు చాచారే అంతా,
అరుణ బీజములకై పాతాళపు లోతులు చూసే వారెవరూ ?
యజనారణులు విఫలమైనవి ఇక ప్రజ్వరిల్లదీ హోమాగ్ని,
ప్రజ్ఞాస్థుల ఘర్షణతో వహ్నిని రగులుకొలపగల వారెవరూ ?
ముగ్ధ దధులు ప్రవహించిన దేశం, దప్పి గొన్నవారే అంతా,
అయితే మృత్యు పూతనా స్తన్యం, పానంచేసే వారెవరూ ?
అనలాశనులై, పిడుగై, మెరుపై, చిచ్చై రేగే వారెవరూ ?
అలకాపురి దోచేందుకు మబ్బుల బాటను సాగే వారెవరూ !

# విను నేస్తం!

విను నేస్తం! నా గొంతుక చేరగలుగుతోందా నిన్ను ?
విఫల మానవ వేదనల విస్తృతాబ్ధి తీరంనుంచి
పిలుస్తున్నాను నేను; నా గీతం వినబడుతోందా నీకు ?
ఎక్కడున్నావో నీవు ?
సూర్యుని క్రాంత సప్తాశ్వాలు విహరించే శాద్వలాల
బాలాంశువులు పిచ్చుకగూళ్ళు కట్టుకొనే సుందర సైకతాల
దివారాత్ర ప్త స్వప్న జ్యోతిరింగణాలు విహరించే మేచక కీచకవనాల
ఎక్కడ ఉన్నా సరే, అసలు లేకున్నా సరే !
పిలుస్తున్నాను నిన్ను నేను, నా గీతం వినబడుతోందా నీకు ?
ఇక్కడ నేను మానవ హాహాకారాల గజ్జెకట్టి మరణం నాట్యం
చేస్తున్న సీమనుంచి
నిశ్వాస శీతానిలం నృకపాల రంధ్రాల్లోంచి ఈలలువేస్తున్న సీమనుంచి
కజ్జలనక్తచ్ఛాయలు ప్రజ్వలచ్చితారక్తచ్ఛాయల కలసి వన్నెలు
చేస్తున్న సీమనుంచి
నిన్ను పిలుస్తున్నా మరి; నా కేక వినబడుతోందా నీకు?
నా గీతం చేరకపోవచ్చు నిన్ను; ఐనా పిలువక తప్పదు
ఆ శూన్యం తన హృదయరహస్యాలు ఎవ్వరికీ చెప్పదు.
నా గీతపు ప్రతిధ్వనులు మానవ రుధిర సాగరపు హోరులోంచి
నిన్ను చేరి, నీవు మారు పలికావనుకుంటాను మారాన్నుంచి.
ఉదధికర తరంగాల తీరమెచటో, కనుగొనగా
నా గీతం దిక్కుల ద్వారాలు తట్టి పిలిచినప్పుడు
ప్రఖర స్వరకంఠారవంకాధ్వనులు శూన్యోపత్యకలహృదిని కలచినప్పుడు
ఎవరో తోడున్నారని సంతోషిస్తాను నేను.
"వినునేస్తం! వినునేస్తం!" అని మళ్ళీ పిలుస్తాను
మానవాశ్రుసాగరాల తీరంనుంచి.
అప్పుడు నీవు మారు పలుకుతావా మరి ?

# శాంతిపథం

దుర్గమాంధ మృత్యు దుర్గ శిఖరంమీద ప్రాణోదయ విజయ కేతువు
నెగరేదాము !

భ్రాతల్లార ! భగినుల్లార ! రండి ! రండి ; నాతో రండి !
సంశయ కీకారణ్యపు అజగరోదర దరుల్లోంచి
ముక్తానిల ఝరులురికే మరకతాంచలాలలోకి
త్రోవ చూపుతాను నేను; నాతో రండి !
ఉదితాశార్క సత్వర శుష్క సంతాపాశ్రుసాగరాలు
భాగీరథ తపః ఫలామృత సరితామల జీవన కలకలాలు
మానవ మార్కండేయా బలి గళాన యమపాశం
ప్రేమ తామరసదామాద్భుత లాసం.
మృత్యుంజయుల నృత్యసీమకు తోడ్కొనిపోతాను రండి ! నాతో రండి !
నెచ్చెలులార ! నరుని జీవ స్రోతమేది; ఎలా జీవిస్తున్నాడతడు ?
కడుపుకు మెకిరినందువల్లా ? చకరని పట్టుబట్టలు కట్టి నీల్గి నికిరెందువల్లా ?
వీటివల్ల కాదు నరుడు జీవించేది !
నరుడు జీవిస్తున్నాడిచట త్యాగంవల్ల, జీవితానురాగంవల్ల, స్వేచ్ఛిత
కష్ట భోగంవల్ల.
నరునికి మూలమంత్రం ప్రేమ ! నరునికి గుహ్యతంత్రం కరుణ !
శిలువ మోయలేనివాడు, నవ్య జీవనార్హుడు కాడు,
సర్వసంగత్యాగికి తప్ప బోధితరువు నీడ నీదు.
ఊషర ధరణీతలాన అంధకార మావరించిన ప్రతిమూలను
మన గుండెల నెత్తురు చింది వెలుగుపూలు పూయించాలి.
కర్కశ శిలాహృదయులపైన ఆశయాల శాసనాలు వ్రాయించాలి.
ప్రతి హృదయం శివ నిలయం, ప్రతి మానవుడొక తీర్థం,
ఇదే సకల జ్ఞాన సూన పరిమళాల పరమార్థం,
భ్రాతల్లార ! భగినుల్లార ! సంకేతం మనకు శాంతి.
గమ్యం జగదేక శాంతి.
ఇదే సత్యమైన క్రాంతి.

# పాటలమన్నది

"చూడకు, నా హృదయంలో చూడకు" పాటల మన్నది.
"చూడకు, నా హృదయంలో అచ్చట శోణిత మున్నది."
పోనీ తోటలో కొమ్మల గుండె దడలు వినిపించవు.
రాలుటాకు నిస్వనంలో వణుగు పిలుపు వినిపించవు
పసురు కంపు క్రక్కుతోంది కాలిన నేల,
ఇంకా నీవు మునిమాపు ముసిపి వేళ
వదలక కూచుంటే చూడగలవు ఆకసపుటంచులమీద
మొండి మ్రోడుల నీడల చిత్ర విచిత్ర గాథ,
అనుకొన్నది ఇది కాదని అనుకొంటావు!
ఇది కాదనుకొన్న వేళ, ఇది కాదనుకొన్న రావు!
వచ్చుచున్నది పసిడి కంచె, ఉదయాభ్రపులు ముద్దుకొన్న పసిడిమోవి :
ఏడురంగుల తరంగాల పరుగుల నురుగు పొగరుతావి
సస్మితవదనంమీద చలితాధరాస్ఫుట స్పందన
అనువదించి ఆహ్లాదపు గూఢ సూక్ష్మక్షేత్ర ప్రసరణ.
ఒక్క చూపు, ఒక్క స్పర్శ, ఒక్క నవ్వు
ఒకే రెమ్మ, ఒక్క ఆకు, ఒక్క పువ్వు
వెనుదిరిగిన వాసంతిక కొంగు కొసల ఒక్క విసురు.
ఘ్రాణ తర్పణం తదుపరి బ్రతిమాలిన కొంచెం కొసరు
తడియారిన రెప్పలపైన మంచుబొట్టులైన మిగులు.
ఉన్నపదిది విన్నపాటు, పడపాటున్నటికి పిలుపు !
నిన్నటితోనే అంతం, స్వర్ణము స్వప్నోదయం
అన్నిటికీ అంతం, ఇది హేమంతం.
ఎండిన ఆకుల గలగలలో గలడే వాగ్దానం
శుష్కానిల సుస్వరాల విస్మృతి కోకిలగానం.
గరికను తలచుకొంటున్నది గుండె పగిలిన మొండినేల
ధూసర పరిసరాలంట ప్రాకలేని తేమ జాలి

59

మక్కువలేదు, కించలేదు, వేచిఉంది వేసట ఒకటి
విగతోద్యాన గాథపైన మరుపుల చిరుగుల దుప్పటి —
రేపకు మానే గాయం, నిష్ఠుర మధుమాసస్మృతి
క్రూర గ్రీష్మ కరతలాల కోమల పాటల దుర్గతి.
“చూడకు, నా హృదయంలో చూడకు” పాటల మన్నది.
“చూడకు, నా హృదయంలో అచ్చటి శోణిత మున్నది.”

# ప్రేమ-మృత్యువు

ప్రాకరాని చోట తాను ప్రాకరాదు
తాకరానివారిని తాను తాకరాదు
కాటందవలసినవారిని కాటందక వీలులేదు
జడలు విరియు నడిరేయి అడవి దారి —
        పాపం, ముదిసిన మిత్తవనాగు దారి కానలేదు —
కాని దాని మూర్ధంపైన
        దీపిస్తోంది దివ్యానర్ఘ మహామణి
                శివుని మౌళి చంద్రుని కరణి
                        అదే ప్రేమ !

దానిని చూచి చేరువకు చేరుతారు
        మిత్తవ కాటందవలసినవారు
                వెలుగునుకన్న శలభాల్లా.
తీరికగా వారిని కాటందుతుంది మిత్తవ నాగు —
                ప్రేమన్నది
                మరణ మహాఫణి
                ఫణాగ్ర దివ్యమణి.

# ఒకగీతం

జీవితమంతా ఒక క్షణమైతే
ప్రేమంతా ఒక చుంబనమైతే
ఆ క్షణాన్ని దాస్తా నీకోసం
చుంబనాన్ని దాస్తా నీకోసం

    నిర్జన జగదాలయ శిథిలాల్లో
    రాలే కాలపు కడ కొసవరకూ
    నేను ఎదురుచూస్తా నీకోసం

సిరులన్నీ ఒక మానికమైతే
విరులన్నీ ఒక కోరకమైతే
మానికాన్ని దాస్తా నీకోసం
కోరకాన్ని కోస్తా నీకోసం

    నిర్జన జగదాలయ శిథిలాల్లో
    రాలే కాలపు కడ కొసవరకూ
    నేను ఎదురుచూస్తా నీకోసం

నా గానం జ్వలితానలమైతే
నా ప్రాణం చలితానిలమైతే
రావి మాత్రమిస్తా నీకోసం
తావి తేనెమోస్తా నీకోసం

    నిర్జన జగదాలయ శిథిలాల్లో
    రాలే కాలపు కడ కొసవరకూ
    నేను ఎదురుచూస్తా నీకోసం.

# ఆడుకొంటున్న బాలిక

శారద ప్రాతఃకాంతి.
గిరి తరు గృహశిఖరాలంట ఎల్లెడలా కాంచనకాంతి.
ఒక నిర్జన వీథిలోన, మందాక్రాంత పవనాకాంత, చూర్ణకుంతల
బాలిక యొకతె, అతిశయచపల, పోతున్నది ఆడుకొంటూ
తనలోతాను ఏవేవో పిచ్చిపాటలు పాడుకొంటూ.
నల్లనికురుల వాలిన రోచిస్సూచ్యగ్రాల ఇంద్రధనువులు
శతసహస్ర రవిబింబాల లఘురూపాలు విద్యుదణువులు.
కుసుమ శయ్యలపై ఎగసే సీతాకోకచిలుకలాగు
పురుపరాని పలుకులాగు, మధురాలాప మూర్ఛనలా,
అదృశ్య సుషమాదేవికి కాంచన కుసుమార్చనలా
మేధాకాంచల సీమల మెరపులా తళుక్కున్న భావనలా
ప్రకృతిమాత వాత్సల్యపు దీవెనలా, ఆ బాలిక పోతున్నది.
జీవితసాగరంలో చిన్నికాగితపు పడవ ఏ ఒడ్డున తేలుతుంది ?
ఏ ఉప్పెన, ఏ తుపాను కాచుకొంది ? యవనిక వెనుక ఏముంది ?
బంగారుతావుల బొమ్మా ! ఒక పది ఏండ్లు గడచినాక
నీవు నాకు గురుతుండవు ! కాలమాగదు అప్పటిదాక
కాని శారద ప్రాతఃకాంతి, తుహినసించిత పరిమళాలు
అశృతకలరవాలు, దివ్యవీణా మూర్ఛనల ప్రకంపనాలు
రచియించిన అస్ఫుటచిత్రమొకటి మిగులుతుంది మదిలో —
అనంత సైకతంలో అడుగుజాడ, ఒక వీచిక మహానదిలో !

కాని దాటసారి ఎచట ?
నీటిలోన దారి ఎచట ?

# సాంధ్యభూమిక

'In this brief transit where the dreams cross
The dream-crossed twilight between birth and dying'.

*T. S. ELIOT, Ash Wednesday VI*

ఇచ్చటనేని అనంత మాశ్లేషిస్తోంది క్షణికాన్ని
గుణనఫలం కౌగిలించుకొంటున్నది గుణకాన్ని.
ఆశయాల మరుభూములు మ్రింగేశాయి ఆశల మరుత్సరులను,
తృషితాంబరాధరాలు చుంబించాయి ధారుణీ చింపిరిపెదులను.
మిత్తివనే నల్లకుకర మూచూస్తోంది జీవిత దీపాన్ని
మరి ఒక కన్నీటిబొట్టు కలుస్తోంది రాగద్వేషాల విషకషాయాన్ని.
కడచిపోయినది పవలు, కాని ఎగిరిన ఆశయాల పులుగులు
మరలిరావీగూటికి, తిరిగిరావు ఈ కన్నులలో వెలుగులు.
చిక్కిన పుడమి మోముపైన నల్లని అలసట చాయలు
కన్నులలోతుల గుంటలు, కాచిన మనసుల కాయలు
నరుని వ్యధ పాతకాపు; కాని చూడు ఎన్నిగూళ్ళలో దివ్వెలు
వెంగున గెంతే లేగల మెడలలోన ఎన్నో మువ్వలు ?
నాకన్నుల ముందున్నది బక్కచిక్కిన కట్టె కాదు
శుష్కించిన మానవాత్మ. అన్నిటికీ మొదటి పాదు
నాచీకటి నల్ల సిరామరక మాత్రమే కాదు !
నానరాలలో విసము, నా తలలో నాదు, మెదడులో చేదు.
సంజమసక ఆలోకపుటంత్యకర్మ ఒకటేకాదు —
                    తమసానికి జాతకర్మ సంస్కారంకూడా అది !
నాకతీర్థాభిముఖులు పయనించే సంశయ పారావారంకూడా అది.
ఇది గూటికి తిరిగొచ్చే వేళకాదు, ఇదేగూడు, మనలోకం.
నిజరూపం పొందాం మనం వదలి జ్వలత్ క్రూరదివానిర్మోకం.
జయము నీకు ప్రియజననీ ! తమస్వినీ ! నిఖిలలోకస్రోతస్వినీ !
నీ నల్లని చల్లని ఒడిలో నెటనో, మమ్ముల నిటులే మననీ !

# జీవిత బుభుక్ష

రేలిరుల కురులు విరబోయువేళ
            ధూమ్యాలతాళి విరబూయువేళ
విక్లాంత కిరణ గోయూథ మింటి
            పట్టునకు చేరు పుంతలను మింటి
గట్టులను మసృణ శోణాభధూళి
            చెలరేగు వికల గోధూళివేళ
ఒక విధురపంళి నాలోన మ్రోయు
            మధు తిక్తరుచుల రాగాలుతీయు
      మేల్కొలుపు నెడద జీవిత బుభుక్ష
      విస్మృతాతీత పాటల దిదృక్ష !
ఒక చిగులు విత్తు వడి మొలకలెత్తు
            వటుడెదిగినట్లు ఆకాశమెత్తు
వటవిటపమట్లు పటు జటలుదించి
            నిజఘనచ్ఛాయ లోకాలనించి
ఎవడరుగగలడు పూర్వపు పథాన,
            మానసావేగ భాస్కర రథాన
ఇది నిరాలోకమౌ సాంధ్య జగతి
            ఎటులౌదపు పూర్వ సందీప్త సుగతి ?
      అయినా అతృప్త జీవిత బుభుక్ష
      అడుగును నిరంతరానంద భిక్ష.
దిశలంట నలముకొను తిమిరరాశి,
            నైరాశ్యరాశి, ఘన వ్యోమకేశి.
అస్ఫుటావేదనా తరల రేఖ
            ఆ మనోరాత్రిలో తటిల్లేఖ.
ప్రత్యగము జీవ సార్థాభియాన
            మాహ్లాద వాహినీ తటోద్యాన
గత సుమాఘ్రాణ మత్త క్షణాలు,
            అవి కంటినీళ్ళు, అవి మంటిపాలు !
      పావక పరీక్ష, జీవిత బుభుక్ష
      తీరని బుభుక్ష మానవుని శిక్ష !

# మేలుకొన్నవాడు

( యా నిశాసర్వ భూతానాం, తస్యాం జాగర్తి సంయమీ. )

నడిరేతిరి మేలుకొన్న వాడెవ్వడు ?
దివ్వెల నమ్మిక లేమి, నీడల కుట్ర
చీకటుల మెతకబుద్ధి, ఎవ్వరి కెరుక ?
గోరీలా అలికిడిలేని గదిలోపల
ఎందుకుపడినట్లా వెలుగు మరక ?
గచ్చుమీద పిచారాల పహారుల ఎల
చిక్కిన పిట్ట ఎగురలేని గడ్డిపరక.

*

ఎవ్వరికర్థ మౌతుందన్న ?
తెల్లవారి మరోకప్రొద్దు, ఏముంటుంది అంతకన్న ?
గాలికబురులు విన్నవారు చులకనగా నవ్వుతారు;
చీకటులసంద్రంలో జాగారపు చిల్లిపడవ
శ్రేణిలేని ఉదయ శైలారోహణలో భీషణశ్రమ.
చీకటింటికి చిన్నివెలుగు పీలిక నడవ.
ప్రతిక్షణం ఎవరో తలుపుతట్టిన భ్రమ.
శూన్యమేధాగృహంమధ్య పిరికితలపుల ఎలుకల పరుగు
కుక్కల మొరుగు రాత్రి మౌనపు దుప్పటి చిరుగు.
ఎవరి కర్థమౌతుందన్న, మేలుకొన్న వారికన్న ?
నడిరేతిరి తోడెరుగదు, జాగారం జోడెరుగదు.
ఉన్నారెంతోమంది, నిదురిస్తున్నారంతా;
ధన్యులు వారు, వారెరుగరు ఏ చింతా !
వారికి దీర్ఘయామిని ఒక నిద్రా మధురక్షణం
ఈ తమసా సంకటయాత్ర వారికొరకు నల్లకలువల తూగుటూయల
రెప్పమగమలు మడుగులొత్తిన పథవిహారణం కాలహరణం
వారి జగతి చైతన్యో లటి కావల.
కాని ఈకూడదనివేళ ఇలా మేలుకోజేసేది

నిర్భాగ్యుని చెప్పుల జేబుల్లోంచి నిద్దుర పర్సు కాజేసేది
ఆ మహత్తర ప్రేరణ ఏది
అవమానం, అభిమానం, జ్ఞాపకాల కంటకాల ఉపధానం
లజ్జాకర జీవితాల కలుష మలిన పరిధానం :
ఎవరైనా ఎందుకు మేలుకోవాలి ఈనిశలో,
జగత్తంతా నిదురిస్తోంది.
ఒకే ఒక్క తెల్లనిచుక్క ఈమసిలో.

*

ఎవరు కోరరు నిద్రానీలమానసంలో స్వప్న నౌకల అభియానం
తరంగాల కోమల పర్యంకంపై శ్వాసల పతనోత్థానం.
కాని ఇచట ఎవరో ఒకరు మేలుకొనక తప్పదుగదా ?
అనాగతుడు అభ్యాగతుడై అడుగుల సడి వినబడినపుడు
తలుపెవ్వరు తెరుస్తారు ? ఎవ్వరు పలుకరిస్తారు ?
శాంతి ఉండబోదు సదా :
తెలివెలుగుల తొలిరేకలు విడివడినపుడు
ఖండితగీత గళమెత్తే చారణుడెవడు ?
విచ్ఛిన్న నైశ సైన్యపు ప్రాణావశిష్ట భటుడు
అగ్రేసరుల ప్రథమదూత,
ఆమిషాస్థుల పతనోన్ముఖ సేతువుపై ఉదర్కపు ఊహోద్ఘటుడు
అప్పుడంతా అడుగుతారు అతడెవడని ?
నడిరేతిరి మేలుకొన్న వాడెవడని ?

# నర్తకి

శత శత లోలుపలోచన శరముల లోల లక్ష్యమై
లయ తాళ స్వరముఖరశూన్యమున విహిత కక్ష్యపై
వలయాకృతి విభ్రమత్ తారలా, దిగ్దిగంతములు
సోమ సౌమ్య స్వర్ణాభాస్నాతము లొనరించుచు పలు
తీరుల సౌరుల, కటిమేఖలా విక్షుద్రఘంటికల
కరకంకణ పద కనక కింకిణుల రణత్ క్వణత్ చల
దూర్మి మాలికల డోలా లీలా లోల హంసపై
మానవ హృదయపద్మ మృదువేదికపై నృశంసపై
నిజ రక్తారుణ చరణమూని నర్తింపుము బాలా !
అగణిత ధూమహాసనల సమ్మిళితోర్ధ్వ జ్వాలా !

తలపుల పులుగుల రెక్కలచప్పుడు నీ సలుగెలకుల
ఉక్కిరి బిక్కిరి ఉక్కల మక్కువ మరుగును సలసల
స్విన్నోత్సుక తద్గత ముఖపంక్తులు, రుద్ధ శ్వాసలు,
త్వత్తేజోత్తేజిత శలభాలై అవ్యక్తాశలు
నీ వెరగపు నీ రసపరవశ వేగావేగంలో
ఉన్మద జంగమ సమాధిస్థ శాంతోద్వేగంలో.
ఏమిగనును అరమోడ్పు కనులు ఈ మోములకావల
విశ్రామపు హరితారామంలో అలసచ్ఛాయల
కళాచరమశ్రమ సుఖసాఫల్యము, తుష్టావేగము
మీలిత దృఙ్మృదుతా ప్రతిభాసిత గండాభోగము.
అమృత మంథనము, త్వదంగాల భంగాల భంగిమలు
సుషమాంబుధిలో నురుగు పరుగుల సుడులై ఎడులై
యుప్పతిల్లు విద్యుద్వల్లులు, జ్యోతిస్తరంగములు,
నగల నిగనిగల మెరగుల రవ్వలు పువ్వుజములై.
సాను శిఖరముల జలజలపారే సెలవలె పరుగిడి
స్పందమొకటి ఆపాదమస్తకము కంపిలు మెరుగిడి.
చేలాంచల పరిమళ వ్యజనముల విసరుల గుసగుస

రూపలుబ్ధ మధుపంలా పీడదు త్వత్ స్పృశన తృష;
త్వదాఘ్రాణ మత్తానిలరోధము, మలినాలోకము
ఉజ్జ్వలతరమైనది నీ చాయల, ద్యుతి నిర్మోకము
నీ కౌక కాంచన కంచుకమైనది, త్వచ్చరణాహతి
మూకావని ముఖరమై పలికినది స్వాగత శుభ రుతి,
చెనటి చీకటుల వీనుల విచ్చగ; నృత్యల్లలనా!
త్వదభినీతమగు రాగశోకములు స్వాప్నిక కలనా
కేళివోలె, సరసీగత బింబమువోలె కానగు:
ఋతమో, అనృతమో తెలియని గతి, మతిలోన పెనగు
నీవు భ్రాంతివా? నృత్యమాగి మరు నిమసము దిక్కులు
పిక్కటిలే కరతాళధ్వనిలో నీ గురుతేమిటి?
నీపును మావలె మృత్తివయ్యేదవు; నీ సలుప్రక్కల
ఆవులించు దైనందిన నిద్రల చెమరిన చీకటి.

పూవు త్రుంపనగు, కాని తావి బంధాలకు చెందదు
స్వరమువీడి చను మురళిని, కిరణము చెరలో గ్రుందదు
నీ నర్తన పరవశ సమ్మోహన దివ్యచ్ఛవిగని
నీ తనువును కాంక్షింతురు కొందరు భ్రమసి మరుఖగొని.
వారికేమిదక్కును జడ నిర్జల తటినీ చషకము
విరసేక్షువు, విదళిత సుమదళములఛిన్న స్తవకము
నరుని కాంక్ష స్వేప్సిత వ్యాఘాతిని. తాకినవాడును.
తనలో తా రాపాడును తన చేతులలో ఓడును.
అవినశ్వరమది కావ్యశిల్పముల చిక్కిన రూపము
నశ్వర స్రష్ట నిమిత్తమాత్రుడది యాతని శాపము.
మృణ్మయపాత్రల దివ్య సోమగంధాకులాంబరము
త్రైవిష్టపమును నించు మానసోద్గీథసుస్వరము
తావి అదే, నీ కామ్య తనువు పసివాడినప్పటికి
జీర్ణపర్ణములు అపజయగీతులు పాడినప్పటికి
దేశకాలబద్ధ మాదివ్యరూప క్షణికస్మృతి
మనోనీతమై భవాతీతమై పొందదింక మృతి.

మణిదీపఘృణివోలె కాల ఝంఝల కంపిల్లదు
మరుపుటేరుల సోలిడు దానిపై తన ఏలలల్లదు.
పాంచభౌతికము నీ దేహము మంటిలో గలసి చను
నీ మృదుహాసము వెన్నెల కలలై, అలలై చెంగును.
నర్తించును నీవలె పల్లవములు. సూర్యకిరణములు
అనిల స్వైర పరవశమై ఆడే లహరుల ఫణములు
నీవలె యూగును కోరక పులకిత కుసుమ వల్లరులు
నీయూర్పు నెత్తావి గుబులుకొను తెమ్మెర విసురులు
నీస్పందము, నీనృత్యము నిలుచును ప్రకృతిలాసమై
సృజనోల్లాసపు మైమరపున సహజార్ద్రహాసమై.

# సూతాశ్రమం

కత్తి వంటిది తార్కికబుద్ధి.
ఇరువంకల పదునుగల పంపరకత్తి వంటిది.
సుత్తి వంటిది విశ్వాసం
ఆటంకాల సహించని అహంకారం.
రెండూ ఢీకొనిన వేళ విప్లవ విలయ విస్ఫులింగ మహాసారం
సృష్టి కావ్య సదాశ్వాస మహోచ్ఛ్వాసం.
తార్కిక శిలల నిర్జల, సంకట సంకుల ఘాటు
సామాన్య కుసుమ శయ్యల నెలవు కాదు
శూలాగ్రాల శయనించే అశరీర దివ్యాప్సరలు
(కల్పనా కోమల హంసతూలికల తల్పంమీద కాదు)
అసిధారా ప్రఖర తీక్ష్ణ మేధాగంధ వీచికలపై నర్తిస్తారు.
కాని వారి ఆ అందం అందరికొరకు కాదు.
రొమాన్సుల రోమాంచాలు
లలనా కమ్ర స్తన స్తబక కలనా నమ్రతనూవల్లరీవేల్లిత
ప్రాబంధిక ప్రణయ నికుంజాల నీడ
మానవ మాంసగంధ మాదన పర్వతాల బంగరు విరుల మరులవాడ
ప్రబంధాల లలిత పదబంధాలు
భావంలేని చీకటిలో మాటల బాణాసంచాలు
ఇవి అందరికీ అందే ఆనందాలు.
త్రోవ తేలిక కౌగిలినుంచి మంచంవరకు
ఆకలినుంచి కంచంవరకు.
సూతాశ్రమ సశ్రమాధ్వం అందరికొరకు కాదు.
శుభ్ర విద్యుత్కాంతిలో శస్త్రకారుని శస్త్రం సవ్విస అందం
స్వస్థ శ్వాసలాగ, ఎర్రని మూసలోన పారే లోహపు అందం
కనుచూపుల కనుమదాటి, మింటిని ఒంటరిగా
పయనించే ఇనుపడేగ తెల్లని రెక్కల అందం,

డీను స్విఫ్ట్, ఆనటోల్ ఫ్రాన్సుల వంకర వ్యంగ్యపుటందం
అందరిదీ కాదు.
హిమాలయాల ఏయొలిన్‌పై మంచు తుపానుల కమాను
రేపిన మహోగ్ర సంగీతం.
సహారా ఎడారిలోని పవలు కురిసే సూర్యుని తప్త హేమజ్వాల
రేయి కురిసే తారకల ప్రఖర ప్రోజ్వల హైమజ్వాల.
సాగరాలు, భూధరాలు, ఊహల కాననాలు,
ఆవేదనల అనంతంలో మానవహృదయ గ్రహ గోళాలు
ఏవైనా "కవిత ఇదమిత్థమ"ని అంటే
గోష్పదమంత నీటిలో మునిగి చావమనవలదా ?
ఇసుకను చూచి బెదరే రసికులకు
సులభాశయ జలాశయాలు కనుపించాలి.
సెలల అలల కలకలాలు వినిపించాలి.
పాపం, వారికేమి తెలుసు, ఇసుకలోనే దాగి ఉంది,
మానవాత్మల మహాతీర్థం —
దురవగాహ పుణ్యాంతర్వాహిని
సరస్వతి.

# శ్రీరంగం నారాయణబాబు

'And his death only a symbol.'

సంజ్ఞ సరిహద్దున రోమాంచాల లోయలోన, నీడలు కూడేచోట
గడియారపు ముండ్లజంట కడపటి కౌగిలిలో ముత్తిలి ముసికలాడేచోట
అగణిత గణిత చిహ్నాలు, ఆకాశపు శాఖలపై పొంచి చంక్రమించేచోట
వివేకపు విరిగిన గద్దెపైన, అరాచకపు రాచరికాన
తలక్రిందుగ తపస్సు చేస్తున్నవాడు
జాడీ జీడీల చండ హోమ ధూమకుండలిలోంచి
ఖండిత ఖడ్గమృగాలు, గండర గండభేరుండాలు చూస్తున్నవాడు,
ఆకలిని మేస్తున్నవాడు,
భూతాభూత జ్యోతిష్కుడు, సంతతాన్యచేతస్కుడు
అతడే ఊర్ధ్వరేతస్కుడు, హర్షామర్షాలు లేని మహర్షి.

ఉద్గ్రంథాలు తలదిండ్లుగ నాడు నేడుయు క్రీడించిన చింకిచాప
అప్సరసల సవాయి హాయి, స్వాప్నిక సంయోగాల స్వేద దుర్భర జాగరణాలు
కాశీమజిలీల కథల రాశీభూత సుచిత్రశ్రమలు
పౌరాణికపు పయోరియా ఊసే బోసినోట కదలే కవితాక్రిములు
ఎండిన ఇసుకపై కోరిక కుంటిచేప.
అంతరంగపుటరలలో ఉపనిషత్తులు, మార్క్సు, ఫ్రాయిడ్,
వాత్స్యాయనుడు, హేవలక్ ఎలిస్, లీలావతి, అయిన్‌స్టీన్, కాళిదాసు,
జేమ్సు జాయిస్

ఆదిమ నిషాదుని విషాదానికి వీటనిక్కుల నిషా తోడు
అపచేతనపు ఎక్స్‌రేలో, ఈడిపస్ కాంప్లెక్సు
గర్భకోశపు ద్వీపటిలో, తల్లిపంటి చీకటిలో
స్వరతి నిరత బాలకుడు, దోషకళాకలితుడు.
అతని మనసు క్యూబిస్టు బేబిలోను —
వెర్రిపీరులు, శివలింగాలు, సింధూరచర్చిత శిలలు
రక్తాంబరధారుడాతడు, రక్తాక్షుడు, ఆదిశక్తి ఆరాధకుడు

జీవిత శ్మశానంలో కవితా శవసాధన చేస్తున్నాడు.
ఝల్లుమనే కంకాళాలు, ఘల్లుమనే కపాలాలు
గుహ్యాతాంత్రిక గుహలలో భైరవమంత్ర ప్రతిరవాలు
ఆటవిక పటహ ఘోషలు, టోటెమ్లూ, టేబూలూ
అగ్నిచుట్టు నర్తించే దిగంబర శూలధరులు
ఆఫ్రికాలో అర్ధరాత్రి.

నిర్జన మానసాన అడుగుల సడి పడిపడి మ్రోగ
నీడల్లో ఒదిగి ఒదిగి పోతున్నాడు నేరస్తుడు
హఠాత్తుగా సందు మలుపు తిరుగగానే
బుగ్గమీసాల పత్తేదారు "హేండ్సప్" అని అరిచాడు.

# క్రొత్త ఏడు

కాలసర్పం కుబుసం విడిచిన కాళరాత్రి,
మరో కెరటం తీరాన్నొరసి విరిగిన వేళ
మరో ఏడు పైబడిన ఘాతధాత్రి,
స్మృతిపథాన వాడిన మరియొక్క మాల.
నవవర్షం, కాని నరుని హృదయంలో
హర్షంలేదు, లేదు కాంతి కన్నులలో.
లేదు శాంతి పాప లేచ్చే సదనంలో
లేవు పాలు ఎండిన తల్లి చన్నులలో.
నవ వర్షం తెచ్చిన నవ హర్షంలేదు,
నెరియలు పగిలిన హృదిని వర్షంలేదు.
నిద్రించే రుద్రస్థలిని భీత తమసు
నిప్పులు కురిపించే సంఘర్షం లేదు.
కాలనదిని రాలిన మరొక తామరరేకు
బ్రతుకు గుండియ గ్రుచ్చిన మరొక బాకు
తుది మొదళ్ళు, వీడ్కోలుపులు, రావింపులు
కాలం ఎక్కువ చదివిన మరొక ఆకు.

# పిరమిడ్లు

చిన్నచిన్న రాళ్ళకు, చిల్లర దేవుళ్ళకు మ్రొక్కను నేను
దున్నల పీపల దురద బాపే భూపశాసనాలు చెక్కను నేను
కామక్షుధిత ప్రాబంధికుల భామా భీమ స్తన వర్ణనలు
క్రీడాదక్ష దక్షిణనాయకుల అస్తి నాస్తి విచికిత్సల వాదనలు
                                        అక్కరలేదు నాకు.

రాజక్రతువులు, షడ్రుతువులు, జలకేళీ వనవిహార సంవాదాలు
యుద్ధాఖేటనినాదాలు, వృద్ధవేశ్యల వివాదాలు
కవితాసత్రం వెనుక ఎంగిలి విస్తళ్ళకొరకు వెదుకను నేను.
నా రంగం
రాజప్రాంగణం కాదు, గౌరీశంకర శృంగం.
రబ్బరు బొమ్మలతో ఆడుకోను
బొమ్మల పెండిండ్లకు పంచరత్నాలు వ్రాయను నేను.
బొమ్మరిల్లు, పిచ్చుకగూళ్ళు కట్టను నేను
శబ్దాల ఇటుకలేర్చి, అర్థాని కిళ్ళు కట్టను
పుడకలు పరకలేర్చి కలలకు గూళ్ళు కట్టను
        కమ్మని నమ్మకాలకు గుళ్ళు కట్టను.
నా ఊహాశిశువుకు లేదు సదయధాత్రి
నా మానసవిశ్వంలో శాశ్వతరాత్రి
అనుక్షణం అనాగరిక సాగరాల సాహసయాత్ర.
సాహసికుని అద్భుత అభియానానికి ఉండరాదొక బాటగాని,
                                        ఆడిన వేటగాని
కాని ఇక్కడ వచన రచనా వసుంధరను బాటలేని చోటులేదు;
        అక్కడ నానీడకూడా తోడురాని చోట
        ఎక్కడా, అడుగుజాడ లేని చోట
అథవ ప్రభంజనం విర్రవీగే, సైకతాన, సాగరాన బాటలేదు
        విలయవాయుతరంగాల మూలుగు తప్ప పాటలేదు

పాట చేసుకొన్నవాడే పాటసారి
పాట చేసుకొన్న నాడే పాటసారి

నా శబ్దాలు మలచని శిలలు
ఉలులకు తలలు వంచని శిలలు

శోకాల శతాబ్దాల పాకం పొంది, అమృతసాఫల్యంకొఱకు కాచిన పాషాణాలు
శాశ్వత శిల్ప శిలీభూత ప్రాణాలు.

ఏకాంత మానవాత్మల భీకర సైకత సాగరాన
తరుగని, చెరుగని పిరమిడ్లు కడుతున్నాను.

ప్రణయ మరణాల దాగుడుమూతలకొరకు
పిరమిడ్లు కడుతున్నాను నేను.

# పగిలిన అద్దం

ఒంటి స్తంభం మేడపైన
అనంత దిగంతాలు భ్రాంతిల్లిన ఆరడుగుల అద్దాలగదిలోన
అంతటా అగణితంగా తానై యున్న చిన్నవాడు
చరమ విరమణపత్రంపై చేవ్రాలు చేస్తున్నాడు.
నింగినుదుట, కడలి కడుపున, పృథులపృథివీవక్షంపైన
అక్షర ప్రేమక్షతాల శాసనాలు నిలుపవలసిన చిన్నవాడు
చివరికోరిక కాగితపు తునకపై చేవ్రాలు చేస్తున్నాడు.
జాగరవారుణి త్రావి కెంపిలిన కనుల కొనల
కన్నెపున్నమి వలపు కలల నిర్దయ రుధిరోదయాలు
నీలనయన నీరంలో నెత్తుటి చాలు.
సూర్యాంశువుల సువర్ణ సౌగంధిక వేదికపై
మౌనంగా నృత్యంచేసే మృత్యువు.
పచ్చిక మచ్చికలో, వ్యోమం వాత్సల్యంలో
ఉదార కుమారసమీరాల ప్రేమ పరిష్వంగంలో
మసృణ కిసలయాల గుసగుసలో
పొంచి ఉపహసించే మృత్యువు.
హృదిలో దాగిన శత్రువు.
నీడల కనుల నీలాల్లో నీరెండల స్మేరాభలు
బకుల రేకులపై మెరిసే పసిడి మిసిమి శోభలు
పికిలిపిట్టలుగుల రెక్కలపై మిలమిలమను వెలుగుల్లో
చికిలికత్తులు తళతళమను సెలల జలల పరుగుల్లో
ప్రణయ మరణ తోరణాల వ్రేలి వ్రాలే శతసహస్ర శక్రధనువులు
రుధిరామిష విపినంలో వేయివన్నెల ఆమనులు
మిత్తవ పాలరాతి ఒడిలో ఒదుగొనే శిశువులు.
చిన్నవాని కన్నులతో పరికిస్తే జీవనమరణాలకు అట్టే భేదంలేదు.
కాలప్రకిరణాల జాలు వెలిగించిన పాంశుల పరమాణువులు గ్రహాలు.
రవి క్రుంకని సామ్రాజ్యాల గుండెల నెరియల్లో రావిచెట్లు

పాలరాతి చెక్కుల కన్నీటిబొట్లు.
చిరిగిన చరిత్రల పుటలలోని నెమలికన్నులు. రోజాలు
వసుధాంకాన శయనించిన శైశవ కంకాళాలు
విగత విభవ శవాల నీరవ వదన వ్రణగహ్వరాలు.
అద్దంలో అంతటా అద్భుతంగా, అమితంగా, అగణితంగా
తానై యున్న చిన్నవాడు,
తనను తాను కనుగొనే కన్నులలో
తానుగాని తనను తాను కంటున్నాడు.
చేరువయే దూరపు హోరు వింటున్నాడు.
అణువులో అండ పిండ బ్రహ్మాండాలు
త్రుటిలో త్రికాలాలు.
ఒండొంట విలయమందే వలయాలై జనన జీవన మరణాలు.
ప్రేమ శిశువు శీర్షంపై పడగవిప్పి గొడుగుపట్టిన మృత్యువు.
దయగల శత్రువు.
జీవితం అంతంలేని అన్వేషణ.
మరణ గరళంతో కోమల ప్రేమ శిశువు పోషణ.
ఆదర్శాల అవధి కవల అర్థహీన సంకేతాలు
గూని మిన్నులు, నడుము విరిగిన తరంగాల భుజంగాలు
చీకటి కిటికీల కన్నులు.
ఒంటరి నరుని భైరవ రౌరవంలో విశ్రీక ప్రతీకాలు.
ఎవరూ స్వీకరించని బలి
తనను తాను తినివేసే ఆకలి.
అద్దంలో చిన్నవాడు లఫలించి తన ప్రేవులు తానే లెక్కించాడు;
తనను తానే కొక్కిరించాడు.
త్రిమూర్తులను పూర్తిచేసి, "ఏది ఒండకుండుగాత !"
అంటూ తనకు తానే అభయమిచ్చుకొన్నాడు.
దెబ్బతో ఆరడుగుల అద్దాన్ని బ్రద్దలుచేశాడు.

# పుడమికి కన్నెరికం

పొగమంచు ముసుగులోంచి సోమరి సూర్యుడు
బద్ధకంగా నిద్దుర లేస్తున్నాడు.
తనకుతాను చలి కాచుకొంటున్నాడు.
మంచుతెరల జాలరుల ముత్యాల సరుల వెనుక
కాలపు వినీల వ్యవధిలోంచి విరిసిన ప్రియవదన స్మృతి.
ఈ వసుమతి.

కన్నీరు పన్నీరుల జలకమాడిన చిరునగవుల సిరి.
గోరువెచ్చని ప్రేమ పచ్చికపైన నీరెండ.
ఇన్నాళ్ళుగ ఎక్కడ ఉన్నాను నేను ? ఉదయం కొరకు ఎదురుచూస్తూ
ఊషర నిశా సామ్రాజ్యపు అసిత శాసనాలపైన నెత్తుటి సంతకాలుచేస్తూ
చిదపలైన హృదయంపైన బాధల పచ్చ పొడిపిస్తూ
విరిగిన రెక్కల వామనచరణాల బరువుమోస్తూ
ధూమవ్యోమాల కాటుక కనురెప్పల నడుమ ఉదయంకొరకు ఎదురుచూస్తూ
చీకటి కోటకొమ్మకొసను వ్రేలిన, ఖండితగీతముండంకొరకు ఎదురుచూస్తూ
మొండెంలా ఎక్కడ ఉన్నాను ?
ఇన్నాళ్ళుగ ఎందుకు జీవించలేదు నేను ?
జీవితపుత్రపాశుకిపోలాల అశ్రుమిశ్రమ మధురిమనెందుకు చవి చూడలేదు ?
ఎలుగెత్తి ఎందుకు పాడలేదు ?
మంచుక్రింద, మిత్తప పంచక్రింద, అగాధపుటంచుపైన, ఎక్కడ
ఉన్నాను నేను ?
ప్రాణం ప్రసరించింది మెత్తని కత్తి వెనుక క్రొన్నెత్తుటి జాలులాగు.
గానం ప్రసరించింది మరణ పారావత మణిత మృదు రవాలలాగు,
తెల్లని వెలుగు ప్రక్కపైన రుధిరం క్రక్కిన రోజాలు, చెంగలువలు,
గన్నేరులు, ఉన్మాద వలాశాలు, వలల ప్రసవాలు.

రుధిరాణువుల గర్భగుడిలో అనంత శక్తిపూజ,
సురంగాల ధ్వనించిన మృదంగాల అయస్కాంత తరంగాలు.
నా నాడుల ఆఫ్రికా ఆదిమ పాదపాల ఆవేదనల పసరు
నీగ్రో సూర్యుని నెత్తురు.

ఇది పుడమికి కన్నెరికం.

# వేసవిరేయి - రెండుపక్షాలు

చీకటి :

నక్షత్రాల రజతజ్వాల రగిలిన రేయి —
జాజిపూల, మల్లెపూల తలంబ్రాల
నక్షత్రాల రుధిరజ్వాల రగిలిన రేయి.
మోవిని మంచుమంటలు, వ్రేళ్లకొనల అనలశిఖలు
నెత్తురులో, ఊపిరిలో విసపునాల్కల బుసలు, కాట్లు.
సెజ్జకాదది పాడెకాని, మండుతున్నది శవంకాని, ప్రాణికాని
ప్రణయమరణ వేదనలో, రక్కసి కసితో పెనగే
విలులిత పలశకలయుగళ చరమానల సంస్కారం,
కట్టకడపటి నరకం.

నక్షత్రాల రజతజ్వాల రగిలిన రేయి
తెల్లచీర, మల్లెపూలు, వెల్లువలా పడుచు గుండియ
కాని గుండియ నెత్తుటిముద్ద —
వలపువేలుపు ఆటలపూలచెండు, మెత్తని పట్టుదిండు కాదు.
దానిపైన ప్రథమరాత్రుల మధుర స్వప్నగాథల జిలిబిలి జిలుగు అల్లిక లేదు.
మక్కువ రక్కెస ముండ్లపొదల జిక్కి, పొగులుతుంది, పొక్కుతుంది
అది నెత్తురు గ్రక్కుతుంది.
గుండియ వసవల్చిన నెత్తుటిముద్ద.
ఆక్సిజన్ గుడారంలో, చావుబ్రతుకుల పడుగుపేకలల్లిన కోమాలో
అనుభవాల ముండ్లతీగెలు, జ్ఞాపకాల మందుగసులు, వేయికనుల కాపరి
వాండ్రు కాచినచోట
చైతన్యపు శరకార్డులు నీడల నక్కినచోట
అదృష్టపు పెండ్యులం ఆశానిరాశలమధ్య ఊగే వేళ
వేటగాని చేతికి చిక్కిన పిట్ట, పిల్లగాని సూది గ్రుచ్చిన తూనీగ
గుండియ పసవల్చిన నెత్తుటిముద్ద.
ఆకలిగొన్న బెబ్బులి చీకటిరేయి —

నరనరాల పధిరి వాంఛా రుధిరజ్వాల
నెత్తురు చవిచూచిన పులి కబళిస్తుంది.
నెత్తురు చెమరిన కలలు, గరళం చెమరిన శిలలు దేహాలు
మల్లెలు పులి మ్రింగని జ్ఞాపకాల తెల్లని ఎముకలు
తనపుటానే కబళిస్తోంది ఆకలిగొన్న రేయి
మానవ హృదయంలాగే.

వెన్నెల :

వెన్నెలల విచ్చుకత్తులు తళతళమను రేయి
గాయపడిన గాలిలోన దాయరాని హాయి.
మంత్రగాని తోటలోని విసపుపూల తావి
ముద్దులొలుకు మత్తపలా విషకన్యక మోవి.
పాలవెలుగు సాలెవలను దాగి పిలచు చావు
కాలవ్యాళమై త్రోవకాచి నిలచు చావు.
ఈరేతిరి నన్నువిడచి వెడలిపోకు నీవు.
పోతే తిరిగిరావు !

ఈవెన్నెల ఎల్ల కవల ఏముందని నీకు
అంతచేటు ఆరాటం నన్ను విడచిపోకు.
వెన్నెలల కుబుస విడచి ధగధగమను రేయి
బుసలువిడచు గాలిలోన పొగులు పగటి హాయి.
గందపుమ్రానులను పెనచు నాగుల మైతావి
త్రాచుల ముద్దుల విరిసిన సంపెంగి పూతావి
మణిమండిత ఫణముచాచి ఆడుతోంది చావు
ఈరేతిరి నన్ను విడచి వెడలిపోకు నీవు.
పోతే తిరిగిరావు !.

నాకౌగిలివీడి నేడు పోనివ్వను నేను,
మచ్చికగా పచ్చికనై నిన్ను కప్పుతాను.
నీచూపుల మేర మింటిలో మన్నొతాను
అరికాళులు నిమురు మంటిలో మన్నొతాను.

నీఊపిరిలో మెదలే ఊపిరినౌతాను.
నేటి రేయి నాకెడమై పోనివ్వను నేను.
మొగలిపొదల పున్నాగై దాగిఉంది చావు.
ఈరేతిరి నన్ను విడచి వెడలిపోకు నీవు.
పోతే తిరిగిరావు!

# రంగుల తోట

"After life's fitful fever Duncan sleepeth well."
*(Macbeth.)*

జీవిత జ్వరం దహిస్తున్నది దేహాన్ని.
సమాధాన సమాశ్వాసం నిరంతం గికురిస్తోంది సందేహాన్ని, దాహాన్ని.
జ్వరతీవ్రత ప్రాకి ప్రాకి కెంపిల్లిన నాకన్నుల తోటలోన.
రెప్పల గోడల వెనుక, ఏమని అడుగుతావు,
ఏమి రంగు లేమి రంగులు, ఏమి పూలు, పూలు !
అద్భుత రంగులతోట ! నింగి నీలం, నెత్తుటి ఎరుపు, పచ్చిక పచ్చ.
దాలింపల చెక్కుల పసిప్రాయపు పసిమి
తెలుపు, తెలుపు, అన్నిటినీ తెలిపే తెలుపు.
స్వచ్ఛ కాంతికిరణం తెలుపు, కనుపించని రంగుల పూలచెండు తెలుపు.
నలుపు, నలుపు. అన్నిటినీ కలిపే నలుపు
నీగ్రో నలుపు. రేయి నలుపు. అదృష్టపు సిరా నలుపు
రంగుల పొరల క్రింద నిజం నలుపు
అన్నిటికీ ఆవల ఆవల కావలిఉన్న చల్లనితల్లి నలుపు.
రెమ్మలలో, రేకులలో, తేలే గాలి ఈలపాట, జోలపాట
నీరవ నిశీథాల నిశ్వాసాలు,
కలవరించి, వెలువరించిన నిభృత రహస్యాలు.
రెప్పల గోడలు దాటి, వేడి రాదు; కాంతి తప్ప.
లంకవంటి తోటలోన శంకలేని రంగుల కాంతి తప్ప.
ఈ తోటకు శాశ్వత మాధవుడను నేను,
తోటను నేను; నాలోనే ఉన్నది తోట.
జ్వరతీవ్రతను కాచికాచి వడపోశాక,
దారిలేని, పేరులేని తారులోంచి, రంగులు విడదీశాక,
కోరికల బూదిప్రోవును తడిపి, తడిపి
పాదులు చేసి, రంగుల తోట వేశాను.
ఒరులెవ్వరు చొరకుండా రెప్పల గోడలవెనుక దాచేశాను.

జ్వరం పెరిగిన కొలది
అధర ధరణి ఎండి మండి, నెరియలువిచ్చిన కొలది
స్నాయునాళికలవెంట మంటలు పారిన కొలది
తోట విరియబూస్తుంది; రంగులు పొంగుతాయి.
నింగి నీలం, నెత్తుటి ఎరుపు, పచ్చిక పచ్చ
పూరేకుల చెక్కుల కెంపులలో జ్వరవారుణి
లోక మొక తోటౌతుంది; తోటే లోకమౌతుంది.
తోటలో చోటులేదు మిత్రవకు; అది బ్రతుకుటక్షరాల అచ్చుతప్పు.
రాకుమారి వరియించిన గూనివాడు,
కునికే పసికందులకు, "కథ కంచికి మన మింటికి"
అన్నట్టుగ, నీతో ఒకటి చెప్పలేదు —
నారంగుల తోటలోకి, అప్పుడప్పుడు నిన్ను తప్ప
ఎవ్వరినీ, రానివ్వను.

# హుసేన్ సాగర్

పసరునీరు, నీలినింగి, స్వేచ్ఛవంటి సెల్లోఫేన్ వెలుతురులో
పొదివిన నగరి,
తరగచెక్కులు, మక్కువతో నిమిరే గాలి, పులక, మోహపు మొలక
ఈ ఒక్కొక్క లహరి.
ఈ ప్రపంచం, ప్రళయ మహామయూరిక విప్పిన పింఛం, దేనికో
ఇప్పుడుగదా తెలుస్తున్నది.
వెల్లువలా పెల్లుబికే స్వేచ్ఛా స్వచ్ఛానందం ఇపుడుగదా పిలుస్తున్నది.
ఉలిపిరి మంచు పైకి లేచి, నీలాలనింగియంచుల మసకలో వెలసిపోయి
ముసిరే పరిమళంలాగు, మృదుల పట్టాంచలంలాగు తేలి వ్రేలి,
శూన్యంలో కలసిపోయి.
చూచే కనుల బాష్పంగా, లేచే మనస్స్వక్ష హరిణనాభి మదగంధంగా
ఊచే హర్ష స్వచ్ఛంద స్పందంగా, తెరలతెరల మరలిమరలి వస్తున్నది.
నాచుట్టూ తీరని ఒక దాహంలా, స్నేహంలా, తెరలితెరలి వస్తున్నది.
ఈ విశ్వం మనుజ శిశువుల పూలతోట, మెత్తని పచ్చిక పరచిన క్రీడాస్థలి.
సూర్యచంద్రులు, నక్షత్రాలు, అతనికొరకు పూలబంతులు, పలువన్నెల
ఊలుబంతులు.
ఆ మేఘాలు, సాగరాలు అతని చరణస్పర్శకొరకు వేచిన పాలపుంతలు.
మానవుడు రాజరాజు, అతని నవరత్న ఖచిత సింహాసనం ఈ భూతలి.

# ఎందుకు మాసిపోతుందో ప్రేమ?

ఎందుకు మాసిపోతుందో ప్రేమ ?
ప్రాయప్రవాహంలో నలిగిన గులాబిరేకులలా, నెమలి ఈకలలా,
నడివేసవి పడసోకిన పన్నీటిజల్లులా
పచ్చికబయలులోన తలవంచిన రెల్లులా, చెరిగే హరివిల్లులా
ఎందుకు మాసిపోతుందో ప్రేమ ?
ఎందుకు మాసిపోతుందో అందం ?
కన్నీరై కురిసిన ఆనందంలా, పెటిలిన గంధంలా
కొడిగట్టిన కడవెన్నెల నవ్వులా
తలగడపై నలిగిన సిగపువ్వులా
చెక్కుల చెంగావిపోయి, చివురుమోవి వాడిపోయి
ఊర్పుపగరు వాడిపోయి
ఎందుకు మాసిపోతుందో అందం ?
ఎందుకు మాసిపోతుందో ప్రాణం ?
వడలిన ఆకులురాలి, రెప్పల రేకులు వాలి,
కడపటి చీకటిలో నిద్దుర ప్రొద్దు వాలి
ఇసుకపలకపై తరంగాల నురుగు వ్రాలు కరిగినట్టుల
వడలే ఆకులపై లే ఎండపొడలు చెరిగినట్టుల
గాలుల దోసిలిలోంచి జారిపోయే పాటలాగు
పొగమంచులోని నీడల దోబూచులాటలాగు
ఎందుకు మాసిపోతుందో ప్రాణం ?
ఏమిటి చేస్తున్నాను ఇక్కడ నేను ?
దేవరలేని దేవళంలో, దీపులులేని సంజవేళ
చిటికిన మోజు బూజు నడుమ, విడువని జ్ఞాపకాల గబ్బిలాల
రెక్కల రెపరెపలో, కీచురాళ్ళ రొదల సొదలో
పిల్లని పగటి ఎల్లమందు మగతలోంచి
ఎండుటాకులు నలిగే సడి వెనుక,
మాయమయే అడుగుల సవ్వడి వెనుక
మరణశిలల పదములపై, తలపగిలిన ప్రేమతరంగాల హోరు వింటున్నాను.
నురుగుల చిరునవ్వులు కంటున్నాను.

# కామోన్మత్తుడు

పవలు రేల వాకిళులకు వెన్నెల
తెర లిరు సంజలు, ఎవరున్నారు ?
గదిలో, మదిలో, ఎవరూ లేరు
ఎవరూ లేరు, ఎపుడూ రారు.
గగన ధమనుల నపుంసక హింసను
సహియించే ఊషర విఫలాచల
ఖేదం మోదంలేని క్రతువు అది
విసిగిన నేను కాపలిని వెలుపల,
ఈ దినచర్యకు అర్థం ఏమి ?
ఆ అర్థానికి ఎవ్వరు హామీ ?
గత శైశవ మరకత నందనమున
దయగల చేయూతను గొని నడచిన
వేళల ఏదో స్ఫురియించేది.
అర్థం ఉన్నట్లనిపించేది.
తృణదలముల, అమలిన హిమకణములు
ప్రణమిత తరుమర్మర లాలనములు
వ్రణవిక్షతములు కాని చరణములు
ప్రాణం పోసే బాలానిలముల
ఏదో లీలగ స్ఫురియించేది.
ఆ మాయాకాంచన మృగమేదీ ?
ఈ దాహం దహియించని హృదయము
ఈ నెత్తురు చవిచూడని పెదవులు
పీడకలలుగా మారని వాంఛలు.
వెదుకలేదు ఆనాడు పవిత్రత
చిరునగవుల పరిశుద్ధపు మిత్రత.
సామాన్యపు సంతృప్తి చాలునని
రేబవళుల ఊరేగింపును గని

సంతసించు గుంపున నేనొకనిని.
నా వెన్నున కన్నొప్పని ప్రేతము.
ఏ అదృశ్యశక్తికి విక్రీతము ?
పూవు చిదిమి నెత్తావి వెదుకమని
ఒడలి కడలి రాపలి సంజీవని
పొడమే చల్లని దీవి వెదుకమని
చెవిలో గుసగుసలాడే ప్రేతము
ఏ రహస్యశక్తికి సంకేతము
తనువులసికతను కనక వీచికల
గిరుపించే ఆ మృగ మరీచికల
మోహదాహమా ? స్నేహదాహమా ?
నాపిపాసకే ప్రతిభాసము అది
నాదురాశపై పరిహాసము అది.
ఆగుండియను చెండి ఆకండల
ఇసుకలోని స్నేహం పిండాలని,
ఆఎముకలు భగ్గున మండాలని,
నాకసి ఆమసిలో నిండాలని
ఉంది కాని, అచ్చట ఏమున్నది ?
నే చెరచిన రమ్యత ఏమైనది ?
నేను తిరుగబడి ఫలమేమున్నది ?
నయన వాపికల నిండిన త్రాసము
తనువున మరణపు శైత్యావాసము
పిడికెడు బూడిద, పడకెడు ఊపిరి
నాదాహపు తరగల గీసిన గిరి.
ఒక్కక్షణం చూచాను మృత్యువును
మృత్యువులో జీవిత రహస్యమును !

# వాన వెలిసింది

వాన వెలిసింది –

కడిగిన పచ్చని ఆకులపైన ఎండ మిలమిలమని మెరిసింది.
మొండి గోడలపైన, ఎండుమోడులపైన
అగణిత వికృత జీవిత శిథిలాలపైన మేలిమి వెలుగు కురిసింది.
నీడలు ముసిరిన భువన వదనంపైన తళతళమని చిరునవ్వు విరిసింది.

నాలోన, సమస్త జగతిలోన ప్రశాంతి.
చల్లని మెల్లని కాంతి.

ఈ క్షణాన నేను
మరణమన్నది ఉన్నదని నమ్మలేను.

అయినా నాకు తెలుసు, పుట్టలోనే ఉన్నది పాము.
బ్రతుకుచెట్టు ప్రతికొమ్మను, ప్రతిరెమ్మను చెమ్మలాగు పేము.
తరు తనువుల పసరుల నెత్తురులాగు, మరణం ప్రవహిస్తుంది అందరిలో
మరణం దహిస్తుంది కాలే పెదవుల ముద్దుల తొందరలో
మరణం విచ్చేస్తుంది కానరాని విందగ మన ఆనందపు విందులలో
మరణమన్నది మన నీడ, కాదు, కాదు, మనమే మరణం
భీషణ జీవన నిశీథగర్భాన త్రోవతప్పిన వారికొరకు ఒక కిరణం
అది మరణం.

కాని ఈక్షణాన ఈమేలిమి వెలుగులోన నేను
మరణమన్నది ఉన్నదని నమ్మలేను.

నేస్తం, నీవెరుగవుగాని, నేను మాత్రం ప్రతిరాత్రి మరణిస్తాను
ప్రతి ఉదయం (కథలో యువరాజులాగు) జీవించి లేస్తాను –
మరణానికి ముద్దులుపెట్టి ఏరోజు జీవితాన్ని ఆరోజే కొంటాను.
కత్తుల కవనంతో, నెత్తుటి మొదళ్ళపై పూచిన మంటల కలలతో
మరణపు నగ్నరేఖల్లో మహిత లలిత జీవిత వర్ణాలు నింపుతాను.
జీవన మరణాలను కలిపి, హాలహలాన్ని మించిన ఒక హాలను సృష్టిస్తాను.

కాని ఈ క్షణాన నేను
మరణమన్నది ఉన్నదని నమ్మలేను.
జీవితపు చూపిన మాసిపోయే అపురూప సౌందర్యాన్ని, అనంత ఐశ్వర్యాన్ని
కన్నులు నులుముకొని చూస్తున్న నేను
మరణమన్నది ఉన్నదని ఎలా నమ్ముతాను ?
గోపురాల కాంచన కలశాలపైన కిరణాలు
అవి అదృశ్యదేవదూతల చరణాలు.
విను, విను, జీవనమరణాలమధ్య ఊగే గంటలు మ్రోగినాయి,
నింగిని నేలను కలిపి, ఒక్కక్షణం లోకాన్నే నిలిపి ఖంగున రేగినాయి.
మరకత తృణదలాలు పులకించాయి.
వేనవేల పూలకన్నులు మేలుకొని తిలకించాయి;
మట్టితావితో నిండిన గాలి గట్టిగా ఊపిరి పీల్చుకొంది.
వినూత్నవధువువంటి విముగ్ధ వసుంధర సిగ్గుతో శిరస్సు వాల్చుకొంది.
జీవనమరణాలమధ్య ఊగే గంటలు మ్రోగినాయి
దివ్య స్వరతరంగాలు సుదూర సాగరతీరాలకు సాగినాయి
మేలిమి వెలుగు మెరిసింది,
వాన వెలిసింది.

# అపూర్ణకవిత-1

నిద్రలేని నిశీథాల బాధనుంచి, ముద్రలేని అగాధాల గాథనుంచి
చరమ సమాధానంకొరకు వేచిఉండి
అపయవాల అశమితశరశయ్యమీద, అపరాధపు ఉపధానం
పూనికగా లేచిఉండి

తిమిరాంబర సాగరాల చిరుచుక్కలు లెక్కిస్తూ
తలపు జపమాల మీ క్షణకణికల గుణనంలో
మరణ చరణ రణనంకొరకు, విషమసమయం హర్షంకొరకు
విరుణ కరణ తరుణంకొరకు, కాచుకొన్న హతభాగ్యుడు.
తెల్లని గదిగోడలపై నిలువనీడల నీరులేదు
చూపులచేపలు చల్లగ చేరుపచేర వల్లకాదు
కృతకకాంతి క్రూరంగా కరుస్తోంది
కత్తుల్లా కోపంగా మెరుస్తోంది.

# ఒంటరిదేగ

విశాల వినీల వ్యోమపు విస్తృతిలో ఒంటరిదేగనై
మందలో తప్పిపోయిన లేగనై
వెదకుతున్నాను, వెదకుతున్నాను అర్థంకొరకు;
అమ్మవంటి అర్థంకొరకు.

రెక్కలు అలసిపోయేదాక,
రిక్కనుంచి సన్నని చుక్కనై, నీలాలశూన్యంలో కలసిపోయేదాక
వెదకుతున్నాను, వెదకుతున్నాను అర్థంకొరకు
దీనికంతకు అర్థమేమి ?
నొచ్చిన నారెకరెలక్రింద పగులబోయే గ్రుడ్డులాగు భూమి
లోయల లోతుల్లో నీలినీడల పోరాటాలు,
రెకరెలులేని, రెక్కలురాని తలపుల ఆరాటాలు.
పిడికెడు మంటి సంకెలలో
చలియించే వేనవేల నరాల నీలివలలో చిక్కిన నెత్తుటిపిలలు.
నమ్మిన మ్రొక్కులఘాటికి వ్రక్కలైన శిలలు.
బాధల నెత్తుటిజీరల పచ్చసొనతో, పగిలే గ్రుడ్డులాగు భూమి.
దీనికంతకు అర్థమేమి ?
నింగినుంచి నీలాలుకురిసేచోట, బంగరు వెలుగుల జాలుమెరిసే చోట
శోక బాష్పాల పొగమంచులు క్రమ్మనిచోట
ఇచ్చట ధరకు దూరంగా, ఊపిరాడని ఉలిపిరి తెమ్మెరలో
మేలిమి నీలిపట్టుకుచ్చుల జిలుగుల జాలరు తెరలో
అసీమ అనంతానికి తెరచిన దిక్ పంజరాల గవాక్షాలు,
ఆవల ఆవల కావలిలేని పరోక్షాలు.
నింగినుంచి నీలాలు కురిసేచోట, బంగరువెలుగుల జాలుమెరసేచోట
ప్రశ్నలు ప్రత్యుత్తరాలులేని శాంతి పద్మంలా విరిసేచోట
చంచువు తెరచి ఉలిపిరి తెమ్మెరలను పీలుస్తాను.
మేలిమి నీలాలతావి, పీల్చి, మత్తిలి, తూగి, తూలి,

93

రెక్కల చురియలతో ఎగురరాని ఎత్తులను చీలుస్తాను.
కాని ఇంతలోనే నేల పిలుస్తుంది.
రెక్కలు రాని నెత్తుటికందులాగు నేల పిలుస్తుంది.
దెబ్బతిని రివ్వన క్రిందికి దిగివస్తాను.
రెక్కల పొత్తిళ్ళలోన అదమి సముదాయించటానికి
తెరచిన చంచువులో పుప్పుల మేత నించటానికి.

# మూడు సంకేతాలు

తీరని దాహాల సహారా కవల, ఖర్జూర నికుంజాల నడుమ
(దేహంలో స్నేహంలా) పసిడి ఇసుకలో సెలలు పారేచోట
పచ్చల పచ్చికపై చెమరిన, కమలిన పథికులు సేద తీరేచోట
అందాల చందమామలు అందించే శీతల పరిమళ పానకాలు
నీడలనిదుర, తేనియమరుపు, పట్టుపరుపుల సుఖాలు
ఎడారి ఓడలపై పయనించి కడకు ఈతావుకు వచ్చావు.
దీనికేనా ? ఈ ముద్దు ముచ్చటకేనా ? ఇంకా పోవాలి నీవు !
త్రోవచూపిన ధ్రువతారక ఏమయింది భ్రాంతిపుంజాల నడుమ ?
సంకేతం నీకు — పసిమి.

పైనున్నది నీలినింగి—క్రింద నీరధి—నడుమనొక చుక్క నీవు
ఈ అనంతదేశంలో అణువు నీవు, అశ్రాంత దృశాంతాలు
వేడుతాయి శరణుకొరకు మౌనమూనిన విశాల దిశాంతాలు
నీలివన్నె దూరాన్నుంచి ఏది చూసినా నీలం, మరణం కూడ
హాలవంటి గాలిపీల్చి మత్తిలినాక, నీలం నీకు తోడునీడ.
చరమక్షణం, జనన మరణ డోలలూగే నీహృదిలో అద్భుతశాంతి,
కాలాన్ని కల్లజేసి వెల్లువలా, మేలిమి నీలాల కాంతి.
త్రుటిలో నీవు, నీలినింగి, మేలిమి వెలుగులో విలీనమౌతావు.
సంకేతం నీకు — నీలం.

నింగి నేల రెప్పల, రేయి కైపు కెంపుల ప్రొద్దు కనులు విచ్చేవేళ,
ఇరుల కురులు చెదరి నొసట, బాలారుణ కుంకుమ తిలకం జ్వలించి
వేదనా కేదారాల నీలివిత్తులు స్వర్ణసస్యంగా ఫలించి
అనుకొంటావు, రేయి కడచిందని, కాని. పులి పవలును తలుపలేపు,
తృషను, మృషను, విరసరసను, పవలు పులి తునిమిన కలలు చలుపలేపు.
కిరణాలు, అరుణ ఛురికలు, ఉదయ రుధిరపు హెచ్చరికలు కెంపుపూలు,
ఉదయగిరిపై రుధిరస్నాత దివస కేసరి విదల్చిన ఎర్రనిజూలు.
తొలి వెలుగుల కెంజాయలు, మలిసంజ నెత్తుటి చితులను తెలిపే వేళ
సంకేతం నీకు — ఎరుపు.

# కలలు పగులగొడుతున్నాను

కలలు పగుల గొడుతున్నాను,
రంగు రంగుల పింగాణీగాజు కలలు
మేలిమి బంగరు కలలు, అన్నీ పగుల గొడుతున్నాను.
పురాణ పానపాత్రలు బ్రద్దలు గొడుతున్నాను
(చిల్లపెంకులు పిల్లలకైనా పనికొస్తాయి )
భుక్త రిక్త పాత్రలు నేను ఏమి చేసుకొంటాను ?
అందుకనే అవి బ్రద్దలు కొడుతున్నాను.
కలలు పగులగొడుతున్నాను.
దప్పిగొన్న పెదవుల్లా బీటలువారిన నేల
దూరాన దూదిపింజల మబ్బుల్లో లేదు హేల.
రిక్తధరణీ గగన పాత్రలు, కన్నీరైనా లేవు,
నెత్తుటి పాటల ధూళి ఎర్రగా రేగే రేపు.
కసితో, అక్కసుతో నేను దుమ్ము రేపుతున్నాను.
                    కలలు పగులగొడుతున్నాను.

శేష మెందుకు ?
విక్రయం ముగిసేవేళ కృపణతా లేశమెందుకు ?
శేషమున్నది వికృతమై నిశ్శేషం కాకమానదు
పూలు క్రుళ్ళిపోతాయి, భావం జాసిపోతుంది
కాటుక చారలవెనుక కుంకుమ మాసిపోతుంది
                    వేయి చెప్పు, రేయి రాకమానదు.

తమస్సుకు స్వాగత మిస్తున్నాను.
వేల వెన్నెల చాయలు చెరిపివేస్తున్నాను.
కలతనిదుర రాకుండా కలలు పగులగొడుతున్నాను.
ఒకనాడు నేనుకూడా సృజియించాను
కోకొల్లల హరివిల్లుల మెరుపు జడులు కురిపించాను.
కల్పనతో, శిల్పంతో సౌందర్యపు ప్రతిమలు నిర్మించాను.
శిలలు తొలచి విగ్రహాలు మలచాను

కొన్నిటికి ప్రాణంకూడ పోశాను. (నా ప్రాణం)
నే సృజియించిన ప్రతిమలు నేనే చూచి వలచాను. కొలిచాను.
చివరకు అవి నన్నే బలి కోరినాయి.
కోపంవచ్చి వాటిని బలి ఇస్తున్నాను.
ఓపికగా ఒక్కొక్కటి బ్రద్దలుగొడుతున్నాను.
కలలు పగులగొడుతున్నాను.
హృదయపు గర్భగుడిలోని ప్రాణప్రతిమనుకూడ
నెత్తుటి వ్రేళ్ళతోటి పెకలించి పారవేసిన నేను
ఈ క్షుద్ర ప్రతిమలనెలా సహిస్తాను, క్షమిస్తాను ?
మొహమద్ గజనీని నేను, విగ్రహాలు బ్రద్దలుగొడుతున్నాను.
విగ్రహాంతకుడనేగాని, నేను విగ్రహ విక్రేతను కాను, కాను.
ఈ ఖండిత విగ్రహాలు, శకలీకృత నిర్ఘృణ మృతపాషాణాలు
నే నిర్మించే సుందర మందిరాల సోపానాలు.
మందిరమొకటి నిర్మిస్తున్నాను నేను
అందులో ప్రాణప్రతిష్ఠ చేస్తున్నాను
నిశిత నైరాశ్యానికి, శూన్యానికి,
చిదంబర రహస్యానికి.

# పొగమంచు

నా మనసున క్రమ్మిన పొగమంచులోన రకరకాల ఆకారాలు
నే నిర్మించిన, నన్నే బంధించిన దుర్గపు ప్రాకారాలు,
దట్టపు పొగమంచుల పెట్టనికోట, ఇచ్చట చొరలేదు గాలి
బేల గుండె తింటున్నది తనను తాను, ఉండదు తనపైన జాలి.
ఒంటరిగా చిక్కని పొగమంచులోన, నాకు నేను తోడులేను,
నీలి మంచుమంటలలో లీలగ ఒక నీడను చూస్తున్నాను.
నా పోలిక బహుశా నా నీడే అది, నేను ఇంక నేనుకాను
ఈ పొగలో, ఈ వగలో పోల్చరాని మసకనీడనైనాను.
ఇది అతీత ప్రేతభూమి, నా చుట్టూ వేనవేల వత్సరాలు
ఈహలు, ఊహలు, తీరనిమోహం, తుదిముట్టని మదమత్సరాలు
ఏ అదృశ్య నీరవ విగతాత్మల పాచిన యూర్పులు మ్రోయరాని
భారంగా చుట్టుముట్టినవి నవిసలుపని నాప్రాణపు రాజధాని.
ఏ దురాశ, ఏ నిరాశ, ఏ పిపాస, నే పీల్చేదెవరి శ్వాస ?
ఏ హింసా ప్రతిహింసల ఆక్రోశము నాలో క్రమ్మిన అమాస ?
రవి శశి తారకలులేని ఈ శాశ్వత సంధ్యావంధ్యా భూమిక
కొడిగట్టిన గాజుకనుల మోజులతో పిలచే విగత ప్రేమిక
ఇది లోకుల దారికాదు, ఈ చాయలకే ఎవరూ రారు, పోరు
దారికాచినాను నేను నాకొరకే, ఖిందలు వేరెవరు లేరు.
అలికిన పులిమిన వన్నెలు, తెలుపు నలుపు కూడ ఇచట తెలియరావు
ఈ ఆరిన, పొగచూరిన నరకంలో లేదు బ్రతుకు, లేదు చావు,
దేశకాలములు కరిగిన పొగమంచున, ఈ తృటిలో ఇచట నేను
ఆరిన సెగగా, తీరని దగగా, పొగలో పొగగా మిగిలినాను.
కనదగినదిలేదుగాన, వినదగినది. ఆకులురాలే సవ్వడి
త్రుంచిన ఎదరేకులపై మంచుబొట్లు టపటపమని రాలే సడి.

# వారసులు

ఈ వసుధ సంక్రమిస్తుంది వారికి, ఈ జగతికి వారసులు వారు
ఈవాళటి మన బ్రతుకుటీరుల దారికి రేపటి విభావసులు వారు
రేపటివరకు మనముంటే, మనమేమౌతామో నేడు అదే వారు
ఆకులురాలిన శాఖల చివురులుగా వెలుస్తారు పదేపదే వారు
వారిప్పుడు లేకపోయినప్పటికీ మనమివాళ రేపటివారి నీడ.
ఈవేళ మనం విడిది చేస్తున్నది రేపటివారలదైన మేడ.
అప్పుడప్పుడు చూస్తున్నాను నేను వారి కిలకిల నవ్వే మొగాల వాలు.
పాపల్లో, పూవల్లో, పూవుల్లో ప్రాతఃపవనాల తావి జాలు.
అవి రేపటి నగుమోములు. కిరణాల్లా, కనులు చెదరేలా కనుపిస్తాయి.
నాచీకటి వెలుగ, దూరతీరాలకు, రేపుకు రమ్మని సైగ చేస్తాయి.
ఒక్కక్షణం నేను వారితో ఉంటాను, గతాన్ని ప్రస్తుతాన్ని గెలుస్తాను.
రెక్కలు విరిగిన నేను వేకువ పులుగులను, ఎలుగెత్తి మరిమరి పిలుస్తాను.
కాని మరల నిశ్శబ్దం, ఒక్కొక్క త్రుటి, ఒక్కొక్క అబ్దంగా ఘననిశీథి
పులుగులేని, ఎలుగులేని, వెలుగులేని, వికృత విజన హృదయగగన వీథి.
రక్తమాంసముల కూలే సేతువుపై, ఓడిన ఒంటరి భటుడను నేను
కొడిగట్టిన కాగడాల వెలుగులోన, వేకువకొరకు వేచియున్నాను.
నేనే ఒక కాగడానై, నిశీథినికి ప్రత్యూషపథం చూపుతున్నాను.
తిమిర మరణశాసనపత్రంపైన, నెత్తుటి చేవ్రాలు చేస్తున్నాను.
రేపటి వారసులారా! నా గురించి చెడుగా ఏమీ అనుకోకండి.
పూవుల కెంజాయలుగని హర్షించండి, నెత్తురు గురుతు తలపబోకండి!

# అనిమిష గీతి

అనిమిషులకు రెప్పల్లేవు, అందుచేతనే వారికి నిదురరాదు.
నిదుర చిన్నిచావు గనుక, వారికి ఎన్నడూ చావుకూడ లేదు.
చావులేదు గనుకనే బహుశా వారు అజరామరులైనారు.
ప్రతినిముసం చనిపోయే మనబోంట్లకు పూజ్యప్రవరులైనారు.
రెప్పలున్నా మూతబడక కంటికి కునుకులేనివారు ఉన్నారు.
మర్త్యజనులుకానివారు, దైవప్రకృతి కొంత నేర్చుకొన్నారు.
ఆకాశం నిదురపోదు, చుక్కల కన్నులకూ రెప్పలులేవు.
భూమాతకు కునుకురాదు, ఆమె కనులలో పత్తులు ఆరిపోవు.
చెట్లు మేలుకొని ఉంటయ్, మిణుగురు కన్నులకూ రెప్పలులేవు.
ఇళ్ళు మేలుకొని ఉంటయ్, దివ్వెల కన్నులకూ రెప్పలులేవు.
కునుకుతోంది నరలోకం, మేల్కొన్నది హృదయపు శోకపు శాపం
కునుకుతోంది పెనుచీకటి, మేల్కొన్నది చీకటిగుండెల పాపం.
కునికే ప్రేయసీప్రియులు, కాని ప్రేమ కన్నులలో కునుకులేదు
కునుకుతారు పసిపాపలు, కాని తల్లి కన్నులకో కునుకురాదు
కునుకుతారు హంతకులూ, కాని ద్వేషప్రేతానికి నిదురరాదు.
కునుకుతాయి సమాధులూ, కాని మరణ నయనాలకు నిదురలేదు.
కునుకుతాయి శిథిలాలు, కాని అతీతపు కనులకు కునుకులేదు
కునుకుతాయి జ్ఞాపకాలూ, ప్రేమప్రేతపు కనులకు కునుకురాదు
కునుకుతాయి దేహాలూ, దేహంలో స్నేహానికి నిదురలేదు
కునుకుతాయి మోహాలూ, మోహంలో దాహానికి నిదురరాదు.
కునుకుతాయి విగ్రహాలూ, పూజించే కన్నులలో కునుకులేదు
కునుకుతాయి నమ్మకాలూ, యోచించే హృదయానికి కునుకురాదు.
కునుకుతాయి శబ్దాలూ, కాని మూక సంకేతం నిదురబోదు.
కునుకుతాను నేకూడా, కాని సఖా! నా గీతం నిదురబోదు.

# గడ్డిపూలు నవ్వుతాయి

నేనొక్కణ్ణి బ్రతుకుల తిరుణాళలోన
            విడిగా పెడగా నిలబడి చూస్తున్నాను
రంగుల ఆటబొమ్మలు, కాగితపు గుమ్మటాలు
            పూలు, పటాలు, బొంకుల, రంకుల రాట్నాలు.
మహాజనపు రాకపోకల రాలుటాకులు
            చిరిగిన కాగితాలు, పత్రాలు, ఎంగిలి ఆకులు.
వేనవేల హూప రస శబ్ద స్పర్శ గంధాలు
కాలపు కొంచెపు ఒరిపిడికే తెగి రాలే క్షణిక మోహబంధాలు.
చూడని కన్నులతో అన్నీ చూస్తున్నాను.
గికురించే వికారాల వికవికలకు, పకపకలకు మది తలుపులు మూస్తున్నాను.
వారెవరో, నేనెవరో, వారిలో ఒకడను కాను.
దిగంతాల శూన్యంలో శోక ధ్వజస్తంభలా నిలచినాను.
కానున్నది, రానున్నది స్పష్టంగా చూస్తున్నాను.
మరికొంత సేపటికే వింత సంత ముగుస్తుంది, మసకచీకటి పడేవేళ,
సంజపొగలో కరగి చెరగిపోతుందీ తిరుణాళ.
ఎవరిదారిని వారు వెడలిపోతారు
తిరిగిచూడరు, గురుతు తెలుపని గురుతులు విడిచిపోతారు.
మూకల రాకపోకల రాలుటాకులు
చిరిగిన పొట్లాలు, కాగితాలు, పత్రాలు, ఎంగిలి ఆకులు:
చీకటి బయలును వరించి, ఆవరించిన
            నిర్జన నిశ్శబ్దత, నిస్తబ్ధత చీల్చి
ఒక తుపాను వీస్తుంది నరుని పేకమేడలు కూల్చి, ఎత్తిన తలలు వాల్చి,
ఉరుము ఉరుముతుంది, మెరుపు మెరుస్తుంది, హోరున కుంభవృష్టి కురుస్తుంది.
రాకపోకల రాలుటాకులు
            గాలిలో ఎచ్చటికో ఎగిరిపోరాయి.
నిర్మల నీరధారలు, కలుషాన్ని, కల్మషాన్ని కడిగి తుడిచివేస్తాయి,
మేలిమి వెలుగులోన, పచ్చని పచ్చికపైన
            గడ్డిపూలు ఎప్పటిలా నవ్వుతాయి.

# రక్తకమలం

మృతశైలాలు వినీల గహ్వరాలు
ధావన చొరరాని చిక్కటి తీవెల చింపిరి అరణ్యాలు
ఏరులు, సెలయేరులు, పాచిన కోనేరులు దాటి
రుధిర పంక ధూళిధూసర వత్సరాల బారులు దాటి
కోరిన గమ్యాన్ని, వాగ్దత్త వసుంధరను చేరాను.
(వసువులు లేరు దర ఉన్నది.) ఈ మృత ధరణినా నేను కోరాను ?
ఎకరెడ ఏ మీరరాని ఆనలు మీరాను ?
ఇది మృతవేళ, ఇది అవిగత విగతవేళ,
భూచర్మాన పుళ్ళ జబ్బులు, కెల్లు దుబ్బులు; కమురుకంపు క్రక్కే నేల
పాపంతప్ప పండదు, శోకంతప్ప మండదు, శూన్యంతప్ప నిండదు
ఇదే నరుడు చేతం చెదరి, భూతప్రేత పిశాచాలకు మ్రొక్కేవేళ
అనిష్కర్ష, శుష్క చర్చల, వేదాంతాల అంతవేళ
ప్రహ్లాదుని కఠిన తపసు ఫలియించే వింతవేళ
ఇచ్చట నేను చేరాను; కాని ఈ ధరనా కోరాను ?
ప్రశాంతాల తీరంలో, నీలాల నీరంలో, రక్తకమలం పుష్పిస్తుందని వినికిడి
తరతరాల గాలికబురుల ప్రానుడి.
గుడిలోలేని దైవం కొరకు, నుడిలోలేని భావం కొరకు
అసిధారావ్రతమూనే వీరుల కొరకు, రక్తకమలం కుసుమిస్తుందని వినికిడి.
సంకట శూలాగ్రాన, కాళియ వ్యాళ నాళాగ్రాన
మరణశైవల సంకుల సరసి నీలాగ్రాన, రక్తకమలం ప్రసవిస్తుందని వినికిడి.
రక్తకమల సమ్మృత కాంచినవారు రూపోన్మత్తులౌతారు
రక్తకమల గంధం చవిచూచినవారు రాగోన్మత్తులౌతారు.
మరణం వారిని వరించి, కనికరించి, వరమాలలు వేస్తుంది,
వారిని పిలచి, వలపించి, అజరామరుల చేస్తుంది.
ఇది వినికిడి, తరతరాల ప్రానుడి.
దిక్కుల ద్వారాల్లోంచి అదృష్టాతిథి కొరకు,
తప్పని విధికొరకు వేచియున్న నేను,

నెమలిలాగు ఒడలెల్లా కనులుచేసి కాచుకొన్న నేను
వివిధవర్ణ విభ్రమంతో రేబవళ్ళ రాకపోకలు చూస్తున్నాను.
మనసులోని అరలు, పొరుగులు తీస్తున్నాను
దొరకని దాని కొరకేదో వెదకి మరల మూస్తున్నాను.
అపును, ఈ జీవితం పదేపదే పాడిన పాత పాచిపాట
అరగి, చెరగి, అర్థం కోల్పోయిన మురికి మాట.
కాలం ఉమిసిన ఎంగిలి —
మహాకాళిక స్వీకరించని బలి.
అప్పుడు పలికింది అశరీరవాణి,
శుద్ధాంతపు ఏకాంతాన నివసించే మహారాణి.
"హృదయ రుధిరంతో ఉదయ ప్రదోషాలకు కెంజాయలువేసే నీవు
నెత్తుటి లత్తుకతో ప్రాణరాణి పాదాలకు పారాణిపూసే నీవు
అర్థంకొరకు, అర్థంలోని భావం కొరకు,
పంచెవన్నెల రామచిలుక జీవం కొరకు
వెదకి వెదకి వేసారిన నీవు
రక్తకమలం కొరకు వెదకు, ముక్తికమలం కొరకు వెదకు
వలసినది గెలువగలవు, తలచినది, వలచినది గెలువగలవు
రక్తకమలం కొరకు వెదకు !"
"రక్తకమలం విరిసే కాసారమేది ? తిమిరభ్రమ కారాగార ద్వారమేది ?"
"రాకాసి కోటకొమ్మల ప్రేలే మొండాల నడుగు !
వంగల రావి మొండికొమ్మలపైనుండే గండభేరుండాల నడుగు !"
నాటినుంచి, నేటివరకు, కల్పాలు, కల్పాంతాలు నడచాను,
హర్షశోకాల ఋతువులు, రక్తాశ్రువుల క్రతువులు
ఆశల ఆకాంక్షల ఆద్యంతాలు కడచాను.
చివరకు ఈ నిర్జల నిష్ఫల వంధ్యాసంధ్యాభూమి చేరాను.
కాని నేను ఈ ధరనా కోరాను ?
ఏదీ, కనుచూపుమేర నీరులేదు, కలహంసల దారులేదు;
రక్తకమలం ఎలా కుసుమిస్తుంది ఇచట ?
ముక్తికమలం ఎలా వికసిస్తుంది ఇచట ?

కోరుకొన్న గమ్యం ఇది కాదా ?
వాగ్దత్త వసుంధర అసలు లేదా ?
అప్పుడు పలికినది అశరీరవాణి,
శుద్ధాంతపు ఏకాంతాన నివసించే మహారాణి.
"ఓ నరుడా ! పామరుడా ! ఆశల ఆద్యంతాలు కడచావు
పాములా ప్రాత బతుకు కుబుసాన్ని విడిచావు.
లోకమంతా వెదకి వెదకి విసిగావు.
కాని నీలో కనుగొనలేదు నీవు.
శరీర శిఖరాగ్రాన,
రాజహంసలు విహరించే మానస సరసీ నాభిమూలాన
స్నాయుశైవల సంకులగర్భ కర్దమాన, రక్తకమలం కుసుమిస్తుంది.
దూసిన నెత్తుటి బాకు ఒక్కొక రేకు,
చాచిన వహ్ని జిహ్వ ఒక్కొకరేకు
పద్మరాగ జ్వాలాభీళ విషమ సుషమ
పడగవిప్పి ఆడుతోన్న రక్తనాగు
తేనియ చిచ్చుల ప్రోగు.
రుధిర సరసిజనాభిమధ్య
రక్తపింగళ మధురస్ఫురదార్చి కీలలెగసే చోట
దివ్యరశ్మి నివహవేశ్మం,
ప్రాణజ్వాల పాలించే మించుదీవెల కంచుకోట,
అన్ని తావుల ప్రోవుల తోట,
రక్తకమలం కుసుమిస్తుంది అచట
ముక్తికమలం వికసిస్తుంది అచట."

# నేను మీ కవిని కాను

పొండి, పొండి, వెడలిపొండి; నేను మీ కవిని కాను,
వాస్తవం చెబుతున్నాను, ముమ్మాటికి నేను మీ కవిని కాను.
నా చుట్టూ నీడల్లా ముసిరిముసిరి మూగకండి
లే ఎండల పొడల జడిలా నా రుధిరం త్రాగకండి
మీకు మళ్ళీ చెబుతున్నాను, నేను మీ కవిని కాను
పొండి, పొండి, వెడలిపొండి.

తేప తేపకు వ్రేలెత్తి చూపకండి
మాటి మాటికి చేతులు చాపకండి
నేను మీకు ఇవ్వగలదేమీ లేదు
అయినా ఇది సమయంకాదు, మీకు వేళాపాళా లేదు.
పొండి, పొండి, వెడలిపొండి.

నాదాల, నినాదాల, వివాదాల బాణసంచాలు ప్రేల్చటానికి
రంగు రంగుల మతాబాలు కాల్చటానికి
చిలుకలాగు సూక్తులు పలకటానికి
శాక్రిన్ తేనె సోన లోలకటానికి
మహామహులకు అభినందన పందనలు తెలపటానికి
ఇష్టంలేని కృపణప్రశంసల తీయనివిషం కలపటానికి
నేను మీ కవిని కాను.

మూగిన మహాజనం మధ్య, దయదలచిన ధనంమధ్య
పొత్తాల పత్తనాల, నాగరికుల శాస్త్రీయభ్రమలసఘనవనం మధ్య
నిధనంవంటి ధనంచేసే సత్కారాలు, సన్మానాలు
జరీఅంచుల శాలువాలు, చందన తాంబూలాలు, పూలగుత్తులు, హారాలు,
కవితాసతి శవసంస్కృతి క్రతువులోన తీరని అవమానాలు,
నేవలచిన ఈ మృణాళదేహానికి చేజేతుల నిప్పుపెట్టలేను నేను.
నేను మీ కవిని కాను, వెడలిపొండి.

లోకం చూశాను నేను, శోకం చూశాను నేను,
లోకంలోన శోకంలోన, నాకం కూడ చూడకపోలేను నేను,

జీవిత మహిత జనక దుహిత స్వయంవర సమరంలోన
పినాకాన్ని తృణంలాగ త్రుంచిన నేను
మైనాకుని రెక్కలు ఉత్తరించి,
గర్వోన్నత సర్వపర్వత శీర్ష శృంగాలను వంచిన నేను
నిరస్త్ర నిరస్తుడనై, లజ్జావనతమస్తుడనై,
దీనంగా, మౌనంగా నేడు వేడుకొంటున్నాను.
నేను మీ కవిని కాను, దయచేసి వెడలిపొండి.
జనన జీవన మరణాలు మసకలాడే ఇసుక తరగల కలసిపోయి
రాగాల, విరాగాల, సరాగాల
సరస మసృణ కుసుమ విసర పరాగాల ఛాయలు వెలసిపోయి
చెలరేగిన గోధూళి ధూళిలోన కలసిపోయి
ఇచట మసకచీకటిలోన, నా నిస్వన శిథిల వికల కుటిలోన
తోచక నేనేదైనా పొరబడి, తొందరపడి వ్రాసినా అది మీకోసం కాదు,
ఏదైనా, చేదైనా నాదే అది, మోసంకాదు, అది మీకోసం కాదు.
మీ కోసం నేనిక వ్రాయలేను, నేను మీ కవిని కాను.
సూక్ష్మగ్రాహ్య పారిజాత పరిమళాలు
దూరగ్రాహ్య సాగర నీర గభీర కలకలాలు
దుర్గ్రాహ్య దురూహ్య విపిన జటిల విటప పర్ణార్ణవ మర్మరాలు
యామినీ కోమల గర్భవాంఛావహ్నిస్నాత ధూప దీపితాఘ్రాణాలు
ఏడు కడలుల కావలనున్న దీవిలోన పంచెవన్నెల రామచిలుక ప్రాణాలు
మూసిన దిక్కవాటాలు ఛేదించి దూసుకపోయే వన్నెవన్నెల కిరణాల
బాణాలు,
సుషమా విషమ వారిధిలోన దీవి వెదకే నావికుడను,
తెల్లని కాగితాలకు మసిపూసే గారడి ఇక చేయలేను
నేను మీ కవిని కాను,
మీరు వెదకే కవి ఇక్కడ లేడు
అసలు ఇతడు అతడు కాడు
మరలివచ్చిన ప్రేతంగాని, మరచిపోయిన గీతంగాని
చెరగిపోయిన సుదూర వినీల ప్రియాతీతం కాని

భావనలో నవజీవం పోసుకోవు
పగిలిన పలకపైన ఓ, న, మ లు రాసుకోవు
కొండవీటి బురుజుపైన పెదిగిన పాచి
కోనేటి పసరులలోన ఎదిగిన నాచు
రావి ఆకుల అంచుల మంచుబొట్ల మిలమిల మెరసి మాయమయ్యే
పేల వెన్నెల.
వేకువలో కరగిపోయే చీకటికల
ఏదీ తిరిగిరాదు, కాని ఏదీ చెరగిపోదు.
కరకర ప్రొద్దుపొడచి చండకరుడు మండిపడుతూ భగభగ పరుగులిడే వేళ
జీవిత రుధిత స్నాత కృపాణాల శాణధారల
మధ్యందిన మహోజ్వాల మరిమరి మెరుగులిడే వేళ
వేయితలల వాసుకి కసితో బుసలుకొట్టి కస్సున లేచి ఆడే వేళ
మరో కవిత, ఇతర కవులు, వారు సుకృతులు,
వారికి నా నమస్కృతులు.
పరాజితుడను, మౌనవ్రతుడను
మీ శ్రేయైషిని, హితుడను
కాని నేను కాచుకొన్న రేతిరికే సన్నిహితుడను!
మళ్ళీ మీకు చెబుతున్నాను,
నేను మీ కవిని కాను, ఇంక నన్ను వదలండి.
దయచేసి వెడలిపొండి.

# అరచిత కవిత

నేనిక ఎన్నటికీ కవిత వ్రాయకపోయినప్పటికీ, ఎప్పటికీ
సమయ శ్వేతపత్రంపైన సంతకం చేయకపోయినప్పటికీ
ఆ రహస్య గుహాద్వారం నాకోసం తీయకపోయినప్పటికీ
అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ
నీ కన్నులలోన కవిత విహసిస్తూ ఉంటుంది
నా హృదయంలోన కవిత నివసిస్తూ ఉంటుంది.
అవును, నేనికముందు అసలు కవిత వ్రాయకపోతేనేం
ఆ రహస్య గుహాద్వారం నాకు తీయకపోతేనేం
వ్రాయదలచి వ్రాయని నా అగణిత కవితలతో
జీవిత కరాళ కాళరాత్రిని వెలిగిస్తాను.
ప్రణయప్రసవ జీవనమరణ వేదనలను తెలిగిస్తాను
పలుకని మాటలు వదలి, పలికిన పాటలు వదలి,
మాటలు ఆటలు వదలి
అరుణ కిరణ లేఖినితో వ్రేలే చిగురుటాకులపైన
రాలే పూలరేకులపైన నా గీతం వ్రాస్తాను.
రేయికడలి తరగల చుక్కల నురుగులతో
చీకటి చెట్లకొమ్మల మిణుగురు పురుగులతో
జాలివంటి గాలితో,
దీనంగా మౌనంగా నన్నే పరికించి పలుకరించే
కోటికోటి అదృశ్య లోచనాల శోచన వీక్షణాలతో
తరతరాల దుర్భరతర జీవిత బాధావధిని భగ్గున వెలిగించే జ్వాలా
క్షణాలతో నాగీతం వ్రాస్తాను.
అసలు వ్రాయకపోతేనేం? నే వ్రాయని గీతాలను
కోటి దీనదృక్కులలో, కోటి మౌనవాక్కులలో
వెలసిన నేనే పఠించి, జపించి, తపించి విలపిస్తాను.
సహృదయ రసికులకొరకు ఇంక నేను వెదుకలేను, వెదుకబోను.
అవును, నేనికముందు కవిత వ్రాయనేమో?

మాటల కుంచియలతో, అందాల విందుచేసే హరివిల్లులు గీయనేమో ?
కాని నేను కవిని కాని వేళకూడా
నా హృదయంలోని కవిత కార్మొయిళుల నింగిలాగు
పాశాలగంగలాగు,
దుర్భర గర్భశోకపు మహాజలప్రపాతంలాగు పొంగిరాని వేళకూడా
నేను నా వ్రాయని కవిత, వ్రాయని తీయని కవిత
నీడలా వెన్నంటి పాయని కవిత, ఏ నాటికి మాయని కవిత
చదువుతూనే ఉన్నాను.
కవుల పేరులు, వారల కవనాల పేరులు వల్లించలేనుగాని
కంటిపాపలా మాయని, వ్రాయని, తీయని కవిత
చదువుతూనే ఉన్నాను.
సుదూర శైల శ్రేణిపై ప్రథమ మేఘఘోష
శోకసాగర తరంగాల అవిరత విగళితాక్షర భాష
అగణిత విగత యుద్ధనిహత జనవాశ్వ ప్రేతరాజి కాతర హేష
మానవరక్త రాగరంజిత ప్రాతఃప్రదోషాల కెంజాయలు
నిర్నిద్ర నిశీథ బాధా శ్మశాన శాంబరి మాయలు
హైమశైల ఫాలాగ్రాన ప్రాలేయ ప్రళయ ఝంఝ
అభిశప్తాతృప్త తప్త జీవితాల చరమాంకపు ఎర్రనిసంజ.
నిదురించే పసిపాపల పెదవులపై కదలే మృదుహాసం
మూగవలపు ముద్దిడలేని మ్రోవి మోసే ఆకాశం
చూసిన మాసిపోయే, తృటిలో మెరపై మెరిసి దాసిపోయే ప్రాయపు మిసిమి
మేలిమి పైరువన్నెల బాలింతల చెక్కిల పసిమి
ముదుసలి మొగపు ముడుతల కాలపు పణకిన వంకర చేవ్రాలు
నరునకు పురుడుపోసే ముత్తవ మంత్రసాని చెరగున తుడిచిన
నెత్తుటి నీలాలు
వంధ్యాగర్భకుహరంలో దుర్భర వాత్సల్యజ్వాల
మరలమరల ప్రళయ పాత్రికలో నింపే తిక్త రక్త జీవనహాల
నిర్మల జలధారలోన జలకమాడి కిలకిలమనే కిరణాలు
పచ్చికబయలు, రెల్లుపూలు, గడ్డిపూలు, పేదల ఆభరణాలు

దిక్కుల పంజరాలను పరిహసించి ఎగసిన పులుగుల బారులు
పాతాళపు లోతులలో పసరుల చీకటి వేరులు
నే చదివిన అరచిత కవితలన్నీ వర్ణించలేనుగాని
చదివి చదివి నాలోనేను మురిసిపోతూ ఉంటాను.
అరచిత కవితాకరుణ దాహ జర్జర ధరణిపైన కురిసిపోతూ ఉంటాను.

*

అవును, నేనికముందు బహుశః కవిత వ్రాయను
మాటల కుంచియలతో, అందాల విందుచేసే హరివిల్లులు గీయను.
కాని నేను వ్రాసిన కవితలకన్న వ్రాయదలచి వ్రాయనివే అందమైనవి
త్రావే శిశువులేని స్తన్యంలాగు
నిశీథ సమాధి గర్భకుహరంలో, జాగ్రత జ్యోతిశ్చైతన్యంలాగు.
నేను వ్రాసిన కవితలకన్న వ్రాయదలచి వ్రాయనివే అందమైనవి.
మత్ హృదయ మందిరాంతర సుందర ప్రతిమలలో
ఇరుల నీలి మేలిముసుగు తీయనివే అందమైనవి.
మిక్కిలి మక్కువతో వలచికూడ, అకురానజేర్చని చక్కనిచుక్కలాగు,
నీలాల నింగిలోన తేలిపోయే, అందని అందాల రిక్కలాగు;
అవును, నేను వ్రాయని దివ్య కవితలగూర్చి,
వలవని భవ్య వనితల గూర్చి తలచినపుడు
నా హృదయం దిగులు పొగలలోన మునిగి పొగలుతుంది.
జీవిత పశ్చిమపథాన విక్షత సంధ్యారక్తిమ కరడుగట్టి
నల్లని చిక్కని చీకటి మిగులుతుంది.
కాని అంతలోన నేను అరచితాగణిత కలిత కవితల తలచి తలచి
వేలవత్సరాల నీలిమంచులోంచి చెయి ఊచే
పూర్వపు అపూర్వ సర్వ ప్రథిత మహిత రూపవతుల వలచి వలచి,
సుషమా సాగర లహరుల నోలలాడి
దూరాంబర మిహికావృత శతమిహిరుల మేలమాడి
అసంపూర్ణ, సంకీర్ణ, విశీర్ణ, వికృత జగతిని
విరచించిన ఆ వృద్ధవిరించికన్న మిన్నగా నిలుస్తాను,
అప్రసవిత ప్రసవాలను, అసంభవ నవలభవాలను పిలుస్తాను.

అప్పుడు నా మోహ విరహిత, నిశ్చల నిర్మల మానస నయనాలముందు
అసంగత గతంలోంచి అప్రస్తుత ప్రస్తుతంలోంచి
అనాగత భవిష్య రహస్య గర్భగుహలోనికి ఒక అవిరత జ్యోతిర్లతలా,
జీవిత చైత్రస్యందన జైత్రయాత్రకు ఆరతిలా.

ఒక అద్భుత మణిపద్మం
అమృత ఋతఘృణిసద్మం.

పద్మనాభిమూలంలోంచి, జీవన మరణ సమ్మిశ్రమ రుధిర గంధం
పరమమోద, చరమఖేద ద్వంద్వ విచల దవిరత హృదయస్పందం
రక్త నాళికల పారే ద్రవిత లోహ మోహ భీషణాగ్నిధార
రుధిరాణు సమూహాహవ దాహోకుల దేహకార,
ఎముకల ప్రోపు మాంసపు ముద్ద, ఒక పిడికెడు మంటిలోని ప్రాణచింత
చీము నెత్తురుల మిత్తప కౌగిలినుంచి
మించు దీవెల అంచులదాక పాలపుంత
అస్థిపంజరపు చెరలో చిక్కిన పులుగు
కనుల వెలిగే విశాల వ్యోమవిస్తారం,
శాంత స్నిగ్ధ శాద్వలాలు, కాని ఆడరాని బక్కరెక్కలపై
దుర్భర గురు భూభారం.
జర్జర దేహపు చెరలో చిక్కి నేను, నేత్ర కోటరాల్లోంచి చూస్తున్నాను
నా రెక్కలకందని విభ, ఎన్నటికీ ప్రందని విభ, నా చీకటి మోస్తున్నాను
కాంచన కల్పనా చలచ్చేలాంచల మృదుపరిమళ బాలానిల జయకేతువు
నా నరకపు చీకటి చెరనుంచి స్వర్గస్వప్న రహో గేహ దేహళికి సేతువు.
దేశ కాలముల కూడలి, నా శ్రుతులను
కోటి కోటి అప్రసవిత శిశువుల రుదనారావం
నిష్ఫల ప్రణయాల ఘోష, బలి శిలలను వెలిగించే జీవ రుధిర సంస్రావం
మరణ మేఖలా వలయిత లోక శోక క్షార నీర గభీర పారావారం
మిహిరరహిత మిహికావృత మంతిమ సంతమ సత్రమ సంక్రమణ
శ్రమభారం
లజ్జా కజ్జల ముద్రిత రుద్రస్థలి ఈ భూతలి, కవితాసతి శవవాహక
హరుడు నరుడు

సరస మసృణ కుసుమ విశిఖ తతి కాదిది, నెత్తుటి కరడుల విసరే
పరుడు మరుడు
కవితలేని కడపటి చీకటిలో, ఏ వేకువలేని చీకటిలో ఏమిటి చేయాలి ?
ఉనికిలేని, మనికిలేని చీకటిలో, కలల పొత్తపు కడపటి పుట మూయాలి
జీవిత రుధిరాక్షరాల చెరిపివేసే, మరణాసిత మషి పాత్రిక నొలకబోసి
అనన్య శూన్యాచ్ఛన్న దిశాంతాన, సంస్కృతి శోక కృతికి, స్వస్తి శ్లోకంవ్రాసి
నిశ్శబ్ద ద్వీపటిలో, తొలి పొత్తిటి నలినెత్తుటి చీకటిలో,
హాయిగ నిదురపోవాలి.
విలయ చైత్య శృంగ శైత్య వినీల ప్రేతాశ్రయాల, నీడలలో
నీడలాగు కరగి చెరగి పోవాలి.
మరణానికి మరణం లేదు, మరణంకొరకైనా కరుణ జీవిత మీట
జీవిస్తుంది.
రక్తా లక్తక రంజిత చరణ స్ఫురదుషస్సుషమ తనదే ప్రథమోదయమని
భావిస్తుంది.
గగనామరవల్లరి నొసట, శోణ సూన తిలకంలా,
తరుణారుణ రవిబింబం జ్వలిస్తుంది.
నిశా వేదనా కేదారాల బీజ వాగ్దానం, దివా ధాన్య స్వర్ణార్ణవ వీచికలై
ఫలిస్తుంది.
సిరాపరకల చెరనుంచి వెలువడి కవిత, తెలి వెలుగుల తొలకరిలా,
దీవెనలా కురుస్తుంది.
తుహినాశ్రువుల శుభ్ర స్వచ్ఛ దర్పణాల శతసహస్ర శక్ర చాపవర్ణాళికల
విరుస్తుంది.
నేనొక్కడను ఉండనుగాని, జీవన వన ప్రాంగణాన
ఎప్పటిలా ఋతురాజు కొలువుదీరి
చెలువపు చలువలు నలుగడ పంచుతాడు;
ఆకులు రేకులు రాలి, తలిరుల, అలరుల మరల చెలువుమీరి
ప్రకృతి ప్రసూతకాంతి దీపిస్తుంది, కాలమనే మహావ్యాళం కుబుసం విడిచి
బుస కొడుతుంది.
జరఠ శిశిర మిహిక యవనిక, మిహిర విశిఖ రుధిర శిఖల, చీలి రాలి
తునియలుగా విడుతుంది.

నేనిక్కడ ఉండను, కాని ఇంచుక జాగ్రత్తగా ఆలిస్తే నాకంఠస్వరం
మీకు వినబడుతుంది.

మన్నులోన, మిన్నులోన, గాలితరగల పరుగులదేలి సన్నగా
సొద పెడుతుంది;

రాలుటాకుల పూరేకుల గుసగుసలో, ఏటి నీటి కలకలలో
తెలివెన్నెల తళతళలో

నిర్నిద్ర నిశీథాల నిస్వన జాగరణాల, కోటికోటి నయనతారల మిలమిలలో.
జీవిత శోక సింధు ఘోషలో, ఇంచుక జాగ్రత్తగా ఆలిస్తే నా కంఠస్వరం
కూడ వినగలవు.

కోటికోటి చరణాంకిత రుధిర రంజిత రేణుకలో నా జాడలుకూడా
కనుగొనగలవు.

ఏమంటే ఏదీ చావదు ఇచట; ద్రవ్యంలోంచి రూపంలోకి,
రూపంలోంచి భావంలోకి

ఓజంలోంచి తేజంలోకి, తేజంలోంచి ఓజంలోకి, మరణపు మౌనంలోంచి
జీవన విరావంలోకి

రూపం మారుతున్నది ఒకే శక్తి; రాలుటాకుల సెజ్జలోంచి
క్రొంజివురులు లేచినట్లు.

నేలరాలిన విత్తుల పొత్తిలిలోన, రాబోయే పూదావుల తేనెతుంపరలు పేచినట్లు.
నేను కవిత వ్రాయకపోతేనేమి? విశ్వసుషమకు కరువురాదు,
కవిత అన్నది చావబోదు;

పూవులలో నునుజెక్కుల కావిబోదు, గాలి తరగల యూర్పులలో
ఎరుగని నెత్తావిబోదు.

# ప్రేమ కవితలు-1

చూడు చూడు, చీదర మురుగుకాలువలో తప్పత్రాగి తూలినప్రేమ
చివరకు చెత్తకుప్పలపై కూలినప్రేమ.
మురుగునీరై పారేగంగ; వేన వేల వత్సరాలనంగ
పరిమళ వికల విదిశా నిశా కుంతలాల
పాటల నగరాంతఃపుర వర సుందరుల విస్మృమరకర కుణ్మలాల
అసీరియా, అరేబియా తరుణుల మృదులోత్సంగాల
దివ్యాంగనల కుసుమ గంధ బంధుర సుందరాంగాంగాల
పన్నీరై పెరిగిన ప్రేమ, కన్నీరై కరిగిన ప్రేమ
చూడు చూడు ఎక్కడ తూలుతుందో, ఏమిటి ప్రేలుతుందో ?
వేనవేల వత్సరాలనంగ, పఞ్చాంగల కాయలు కాచిన చక్షుర్వృక్షో
జాలనుంచి
దుర్భర భోగ నిర్భర రోగ గర్భ కుహరాల్లోనుంచి పారిన గంగ
మురుగునీరుగ, రోగ క్రిములు భోగస్థలిగ మారిన గంగ,
ఇదట జీవనది అట ! పుణ్యనది అట : దేవనది అట ! ఛీ !
ఎడదనునాటిన చురకత్తిలాగు, నెత్తుటి క్రొవ్వొత్తిలాగు వెలిగిననాడు
ప్రాణంలో ప్రాణంలాగు,
గుండియ కండలోంచి దూసిన బాణంవంటి గానంలాగు ఎగసిననాడు,
ఎవరూ ఎరుగని ప్రేమ నేడు చూడు
తోడులేక నీడలేక వీథిదీపం క్రీనీడను, మురుగుకాలువ నీటిలోన
బూడిదగా ఆశల కాటిలోన !
సావిత్రీ సత్యవంతులు, నల దమయంతులు
మరణ మహోరగపు కోరలుపీకి, మార్కండేయునిలా అజేయునిగా
నిలిచిన ప్రేమ
వేనవేల చీకటిగదుల, మురికిమంచాల ఉరికంబాల లజ్జారజ్జు
పాశంలో వ్రేలి వ్రేలి
క్రుళ్ళిన దేహ దుర్గంధాల తేలి తేలి
శునకంలా రోజుకొక వందసార్లు చస్తున్నది
హృదయపు బిచ్చగానికి ద్వేషపు బిచ్చమేస్తున్నది.

పాపలవంటి పాటల గొంతు నులిమి,
బావిలో విసరివేసిన దుర్భాగ్య దరిద్రురాలివంటి ప్రేమ
దుర్భర గర్భవహ్నిలో శోకాశ్రువులింకిపోయి, నెత్తుటి చనుబాలుగ్రక్కి-
శిరసుతెగినా ప్రాణంపోక గిలగిల తన్నుకొనే మొండెంవంటి
మొండిప్రేమ.

పడుపుకత్తియ మోజుల గాజుల సడిలో
సుఖరోగాల చీము నెత్తుటి చిత్తడిలో
నాచులాగ, పాచిలాగ పెరుగుతున్నది.
శస్త్రక్రియకు లొంగని రాచపుండై ఎదుగుతున్నది.
ఎగిరిపోయే ప్రాణపక్షుల రెక్కల రెపరెపవంటి
రోగార్తునిశ్వాసనళికల చివరి గురక గురగురలో
మదోన్మత్త మరణ నయనారుణ రేఖల మమతా విషసూత్రాల
ఇరుల మరుల వాగురలో
ఎన్ని వెలుగులు మ్రింగినా ఆకలితీరని రేజీకటిలా వెన్నంటిన ప్రేమ
ఏమంటున్నది ?
వెంట వస్తానంటున్నది.

పాటలగొంతులు నులిమి, కవితాసతిని నడివీథిని వేలంవేసి
కడపటిచీకటిలో జీవిత మహిత సుషమా కుసుమ కళికల చిదిమివేసి
చరమయాత్రాతుర చరణాల కల్మష కలుషధూళివోలె అంటినప్రేమ
వెంట వస్తానంటున్నది.
చీదర మురుగునీటిలోన మళ్ళీ కలలు కంటున్నది.
మృత్యు శత్రువుబలం సగం కాజేసే వాలిలాగు
గాలిలాగు, జాలి లాగు
వెంట వస్తానంటున్నది.
చీదర మురుగు నీటిలోన మళ్ళీ కలలు కంటున్నది.

# ప్రేమ కవితలు-2

నీ ఈ దేహం లోంచి —
దేహం వెనుదవిలి, పెనచి, కలచే మృణ్మయ గంధంవంటి
మోహంలోంచి
ఇంకా దేనికొరకో వెదుకుతూనే ఉన్నాను. ఈదేహం దేనికి గేహం ?
బహుశా అది హృదిలోదాగిన స్నేహం !
"అవునా" అని ఒక వీడని సందేహం !

ఈదేహం అందాల ఆటబొమ్మా ?
శూన్యంలో తేలిపోయే ప్రాణాల పట్టుగొమ్మా ?
నాదేహం నేనౌనా ? నేను కాదా ?
నేనైతే నాదేహ ప్రక్రియలను నేనే పరికించుట ఒక వింతకాదా ?
నీదేహంలోన నీవు, నా దేహంలో నేను, ఇది నాలుగుస్తంభాల
దాగుడుమూత.
దేహాత్మల గణితంలో పరివిధాల, కూడిక, తీసివేత, హెచ్చవేత.
చివరకు శేష మేమిటి ?
ఈవిభ్రాంత మోహధ్వాంత కుహేళికలో, మిగిలే సత్యలేశమేమిటి ?
దేనికి ముసుగు ఈచీకటి ?

చెక్కుల్లోంచి మక్కువ కెంపులు పోయి
మోవినిదాచిన ముద్దుల మురిపాల కావి పోయి
శల్యావశిష్ట తనూవల్లరిలోంచి కుంచియకందని సొంపుల తీవి పోయి
మోహపునాగుల వెచ్చని యూర్పుల వన్నియదేలిన
పసిడి మొగలి సొగసుల మైతావి పోయి,
నయనాల నీలిమణులు, తరంగిత శిరోజాల పట్టుకుచ్చుల నిగనిగల
చేవ పోయి
శుష్కపాండు జరాజీర్ణ దేహ యష్టి శేష మజ్ఞానిమజ్జిత సత్యకిరణం
శాశ్వత విరహ తరుణాన కాలానికి చెల్లించే చరమఋణం
ఏమిటో తెలియవలదా ?
అసలది ఏదైనా కలదా ?

రుజా జరా మరణాల తిక్త రక్త ప్రసూనాల,
సృజన ప్రసజంలోని పరిమళసూత్రం కొరకు
జీవిత శాపతాపాల వసివాడని,
మసిమాడని నిత్య చైత్ర గాత్రం కొరకు
మరణ గ్రీవాన వ్రేలే మంగళసూత్రం కొరకు,
పుట్టుకనుంచి గిట్టుటవరకు వెదుకవలదా ?
అసలది ఏదైనా కలదా ?

దేహపు పరిధానం లోంచి,
రుధిర మాంస మజ్జల లజ్జిత వ్యవధానంలోంచి,
చరమ సమాధానంకొరకు వెదుకవలదా ?
అస్థికాండచ్ఛిద్రాల్లోన, రుధిర మురళీ నాళాల్లోన దాగిన గానంకొరకు
ప్రాణంలోని ప్రాణంకొరకు వెదుకవలదా ?
అసలది ఏదైనా కలదా ?

అది ఏదీ లేదనుకో —
మేదినిగల వివిధ ప్రాణ వన తరువుల సిరుల విరులు
మనికి లోయల పాయలుగా, మాయలుగా పరుగులిడే
హర్ష శోకాస్ర ఝురులు !
ప్రశాంత ప్రాంతరాల వర్ణ వర్ణ పర్ణాల మర్మరాలు
కాంతిస్నాత శకుంత కల కూజితాలు
పంటచేల రాజనాలు, పూలతోటల రోజాలు
అన్నీ వమ్మేకాదా ?
అన్నీ వమ్మే కడకది పిడికెడు దుమ్మేకాదా ?
ఇది తలచిన నా ఎముకలు నీ కౌగిలిలోకూడా
కడపటి చలిలో గడగడ వణుకుతాయి.
తల్లి కడుపులోదాగే పిల్లనిలా, నా చేతులు
నిన్నింకా దగ్గరగా వెదుకుతాయి.

# ప్రేమ కవితలు-3

నీరుకాని, గాలికాని, వివిధ నవల వర్ణాళిని సృజియించే సువర్ణ
కిరణాళి కాని

గుండియ మెత్తని కండల నెత్తురుగా, ఉవ్వెత్తున పెల్లుబికే
వెల్లువవంటి ప్రేమకాని, జాలికాని,

పాంచభౌతిక దేహ గేహ దేహాళిపై దీపాల్లా
హర్షశోక స్వప్న స్వాప జాగరణాలు కాని
ఉనికి కనుమల లోయల్లో పాయని నీడల్లాగు,
జన జీవన జరా మరణాలుకాని,
ఏదీ నీవుకావు, ప్రకృతికి నీవు ఏమౌతావు, ఏమీకావు!
నీలో ఒంటరి నీవు, తోడులేదు, నీడలేదు; ఎవ్వరికీ ఏమీకావు!
జడచేతన ద్రవ్య తత్వ మిశ్రమ విశ్వంలో
నానా యోని ప్రాణికోటి సంకుల శూన్యంలో
విశృంఖల, వికల, విపన్న, విచ్ఛిన్న విశ్వంలో
నిరవలంబ, నిస్సంబల దైన్యంలో
ఒంటరినీవు; నీభావనలోన తప్ప ఎవ్వరికీ ఏమీకావు.
ప్రకృతిని ప్రేమించలేవు; ప్రకృతి రాగాద్వేషరహిత.
ప్రేమను గ్రహించలేదు, పెంచలేదు;
జనకజకాదు; యజన కనక జనక దుహిత.
ప్రాణహీన ప్రతిమను ప్రేమించట మెలాగ!
[నీ ప్రేమ తిరిగిరాదు; పెరిగిరాదు
అది ఎవ్వరికీ ఏమీకాదు.]
గోడకు చెప్పినట్లే అది, గోడకు చెప్పినది నీకు నీవు చెప్పుకొన్నట్లే
అద్దంలో బింబంలా నిన్ను నీవు, ప్రేమిస్తున్నట్లే అది; ఓటమి
ఒప్పుకొన్నట్లే.

ఎందువల్ల నంటావా? లోకంలో ప్రాణమున్న
సుందరస్వర్ణ ప్రతిమల ప్రేమకు కూడ,

రుధిరమాంస సహజవాసన నిబద్ధ దేహ జన్య
సందేహాలు, జిలుగుతెరలా వివిధ వికారాలనీడ.
నీ ప్రేమకు దేహం ఒక వ్యవధానం, జీవం ఒక వ్యవధానం,
నీకు నీవే వ్యవధానం.
దేహ మురళీ నాళంలోంచి ప్రాణం వెలువడిన కాని,
వెలికిరాదు విధుర మధుర రుధిరగానం.
అందం ఒకటుందికాని, అందరాని పైడిలేడి,
రావిఆకుల అంచులపై వెన్నెలల వేల్పుకన్నెల నర్తనలా
మబ్బుతునకల కొనలపైన మసృణ కిరణ వర్ణాప్లవ
ఫేన రేఖల పరివిధ పరివర్తనలా,
గగన సూన గంధంవంటి అందాన్ని వలచిన అది
చెరిగే తరగలపైన చేవ్రాలే,
నయన నలిన తుహినాల్లా అనుక్షణం
మరణ సరోవర గభీర నీర గర్భములపాలే !
మరి భీకర శోకగ్రస్త లోకంలో,
శూన్యంలో, దైన్యంలో ప్రేమ ఎలా బ్రతుకుతుంది ?
కంఠ తరువును వెదకే వల్లరిలాగు విడిన తొడిమను
వెదకే పూవులాగు దేనికొరకు వెదకుతుంది ?
రక్తబలిని స్వీకరించే దేవతలేదు, రిక్తప్రాణ పీఠికపై
పేరుకొన్నది కశ్మలధూళి !
బూజుపట్టిన చీకటిగుడి మారుమూలల ఛాయా ప్రేతాల్లాగు ఉలూకాళి,
దివాంధాళి.
ఏదీ ప్రేమార్హంకాదు. కాని నరుడు ప్రేమతోటి స్పందించని
శూన్యంలో బ్రతుకలేడు.
మారే ఈ విశ్వంలో, మారని ఆలంబంగా, చెరుగని బింబంకొరకు
ఇక వెదుకలేడు,
ప్రేమను ప్రేమించలేవు, అది వంచన, పూవుకు తొడిమ తావికి
పూవు కావాలి !

మన్నులేక ఉసురులేదు, ప్రేమించే ప్రతి నేనుకు మరొక
నీవు కావాలి।

బుద్ధుడు క్రీస్తు, వారు వేరు, గాలిలాగు, వెలుగులాగు, జాలిలాగు
వారి ప్రేమ।

వారల అడుగుజాడలు వెలిగినచోట, అవిరళ వర పరిమళాల
దివ్యసీమ

కాని ఇచట సీమిత హృదయ నికుంజాల విరళచ్ఛాయ;
ప్రేమ ఒక అల్పక్షణిక కుసుమకళిక.

గాలివోలె, జాలివోలె, సువర్ణ కిరణాలవోలె
సహజ సులభంకాదు ప్రేమ; అశ్రుమౌక్తిక,
రక్తతిలక.

# ప్రేమ కవితలు-4

దూసర దర్పణంలో పాంశు పాండుర బింబంలా, వయసు మసక
ముసిరిన మోము.
కాలుని చేవ్రాలువోలె తొలి ముడుతలు రాలుటాకులా వడలిన
మోవి వెనుక వయసు వే.ము
హేమంతపు తాపంలేని ఆతపంలా, అనుతాపం, ఎండకాని
వెన్నెలకాని పేల వెలుగు,
చేరువయే నీరవతా చరణ స్వరంలాగు, తెలియకనే ఎద కలచే
ఇరుల ఎలుగు

బహుశా ప్రొద్దు మరలుతోంది.
పసిడి ఈకలు రాల్చిన పులుగు బోసి చీకటి గూటివైపు తరలుతోంది
నీదికాదు, బహుశా ఇది నాలో ముదిమి బింబంపై ముసిరిన
మసక, కనులమసక నాదిగ్భ్రమ.
అమను, ముదిమి నీదికాదు, నీకుకాదు; జరాజ్వరిత జగతిలోన నీది
నిరత హరిత సుషమ.
ఏమనగా, ఆమని అంతటితో అంతరించదు, కోమల కామిత
సుమాలు నిత్య నవ పునర్భవాలు.
కంచుక నిర్ముక్త విశ్వయౌవన ఫణి వివృత విభతో దీపిస్తుంది;
సృజన రుధిర బీజ వ్రజ ప్రళయ పరశువుకు సవాలు
ఏదీ చనిపోదు ఇచట, మాడిన ముదిమోడులోంచి, క్రొత్తవేరు,
ఎముకల ఎరువులోంచి సరిక్రొత్త పైరు.
ద్రవ్యంలోంచి తత్వంలోకి, తత్వంలోంచి ద్రవ్యంలోకి, నీరులోంచి
గాలి, గాలిలోనుంచి నీరు.
ఏమనగా నేను నిను తలువగానే చలిప్రొద్దుల వలిమసకలు
తొలగిపోయి తొలివలపుల ఆమనిగా
సుషమోషాయోషితవై, రశ్మికుసుమభూషితవై, మదంతరంతరారావ
ప్రతిధ్వనిగా,
ద్విగుణిత యువ దీధితితో మతిలో అవతరిస్తావు

కాలపుపొర కరగిపోయి ఎప్పటిలా స్ఫురిస్తావు.
నను ముగ్ధునిగాజేసే ముగ్ధవుగా, విగళిత హృత్కమల రస
స్నిగ్ధనుగా తొలితవలెనే వరిస్తావు.
మూసిన నాకనులలోన, విస్తృత విగత సుషమా జగతిలోకి
జ్యోతిఃకవాటాలు తెరుస్తావు.
రెక్కలురాని పసికందును, నన్ను నీవు మక్కువగా ముకురైన
గరచి ఘూర్ణిత ప్రణయార్ణవాన్ని తరిస్తావు.
జనన మరణ వనధి గగన మధ్యమ నీల జ్యోతిస్స్నాత శూన్యంలో
నీవూ నేనూ తప్ప ఎవరులేరు.
దిగంతాలు మనస్వేచ్ఛకు నిరంతర ప్రతిబింబాలు, అనంత
దర్పణాలు పృథివి ఒక అదృశ్యరేణువు పేరు.
ఏమనగా రంగులు చల్లే కిరణాల నవ్వుల్లోన
నింగిగట్టున రెల్లుమబ్బుల పువ్వుల్లోన ఏదో ఒక శుభ్ర స్వచ్ఛ
సంకేతం.
వ్యోమ విటప పర్ణాల మర్మరాలు, విస్తృత కవితాస్వరాలు,
ఆ వినీల యవనిక వెనుక ఉన్నది మనకజ్ఞాతం.
అవును, ఇచట దేశంలేదు, కాలంలేదు, వెరపులేదు, వయసులేదు,
ముదిమిలేదు, చావులేదు.
సర్గ ప్రత్యూషంనుంచి, ప్రళయావశేషంవరకు మనం మనుతాం,
మన పయనానికి ఇక ఒక రేవులేదు.
ఏమనగా, వెలుగులోన, గాలిలోన, నీలాల లాలిలోన
కలసిపోయిన మనమికలేము, కలలాగు, మెలకువలాగు
ఉనికి-లేమి, కలల వలలో మెలకువ వేకువలాగు, మన మిరువురం
ఇరుల దరిని కనిన జక్కవ కవలాగు.
వెలుగు జాలున తేలే యుగళ సూక్ష్మ రేణు కణాల్లాగు, కిరణాలే
అపశ్యామృత పరమపద సోపానాలు.
ఈవల ప్రాణాల నెత్తుటి బాణాలు, కాని ఆవల వెలుగు విరుల
మాగిన దివ్యాఘ్రాణాలు.
రేయి లేదిక, ముందు వెనుకల, ఒకే కాంతి,
హేమరశ్మి తరంగాలలో నీవే నా తరణివి.
దిగంతాల కోటి కిరణ వికచవర్ణ వసంతాలు,
కాని నీవే నా అనర్ఘ పుష్పమణివి.

# అపూర్ణ కవిత-2

## అమృత మథనం

ఆధి భుజంగ రజ్జు సంసజ్జిత, గురుమందర మంథాన ఘర్షణల
దేవదానవుల ద్వైతాకర్షణాల
ఛిన్న మూర్ధ్వ మూర్ఛాహత మజ్జిత, ఫేనాచ్ఛన్న తరంగ మాలికలు
దనుజ బలాత్కృత మనుజ బాలికలు
శ్రీవిహీన సంపదా విసర్జిత, క్రోధ రోధ బాధా భర గర్జిత
జలధి విరాడ్గర్భస్థిత శ్యామల, మత్స్యగంధ బంధురతల సీమల
ఏ ప్రవాళమణి శైల కందరల, అందని లోతుల సుందరేందిరల
మయంకాంక పర్యంకం పైనో, ఓషధి సంకుల పంకంలోనో
ఏ కడనో ఉన్నది పీయూషం, మరణ రజని పాలిటి ప్రత్యూషం.

# ఇంక కవిత లేదు

నేస్తం, ఇంక కవితలేదు —
దైనందిన ప్రాతఃకాంతిని నవతలేదు.
ఏమని అడుగవద్దు !
కనులుమూసిన కవితకు ఇది నా కడపటి ముద్దు !
రంగు రంగుల కలలు, కలతలు కలవరింతలులేవు.
చరమరజని,నిశ్చలనిద్ర, చింతలు వంతలులేవు
కరుణాఝరి ప్రసవించి, ప్రస్రవించే, హృదయపు రహస్య గుహల్లోన
విషజ్వాల రగులుకొన్నది, భీషణద్వేష విషజ్వాల.
మంటలలో మంటల పంటలుతిని, జీవిస్తుంది మానవాళి.
అశ్రువులింకి నిప్పులు కురుస్తుంది నేత్రపాళి.
స్వేదం కూడ రాదు, ఉండవు ఖేదమోదాలు.
హాసం హర్షాన్ని సూచించదు
రుదనం విషాదాన్ని సూచించదు
రోషం కోపాన్ని సూచించదు.
నరుని చరిత్ర అభినయమై జీవితం జీవితాన్ని సూచించదు.
అదుగో చూడు, బారులుతీరి కీలుబొమ్మలు, దిష్టి బొమ్మలు
నిష్ప్రాణ నిరాఘ్రాణ పలల ప్రసవాల పట్టుగొమ్మలు
కీలు నొక్కితే చాలు, నిద్దురలో నడుస్తారు
సైన్యపు కవాతులాగు ఒకేసారి, ఊపిరి విడుస్తారు.
కీలుబొమ్మలకు ఆకలిలేదు, దప్పిలేదు, భయంలేదు, ప్రేమలేదు,
ద్వేషంలేదు, తిట్టు, కసురు, ఉమ్మివేయి, రోషంరాదు.
రేపటిలోకంలో, లేబ్‌లోనిశీసాసగర్భాల్లో తయారవుతున్నారు శిశువులు
ఓషధులే తండ్రులుగా, రస విషాలు తల్లులుగా, తయారవుతున్నారు
శిశువులు.

కలలు, కన్నీరులు, కలహాసాలు ఎరుగని పశువులు.
ఈపశువుల పటాలాల బుజాల పల్లకిపై వస్తున్నాడు కల్కి —
రాబోయే నాయకుడు, రాసాయనిక మానవుడు.

# నాయకునకు సానుభూతి

పోయినవారి కొరకు కాదు శోకం —
వారికి శోకంలేని లోకం; ఆలోకం
ఉన్నవారి కొరకే మాశోకం.
మానవాస్థి కంకాళాల సోపానాలపైన ప్రాకి
        (ఎవరివో కాదు, సుహృదుల, ఆప్తుల, హితుల కంకాళాలు)
ఆదర్శపు మహోత్తుంగ శైల శృంగ శీర్షంతాకి,
        శోక బాష్పసంకులమైన జీవిత సమతలాన్ని అవలోకించే నీవు,
ఈచీకటి నిముసంలో ఏమనుకొంటున్నావు ?
కరుణారుణ నయనాల్లో ఏ విషాదమేఘాలు
వినవేరని శ్రవణాల్లో, ఏ ప్రపాత వేగాలు ?
క్రక్కిన నీ నెత్తుటితో, తెలుగునేలకు కెంజాయలు తెచ్చిన నీవు,
ఈచీకటి నిముసంలో ఏమనుకొంటున్నావు ?
ప్రియనేతా ! ప్రియభ్రాతా !
మాకు నీహర్షంలోనే పాలుందా ? శోకంలో పాలులేదా ?
మానవహస్తం మలచిన శిల్పంలోనే శోకపు చాలులేదా ?
మానవహృదయం వలచిన స్వల్పంలోనే శోకపు చాలులేదా ?
ఒక్కొక్కని హృదయంలో ఎన్నెన్ని సమాధులు, ఆరని
                                        జ్ఞాపకాల దీపాలు ?
హృదయ రుధిర గంధంతో మత్తిలిన కెందామరలు, చెంగలువలు,
                                                రోజాలు,
కాని ఈ నేలతల్లి గుండెల గాయాలపైన పచ్చిక మొలుస్తూనే
                                                ఉంటుంది.
బోసికొమ్మల రెమ్మలపైన, క్రొంజివురుల ఆమని వెలుస్తూనే
                                                ఉంటుంది.
విదగ్ధ హృదయాలను వలపువెలల స్నిగ్ధత పిలుస్తూనే ఉంటుంది.
మానవ హృదయ పిపాసకు చావులేదు
జీవితంలో నిరాశకు తావులేదు.

ప్రియనేతా ! ప్రియభ్రాతా !
కోట్లకొలది అనుగు తమ్ములు నీకు !
కోట్లకొలది అనుగు పాపలు నీకు !
చూడు చూడు నీముందే మానవ శిశువుల ఆట,
కేరింతలు, చప్పట్లు, నవ్వుల తీయనిపాట,
జీవితుల భావనలో మృతులు జీవిస్తారు,
జీవితుల శ్వాసలనే మృతులు సేవిస్తారు !
జీవితుల హర్షాన్నే మృతులు దీవిస్తారు.
ప్రియనేతా ! ప్రియభ్రాతా !
నీశోకం లోకానిది, నీశోకం మాకివ్వు !
నీవు మరల ఎప్పటిలా పువ్వులాగు నవ్వు !

# రాజఘాట్

పిల్లల చల్లని నవ్వులు —
నందన మందారాలు, దేవతరువుల పసిడిపువ్వులు,
మందాకిని అలల వెలసిన చందురు వెలుగుల రవ్వలు
మాలలుగా గ్రుచ్చి నీ సమాధిపైన ఉంచాలి.
లజ్జావనత వదనులమై మేము తలలు వంచాలి.
యుగయుగాల, తరతరాల నర రుధిరారక్తసిక్తమీ ధారుణి,
పరమ దారుణ జిగీషల, జిఘాంసల, హింసా ప్రతిహింసల
ప్రఖర వారుణి
త్రావి, త్రావి మత్తిలి, కెరలు భూత ప్రేత పిశాచాల క్రీడాస్థలి
ఈ భూతలి.

నరుని ఎముకల ఎరువులేని బెత్తెడు చోటులేదు,
నరుని నెత్తుట చిత్తడికాని పేటలేదు.
నెత్తుట తడిసిన మంటిన పూచిన పూలు
నెత్తుటి వాసనలే దాచిన పూలు నీకెందుకు ?
నెత్తుటి పుప్పొడితో నీసమాధి మలినము చేయనెందుకు ?
నీవెంతో ప్రేమించిన ఈదేశం,
ప్రబల హింసా మదోన్మత్త నరపిశాచిచేత నిన్ను కోల్పోయిన
వేల్పులదగు ఈదేశం
నేటిదనుక శాంతి నెరుగదు.
అర్ధనగ్న, రుగ్ణ, భగ్న దరిద్ర మానవకోటి నేటిదనుక
కాంతి నెరుగదు.
మతంపేర, గతంపేర, నవజీవనవ్రతంపేర, దారుణ
మారణహోమం,
నిష్పాపుల రుధిరమొలికి శాపిత దితిజచ్ఛాయల కలుషితమైనదీ
ధామం.
శ్రీహర్షాశోకులేలిన నేల నేడు శోకంతప్ప హర్షంలేదు
బీటలువారిన చేల పెదవులపై కరుణాస్మిత వర్షంలేదు.

కరుణలేని నరుల హృదయవేదికలపై కరువు తాండవమాడుతోంది,
రాబందుల రెక్కల సడి నిండిన ఎండినగాలి వింత వంత
పాడుతోంది,

నీరుధిరం స్రావిన మొరకు నేలపైన
హింసా ప్రతిహింసల పిశాచాలు దరిద్ర రుధిరంలో వసంత
మాడుతున్నవి.

నరహంతల, దురంతాల, పంతాల జ్వాలలలో
పచ్చని పసి కారు పైరులు మాడుతున్నవి.
మానవ సహజ వివేకపు చావును మించి చావు లేదు,
పిశాచాల వసంతానికి, నరపశువుల మనసులమించి తావులేదు.
ప్రేమకన్న ప్రబలమైనదా ద్వేషం,
ప్రజ్ఞకన్న ప్రబలమైనదా రోషం,
స్వప్రజనే భుజియించే కాళవ్యాళాలకన్న మానవుని ఘనత ఏమిటి ?
సాటివారిని వేటాడే అకరుణ వనమృగాల్లాంటి జనత ఏమిటి ?
సౌహార్ద, స్వాతంత్ర్యాల సౌధాలకు, మానవమేధను మించిన
పునాది ఏమిటుంది ?

త్యాగ ప్రేమల విజయ స్తంభాలకు, బాపూ సమాధిని మించిన
పునాది ఏమిటుంది ?

ఏమైనది వారాణసి ? ఏమైనది మక్కా ? ఏమైనది ఎరుషలేము ?
మహాబోధి నీడఏది ? చివురులు నెత్తురువాసన ? పండ్లలో
అక్కసు వేము ?

ధూపదీప నైవేద్యాల్లో మనుజ హృదయపు విషవాసన ?
దైవాల శూన్యావాసాల నేడు దైత్యుల హింసోపాసన !
ఆత్మత్యాగయాగంలో రుధిరారక్త వేదికపై నిలచిన మేము
క్రతువును ముగియించే పూర్ణాహుతి కొరకన్నీ సంసిద్ధం చేసినాము.
ఎక్కడనీవు, ఓ మహాత్మా ! అమృత మంత్రాలతోటి
మేము నిన్ను ఆవాహన చేస్తున్నాము.

అవతరించు ఓ మహాత్మా ! ఒడలెల్లా కన్నులుగా
నీ కొరకెదురు చూస్తున్నాము.

# వందేమాతరమ్-1

కోట్లకొలది కుచేలసంతతికోసం, ప్రాణస్తన్యంలేక రుధిరంక్రక్కి-
వారి యోగక్షేమంకోసం ముప్పదిమూడు కోట్ల దైవత
కోటికిని మ్రొక్కి-
చింతచేత సురిగి, సుక్కి-, బక్క-చిక్కి-, శల్యావశిష్టమాత్ర మాతృదేవి
అయినా వీడదు ఈవి,
వందే మాతరమ్ !

తన అనర్ఘమకుట జటిత మహామణుల లోకాన విభాంకురాలుకాగ చల్లి
కుసుమ మసృణ కౌశేయాల విదేశ సుషమా రమల మెరుగుల
మరిపించి తల్లి
గోనె చింకిపాతలలో, మెయి మేలిమి మెరుపుదాగక సిగ్గిలుతోంది నేడు,
అయినా తలపదు కీడు,
వందే మాతరమ్ !

శిల్పకలిత స్ఫటిక మందిరాలవీడి కటికనేల రాలపైన విశ్రమిల్లి
క్రూర శిశిర నిశీథాన శిశువులకై, తన హృదయపు మృదులోష్ణత
పంచి తల్లి
నెత్తురనే స్నేహంతో, వత్తులిడిన కన్నులతో దీపంలా వేచిఉంది,
ఉషసు కొరకు కాచుకొంది,
వందే మాతరమ్ !

ఆకుల, పూరేకులలో, తల్లియూర్పు నెత్తావులు, పండ్లలోన
మనసు తీపి,
తల్లినవ్వు పున్నమి వెన్నెలల పువ్వు; తల్లిదిగులు అమవస
చీకటుల తోపు,
జనని కరుణ కార్మొయిళుల కాటుకపొగ చిమ్మి మిన్ను మన్ను
క్రమ్మి తెరలి తరలు,
శిశు మయూరములు కెరలు,
వందే మాతరమ్ !

శిశు ధమనుల జనని రుధిరం, నేలపైన చిందిన ఒక్కొక ఎఱ్ఱని
నెత్తురుబొట్టు
తల్లిగుండె కండలోది; శిశువులపై సమ స్నేహదృష్టి తల్లి
ఆయుష్పపట్టు.
భ్రాతృ కలహాక్షత విక్షతి, మాతృగర్భ వహ్నికాని, పిల్లల దేమీపోదు
తల్లి ఇదేమనుకోదు,
వందే మాతరమ్ !

జనని ! నీవెరుగవుకాని నీపామర సుతకోటికి నీవనగా ఎంతప్రేమ ?
వారిది నీకాళ్ళను కడిగే కన్నీటికడలి, సింహాసనమే హృదయసీమ!
నీ కనుసన్నల జననీ ! ఈపుడమిని తడుపగలదు విద్రోహుల
రుధిరధార !
చౌడులలో బ్రతుకు పార !
వందే మాతరమ్ !

# వాగ్దత్త వసుంధర

ఏలినవారి ఎముకల ఎరువువేసి,
తాతలనాటి పాత బూతుల, క్రుళ్ళిన సంఘనీతుల చెత్తతోలి,
నెత్తుటి చెమట వాకలుపార, సాగుచేసిన బీడు నేడు
పండుతున్నది బంగరుపంట, పండుగక్రాంతి కర్షకులింట.
జీవన కుసుమాన్నింక చింతాక్రిములు తొలచలేవు
భావనలో సంశయ భయదాకృతులు కలచలేవు.
రేపన్నది బూచికాదు; అనురాగార్హ్మమైన అతిథి.
మాపన్నది పాచికాదు, మాగిన స్మృతుల మధురతిథి·
నేడన్నది చల్లనిపాట, పిల్లలఆట.
కోటిపూవుల కోటితావుల కులికే తోట,
          నేడన్నది వెలుగుబాట.
మనిషికి మనిషికి మధ్య సంఘర్షం ఉండదింక సహజీవన పావన
                                        హర్షం తప్ప,
మనిషికి మనిషికి మధ్య అమర్షం ఉండదింక సహజ సులభ
                                        స్నేహాకర్షణ తప్ప
మనిషికి మనిషికి మధ్య గోడలుండవు గోతులుండవు;
          అదృష్టం గీచిన గీతలుండవు.
విప్లవపు బుల్‌డోజర్‌తో మిట్టపల్లాలేకంచేసి మకిలిగుంటలు
                                        పూడ్చేశాం,
బండరాతి గుండెలు బ్రద్దలుకొట్టి అద్దాల్లాంటి రోడ్లేశాం,
గాలిలాగు, నీరులాగు,నేలనుకూడ అందరికి చెందజేశాం,
అందాన్నీ, ఆనందాన్నీ, అందరికీ అందజేశాం,
ఆకలినీ, చీకటినీ, అకాలమరణాన్నీ రద్దుజేశాం,
ఉదయసూర్యుని ఉద్యోగాన్ని ఖాయపరచాం.
ఆకాశాన్ని అటకనుజేసి, ఆనందపు నిచ్చెన లేశాం,
          సంద్రాలను స్నానాలతొట్లు చేశాం.
ఊహను వాస్తవంజేసి, వాస్తవాన్ని సుందర స్వప్నంచేసి,

మేధకూ క్రియకూ మధ్య, ఆశయానికీ సంశయానికీ మధ్య
సాధనకూ సాధ్యానికీ మధ్య పడిన నీడలు తుడిచివేశాం,
గురివిందకు నలుపుండదు, దీపంక్రింద ఉండదు క్రీనీడ ఇంక,
మనిషికి మనసులో మమతా సస్యానికి పట్టదులే చీడ ఇంక
నిలువతప్ప బాకీ చూపించదింక బ్రతుకుపద్దు,
కచ్చలు, మచ్చరాలు, విచ్చుకత్తులు, అచ్చుతప్పులు అన్నీరద్దు,
రద్దు, రద్దు, ముద్దుల సామ్రాజ్యానికి సరిహద్దులన్నీ రద్దు
మారుమూల ఆకలిగొందుల చీకటి దుకాణాలు,
స్త్రీ శీలం, పురుషుని పరువు, పసిపాపల ప్రాణాలు
అమ్మే అంగడులన్ని మూసేశాం, దివాళాబోర్డులు వేలదీశాం.
సిరికి విరుగుడు కనిపెట్టాం.
భీషణ శోషణ యంత్రపు పండ్లచక్రాలు ముండ్లకంచెలు,
బ్యాంకులు, షేర్ మార్కెట్లు; అంకెల గారడీతో పేదవాని
కడుపుకొట్టే లంకాసురుల రహస్య సొరంగాలు,
మాయాసింహాసనాలు, అన్నీ కూలద్రోశాం, నేలపాలుజేశాం.
దౌర్భాగ్యపు నాగరికతల నిశా శ్మశానాల్లో తోడేళ్ళు, గుంటనకఱలు
తిరగవింక; రాబందులు ఎగురవింక.

చిల్లర బేరాల, నల్లులకూ, దోమలకూ, జలగలకూ స్వస్తి,
ఋణాలకూ, ధనాలకూ, వడ్డీల, చక్రవడ్డీలకూ స్వస్తి,
కరుగబోసిన ఆయుధాలు, పలుగులు పారలయ్యాయి,
టేంకులు ట్రాక్టర్లయ్యాయి.

విజ్ఞానపు, జ్ఞానపుచెర విరగడచేసి, యుద్ధానికి బుద్ధిచెప్పాం.
మానవజాతి ఒకేప్రాణం, ఒకేగానం, ఒకేధ్యానం
మానవులంతా సమానం.

న్యాయంతూచే తరాజుతప్ప వేరే రాజు లేడు.
యథాశక్తి శ్రమ చేస్తాం, యథాభుక్తి అనుభవిస్తాం.
వృధాకాదు చేసిన శ్రమ, ఈనగాచి నక్కలపాలు చేయమింక;
ఒక్కొక్కడు అందరి కొరకు
అందరు ఒక్కొక్కని కొరకు
చెలిమిలోనే జనుల కలిమి!

పన్నులు నరుల ఎముకలు కొరికేందుకుకాదు ;
తినటానికి మాత్రం పనికొస్తాయి,
రెండునాల్కల అధికారపు కోరలు పెరికివేశాం
చిల్లర దేవుళ్ళనూ, చిన్న చిన్న హిట్లరనూ తరిమివేశాం,
పరహింసా పాపపంకిల ప్రపంచ చరిత్రలోన
ప్రప్రథమంగా అసలు ప్రభుత ఉండదు.
బానిసల నెత్తుట దోగి విరియబూచిన విభుత ఉండదు.
మునులుమోసే ఆసనమెక్కి శాసించదు తెగబలిసిన ఋగ్రమదం
బక్కచిక్కిన డొక్కలను వెక్కిరించదు బకాసురుని బొగ్రమదం
సైరంధ్రి జోలికిరాడు పీచమడగిన కీచకుడు
తెద్దు రాజదండంగా శాసిస్తాడు పాచకుడు.
చారిత్రిక రాత్రిలోన కలలుగన్న కాంచనయుగం ఉదయిస్తోంది.
గాయపడిన పేదభటుని విజయలక్ష్మి వరిస్తోంది.
తరతరాల తామసయాత్ర కడప్రాణం కొడిగట్టగ
అడుగడుగున రాలిపడే నెత్తుటి చెమట లొడిగట్టగ
చిరదినాల ఇరులపొరల నిరాశలకు మరణశాసనం లిఖించి
నేడుగదా మానవుడు చేరుకొన్నాడు కోరుకొన్న విడుమరను
ద్రష్టలు, యుగస్రష్టలు సూచించిన వాగ్దత్త వసుంధరను.

# వందేమాతరమ్-2

కీర్తిస్తున్నాను నేను ఈవిశాల భూఖండాన్ని
అనాదికాలంనుంచి అక్షయమై నిలచిన అన్నపూర్ణ భాండాన్ని.
కీర్తిస్తున్నాను నేను సుజల సుఫల సస్యశ్యామలమైన
మాతృభూమిని,
వీర రుధిర ధారలదోగి ఉర్వరమైన వీరప్రసవ పితృభూమిని.
కీర్తిస్తున్నాను నేను అరుణ తారక తిలకాంచిత హిమగిరి శిఖరాన్ని
జనజీవన వాహినిగా ప్రవహించే పావనగంగాఝరాన్ని.
కీర్తిస్తున్నాను నేను ఈమంటిని పుట్టి పెరిగే మహాజనులను,
అకించనులను, క్షుధాఖనులను, గౌరవ గాథాధనులను.
కీర్తిస్తున్నాను నేను నల్లని హిమగిరులవంటి వారల దేహాలను,
దేహ సానువుల స్రవించి చెంగలించే శ్రమ వారి ప్రవాహాలను.
కీర్తిస్తున్నాను నేను కూలీలను, రైతులను, పేద పాటకపు జనాన్ని,
కీర్తిస్తున్నాను వారు సృజియించిన సౌభాగ్యపు నందనాన్ని,
కీర్తిస్తున్నాను నేను విదురునిలా, విలయంకర విశ్వరూప దర్శనాన్ని
కోటి తలల కోటి నాల్కల కోటిచేతుల శ్రీమన్మహాజనాన్ని.
కీర్తిస్తున్నాను ఎముకల పంజరాలను, బక్కచిక్కిన డొక్కలనూ
బ్రతుకు వేసగి వడపొడలో, వసివాడిన, కడువడలిన చెక్కులనూ.
ఒక్కొక్కడు ఒక గాంధీ, ఒక్కొక్కడు ఒకక్రీస్తు, ఒకొక్కడు
ఒక బుద్ధుడు.
అవహేళనగా చూడకు, వారిలోన ఒక్కొక్కడు ఒక సిద్ధుడు.
కీర్తిస్తున్నాను నేను తల్లివంటి ఈనేలను, ఈనేల పాలికాపును,
వారే మన ఖామందులు, అర్థిస్తున్నాను నేను వారి ప్రాపును.
కవిని కాని, శ్రీనాథుడ కాను నేను, కస్తూరిని కోరబోను.
వీరుల నెత్తుట తడిసిన మన్నుచాలు, కన్నులకద్దుకొని స్వీకరిస్తాను,
కీర్తిస్తున్నాను నేను ఆర్తులనూ, అనదలనూ, దీనులనూ, హీనులనూ
దిక్కులేని వాక్కులేని జీవాలను, బ్రతికిచెడిన చెడిబ్రతికిన ప్రాణులనూ
ఎప్పటికైనా తప్పదు, వారల చెర విరగడగా, క్రొత్తపొద్దు పొడుస్తుంది

భవితవ్యపు విజయరథం వారి గూళ్ళ ముంగిటనే విడుస్తుంది.
కీర్తిస్తున్నాను నేను చివికిన రేయి హద్దులు రద్దుజేసే క్రొత్త
పొద్దు రాకను,
మబ్బుల పొత్తిళ్ళ వెలయు రక్తారుణపిండాన్ని, నెత్తుటి వెలుగువాకను.
కీర్తిస్తున్నాను నేను మృత్యువు కంచుకోటపై కెగిరిన
ప్రజ్వలదరుణపతాకను.
వీరుల అసువుల విసరుల రెపరెపలాడే జనవిజయ ప్రతీకను,
కాని నేడు ఈభూమిని కీర్తి లేదు, ఆర్తి తప్ప మారిపోయినది కాలం
ఈ ధాత్రిని ఏలుతోంది భ్రాతృ హంతకుల కరాల కరవాలం,
జనజీవన యజన వాటికలపై బడు రాక్షస రక్తచ్ఛాయలు,
కూటికి గతిలేని పాటకపుజనాన్ని దోచే ధూర్తులమాయలు
అన్నపూర్ణ అక్షయభాండంలోనే తండులాలు నిండుకొన్నవి.
రాజని పేదల పొయ్యిల కుక్కలు పిల్లులు హాయిగ పండుకొన్నవి.
పొయ్యిలోన రాజని చిచ్చు కోట్లకొలది కడుపుల్లో రగులుతోంది,
సర్వం స్వాహా చేసే ప్రజా ప్రళయ క్రోధజ్వాల పొగలుతోంది.
కూలీలకు కూలి లేదు, రైతుల కెరువుల్లేవు, తిండికి గింజల్లేవు,
ఎండిన పొలాల గుండెలు బద్దలుగా, కరువు కొరివికి లేదు చావు.
కరువు, కరువు, ఒకే కరువు, గుండె చెరువు, బ్రతుకు బరువు,
వాషింగ్టన్ వీథుల్లో అమ్ముడుపోతుంది నేడు నాడు పరువు.
ఋణమే ధనమైనది, ఋణమే జీవనమైనది, ఋణములేక బ్రతకలేము
అద్దెకొంపగా మారిన దేశంలో ప్రతినిత్యా అడుక్కుతింటున్నాము.
పరదేశపు ఎంగిలికై వెదకుతోంది నేడీ బంగరునాడు.
సుజల, సుఫల, సస్యశ్యామల కాదు నేడీ నాడు, పాడుబీడు, వల్లకాడు.
ఇంట రట్టు, బయట బెట్టు, దేశం గతి నానాటికి తీసికట్టు.
ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోత అన్నట్టు
ఈ పురాణ పుణ్యభూమిలోన నేడు దేవుడైన లంచానికి తలవంచక తప్పలేదు
అందరు తోడుదొంగలైతే, దొంగే దొరయైనా ముప్పులేదు.
తలలులేని ఖద్దరు టోపీల ఏలుబడిలో పేదప్రజకు టోపీలే
అంతా గాంధీ శిష్యులే, పానకాలరాయుళ్ళే, పీపాలే.

డబ్బు రాజ్యమేలుతోంది, డబ్బులేని వాడిచ్చట దుబ్బుకు కొరగాడు
డబ్బు పెద్ద జబ్బయింది, డబ్బుమొసలిచేత జిక్కినది సంఘం ఈనాడు.
పల్లకి ఎక్కింది డబ్బు, వేదికపై కోకొల్లలుగా కల్లలు పలుకుతోంది,
తెల్లని పొందూరు జరీ ఖద్దరుకట్టి, నడివీథిని కులుకుతోంది.
క్రుళ్ళిపోయినది సంఘం, క్రుళ్ళిపోయినవి ప్రభువుల మనసులు ఈనాడు
శస్త్రక్రియకు సిద్ధంగా ఉన్న రోగి ముక్తిదాత కొరకు వేచియున్నాడు.
సంఘం వెన్నున పెరిగిన రాచపుండు, ఏ శస్త్రం దీనిని ఛేదిస్తుంది ?
మదపుకనుల పెరిగిన శుక్లపు పొర ఏ మెరుపు కత్తి ఛేదిస్తుంది ?
రానున్నది పెనుతుపాను, చూడు అదే కుటిలదిశా భ్రూభంగం!
ముండమాలిని, ఉద్దండ చండికా తాండవానికి సిద్ధం సంగర రంగం,
సమిధలు సిద్ధంగా ఉన్నాయి, హోత్రం రగిలించడమే తరువాయి
ఈ మహాగ్ని యజ్ఞంలో వెయ్యండోయ్ తలొక చేయి !
చెడి క్రుళ్ళిన పాతరోత లోకం ఇది, కానున్నది భస్మరాశి!
దురితాలు, దురాగతాలు మాసిపోయి తీరుతుంది ప్రజల గాసి,
కూలి రాలిపోతుందోయ్ పేదల ఎముకలు కట్టిన సౌధమాల,
ధనదేవత స్వర్ణమందిరాల మ్రింగి నింగినంటి పొంగుతుంది మహాజ్వాల
గోడమీది రాత నేను చదువగలను, చేతులు చూడకుండా
జాతకాలు చెప్పగలను,
కాలం వేసిన శాస్త్రం తడబడి పొరబడకుండా గడగడమని విప్పగలను.
తెల్ల గుర్రముల రౌతులు రాబోతున్నారని గాలికబురు నాకు తెలుసు
న్యాయ ఖడ్గముల మెరుపుల తళతళతో విచ్చుతుంది పాప తమసు.
రుధిరంతో కడుగబడుతవి యుగయుగాల కళంకాలు, పాతకాలు.
చిత్రగుప్తుడు తెరచిన చిట్టాలో మన ప్రభువుల జాతకాలు
పెనుతుపాను హోరులోన పేకముక్కలై కూలే రాజ్యాలు
విలయజ్వాలాకీలల సంఘం, చట్టం, శాస్త్రం, ఆజ్యాలు
రానున్నది పెనుతుపాను, క్రమ్ముతున్నది కరాళ కాళరాత్రి.
కాళరాత్రి కవల నుంది క్రొత్త ప్రొద్దు, వేచియుంది భూతధాత్రి.
ఈ తుపాను కడచి రేవు చేరుతుంది జన జీవనమనే ఓడ,
ఈ ఎడారి దారి కడచి జీవన నందన వనాల పసిడివాడ.
"వందే మాతరం" మంత్రం నాదే ఒక సార్థకతను కాంచగలదు.
"మనదే రాజ్యం" అని సకల ప్రజాకోటి ధైర్యం వహించగలదు.

# పెంచినతల్లి

కన్నతల్లి కన్నను పెంచినతల్లి ఋణమెక్కువ,
ఏమంటే అందు కన్నతల్లికుండే నెత్తురబంధం లేదు.
సహజ రహస్స్నేహం తప్ప మరొక ఆనందం లేదు.
మాతృ మమతా నిహిత స్వార్థ ద్వంద్వం లేదు.
వెలుగులాగు, గాలిలాగు, నీరులాగు అదే గదా ప్రేమంటే.
తమిళ తల్లీ ! నీకు నేను ప్రేమతో, గౌరవంతో వందనం చేస్తున్నాను,
నీ స్తన్యం త్రాగాన్నేను, నీ ఉప్పు తిన్నా న్నేను,
నీ స్నేహం జ్వలిస్తోంది నా మనసున,
నీ నెత్తుర ప్రవహిస్తోంది నా తనువున
నేను నా ధమనులు చీల్చి చూపిస్తాను:
నరాల్లోని నెత్తురు మెదడున ప్రవహిస్తుంది,
హృదయంలోని శోకం భావనలో దహిస్తుంది,
జీవిత శ్వేతపత్రంపైన సమర శంఖ నినాదాలు, నేను కాదు,
నా రుధిరం లిఖిస్తున్నది.
ఒరులు గురుతు పట్టలేదు, నిన్ను కాని, నేను సదా గురుతించాను
గురుతించి, విరుతించాను.
కుళ్ళు కాలువ ప్రక్కనున్న పాకల్లోన, జ్యేష్ఠాదేవి తాండవంలో
మేడలముందునున్న, సిమెంట్ చప్టాలపైన, గోనెలతో, కుండలతో,
పట్టపగలు ముసురుకొనే చీకటిలో, మాటిమాటికి ప్రజ్వరిల్లే ఖాండవంలో
బక్కచిక్కిన డొక్కల్లోన, నల్లని మొగాల్లోన వాడి
వరడై కరడైన దేహాల్లోన
చింకిపాతల్లో దాగని, ఆగని నీ సౌందర్యపు నల్లని మెరపు తిలకించాను,
గాజు పూసల నగల విరళ రవళిలోన
వాణీ చరణమణి నూపుర శింజాణ నిక్వాణాలాలించాను.
తల్లివాసం తనయుల హృదయాల్లోన, తల్లి చలువలు తనయుల సదనాల్లోన,
పిల్లని మొదటి ఏడుపునుండి, చల్లబడే దేహంలో కడపటి గురకవరకు
గర్భనాళం చిందిన రుధిరకణంనుంచి,

ప్రళయ నిశా శ్మశానభస్మంగా మారిన నెత్తుటి మరక వరకు
పసి పెదవుల చివురుల తేనియవంటి పుణ్య స్తన్యం ప్రవహిస్తూనే
వుంటుంది.
పెద్దలైన పిల్లల ఆగడాలూ, జగడాలూ, తల్లి అలా సహిస్తూనే ఉంటుంది.
అవును, జననీ! నీ సుతకోటి సృష్టించిన
అపూర్వ శిల్ప కళా నిలయాలూ, సుందర మందిరాలూ ఏమైనాయి?
నీవీ పాడుపడిన పాకల్లో ఎందుకు ఉంటున్నావు?
ఏమి సుఖం కంటున్నావు?
చలువరాతి తిన్నెలు వదలి, రోడ్డుప్రక్క సిమెంటు చప్టాపై
ఏమున్నది నీకు హాయి?
భీకర హాహాకారపు కేకలలో ఏ చక్కని 'తిరుక్కురళ్' వింటున్నావు?
చేర, చోళ, పాండ్యుల కత్తుల నెత్తురులో ఎర్రబడిన కావేరీ, వేగవతీ,
తామ్రపర్ణుల కలకలాలు
బాణాల్లా దూసుకుపోయే ఓడల వేగంతో
పాయలుగా చీలిన సింహళ మళయ సుమాత్రల సాగర జలాలు.
ఏ వ్యతీత గౌరవ ఘోష, బౌద్ధ, జైన, హైందవ శ్రమణవరుల
శ్రవణ మధుర ధూప దీప పరిమళ సలలిత భాష,
ఏమిటి వింటున్నావు తల్లీ! నీవు ఏమి కలలు కంటున్నావు?
'తమిష గమ్మెంగు మిరుక్కు' మేనండ్రాళ్; కన్యాకుమారి నుంచి
కైలాస శైలం వరకు
నీలగిరి నీలిమనుంచి, నీలకంఠుడు నివసించే హైమగిరి ధవళిమ వరకు
ఆఫ్రికాలో, ఆసియాలో, కొండల్లో, కోనల్లో, ఎండల్లో, వానల్లో
'తమిష గమ్మెంగు మ్మిరుక్కు మేనండ్రాళ్' నలుపులో నాణెం ఉంది
నల్లని దేహాల్లోన సూర్యుడు నివసిస్తాడు.
నల్లని దేహాల్లోని ఎర్రని నెత్తురులోన సూర్యుడు హసిస్తాడు.
పడమట బయలుదేరిన రాహువులను, కేతువులను గ్రసిస్తాడు.
సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు.
నల్లని మన్నులోన పచ్చని కాననాలు, వర్ణ వర్ణ కవితా కలిత కుసుమాలు
అసిత తటిల్లతలవంటి ఆననాలు,
హృదయాల్లో, రుధిరంలో, కోటి కోటి సూర్యప్రభా ప్రసవాలు.
నల్లని దేహాల నెత్తురుతో తడిసిన మన్ను
రుధిర బీజ వీరగంధం వాసిస్తుంది.
తరుణారుణ కాంతులతో ప్రాచీదిశ భాసిస్తుంది.

# శ్రావణలక్ష్మి

హరిత కౌశేయాంచలా భాసమాత్రాన, ఆశాంతములు నవాశ్వాస మొంద
కాల వారిద శతాంగాగమ నిర్ఘోష, భీష్మతన్ దిక్కులు పిక్కటిల్ల
అశ్రాంత శీతా నిలాశ్వ హేషలు నిద్రితాలయ ద్వారాలు తట్టి పిలువ
స్వస్తి మంత్రోచ్చార వ్యస్త భేకాల ఖాంకృతులు ఝిల్లికల
ఝంకృతుల కలయ
ఝటితి, జలదాలక వినీల పటము దొలగి, దుర్నిరీక్ష్య
వైద్యుత ముఖద్యుతులు తొలుక
మృత జగచ్ఛ్రీవో యుగళి నమృత రహస్య.
శ్రవణార్థమ్ము విచ్చేసె శ్రావణరమ.
ఊషరోష్మక హింస్ర భీషణ దంష్ట్రలన్ జిక్కిన నరుడెంతొ కక్కటిల్లె
ఆఖండాలాభీకృతాఖండ చండాత, పోద్దండ దండన లుక్కడంచె
దుర్దాంత నైర్జల్య దుర్దశా నిర్దళి, తాభీష్టయై ధాత్రి తల్లడిల్లె.
విషయ కాల వ్యాళ విష దష్ట హృదయాలు,
పేరిమి సెడి కడు బీటవారె
నేల పెనమట్లు భగ్గున కాలిపోయె. నేటి ఈ కరుణా సుధా నీర పూర
మిట్లు హోరని వర్షించి గట్లు త్రెంచి, పొంగి పొరలక
బ్రతుకు నెబ్బంగి నరుడు?
నీలాలోకము, నింగి నిండె దెసలన్, నీరంధ్ర జీమూత గో
పాల ఛ్ఛాయలు బర్వె, పీత చపలా పట్టాంచలమ్మాడ, వ
త్సాలంబి ద్యుధనుస్సృజమ్ము వరలన్, క్షౌమా కులా బాల గో
పాల ప్రేక్షణ కేకి బృంద మరలన్, ప్రాణ స్వన ధ్వంశి తోన్.
కంపిత శంపావల్లులు, చంపక రుచి వెల్లి గొల్ప, చల్లని జల్లుల్
సొంపలరింపుచు తామర, తంపరలై జీవకోటి తాపము బాపెన్.
చూడ్కితోడ నుసురు, జూరాడు వేసంగి, చుప్పనాతి కనుల
జుల్కజేసి
ఇరుల చీర చెరగు మరుగున నరులంద రరసినారలలతి యాత్మశాంతి.
దారుణ దాహ దగ్ధ వసుధాధర మల్లన పల్లవింప వి

స్ఫార కృపాంబుధారలు, దివా నిశమున్ గగనాంబుకాల జా
ల్వారును గాదె నేడు, చెలు వారెను ధారుణి శ్యామలాంగియై
హారి హరిన్మణి ప్రథిత హారము దాలిచి పెండ్లికూతురై.
సజల గగనమ్ము స్నేహార్ద్రిత సరస హృదుత,
నొరిగె పరవశ భూ హృదయోచ్చ గిరుల
విశ్వ సంగమా వంధ్యత వెల్లడింప,
శ్రీకరములై కురిసె శ్రమ సీకరములు.

మరలె నింటికి పాంథుడు తరుణి జేర
నదులు పరుగిడె తమకాన నుదధి జేర
సూర కర శోషిత విధుర నీర ఝురులు
కురిసి తనిసెను, జననిని, ధరను దరసి.

కాల్వలు నిండిపారె, కసుగాయలు కేరుచు చెంగలింపగన్
చిల్వలు పల్వలౌచు, దరిజేరని భంగురకేళి నౌకలన్
నిల్వగనీక ధ్వంస జడ నీరధికిన్ గొనిపోవుచున్ ధరన్
చల్వలు జల్లి, యుల్వరిలు చౌడుల నాడుల నల్ల పారెనాన్!
మసకచీకటిలోన మణగెడు దెసలెల్ల, పవలు రేలును
నొక్క పగిది దోచు,
ఉభయసంధ్యలు నుండు నొకరీతి కనలేము కర్మసాక్షిని కలికానికైన.
నీరవ నిస్తబ్ధ నీర మగ్న పథాల, పరిచిత జనులు కన్పట్ట రసలు
ప్రియ వియోగ వ్యథన్ ప్రిదిలిన హృది వోలె, జగతి నిరానంద
జడిమ జూ(పు.
నిజగృహమ్ము లేక, నిలువ నీడలేక చలికి గడ గడ వడకుచు
తలలు దాచు
కొనగ వచ్చిన దౌర్భాగ్య జనులపైన, అశ్రువర్షము కురిపించు
అవనిజములు.
మిడుతల దండు వోలె శివమెత్తిన మబ్బులు, సర్పరాట్టు వే
పడగలు విచ్చి నేల తలపై నెరి పాతరలాడినట్లు, తా
గొడుగయి కాచినట్లు, ధర కోసము భూరి కృపా విశాలు క్రాం
జడులను గ్రుమ్మరించునని శ్రావణ హస్తమభీతి నిచ్చెడున్.

అవని నొదవిన నైదాఘ హాలహలము
గళము నందిముడ వినీల కాంతి గలిగె
ఫాలనేత్ర విద్యుచ్ఛటల్ ప్రజ్వరిల్లె
జటల సుర సరిగల శైవ శ్రావణము.

# దీపదూత

నలు గెలంకుల నిబిడాంధ నైశ జలధి
కుటిల తామసోర్మ్ముల చలచ్చటుల నటన
దీప మొక్కఁడు ద్వీపమై దీప్తి విరియు
తరణ భీతుల శరణమ్ము తరణి కరణి.
కిరణ తంతువు లాశల కరము లూచు
శ్రాంత దేహికి యాత్రాంత శాంతి జూపి
ధ్వాంత సైంధవ కృద్ధ దిగ్భ్రాంతి మధ్య
నిశ్చలాభల నల్లిన నీడ మొకడు.

తామస భీమారామ శ్యామచ్ఛవి ధూమ భూజ శాఖాగ్రముపై
కోమల జ్యోతిః కుసుమము, కామారి దృశా స్ఫులింగ కల్పమ్ములనేన్ -
క్రాక్కలోత్తాళ తరంగ మాలికలు కంఖాణమ్ములై పారు, నా
భీల వ్యాళము వోలె బుస్సుమను, నుత్ఫేనమ్ములం గ్రక్కు, శై
వాలాలోల భుజాలతల్ బెనచి, నిర్బంధించు, నిశ్శోక డో
లా లీలన్ రహి నొంద రమ్మను, వినీలా భార్ద్రి లోకమ్ములోన్.
ఎక్కఁడి దీ ప్రశాంతి చలియింపని కాంతికి జన్మ మృత్యువు లే
దృక్కుల మేర నాడ, ధృవదీధితులన్, స్మిత భాసితాస్యయై
జొక్కు దనంత దానెదల జూడ్కుల కందని సత్య మెద్దియో
దక్కిన యట్లు, ధ్వాంత దురితాహతులన్ గని వెక్కిరించు నాన్.

అభ్ర సంగ విరహితాద్రి శృంగమెక్కి
బ్రతుకు దరుల దోయి బారజూచు
మూఢ మూర్ఛితాంధ గాఢ భవ నిశీథ
ప్రహరి వోలె జాగ్రదహపు దూత.

జాగరితము సుప్తి సంస్థిత స్వప్నమ్ము, శైల హృదిని
సుఖదశమన ఝరిణి
విలయ హిమమునందు బీజరూపక సృష్టి, జాగరితము
తమిని జ్వలిత రోచి.

# చిరనిద్ర

వీణ రేపిన మూర్ఛనల్ విలయమందె
నిస్తరంగము నీహార నీల జలధి
అహసు ముగిసెను, ఆశ్వాస మంత మీవు
చరమశయ్యకు దార్చితి మరణరమను.
ఋణము తీరిన నరిగితి ఋజుపథాన
నీ పథము నీది నేనెట్లు పాప మందు
భిన్న రుచులకు పొడము విభిన్న పథము
లెల్ల బాటలు కడ కొకే ఎల్ల జేర్చు.
మానవోచిత మానావమానములకు
దూరమైతివి నిన్నింక దూర నేల ?
మానవహృదయ స్నేహాల గానలహరి
చేర నేరని తీరాల చేరి తీవు.

నిద్రా నీల నభోంగణాన విచలన్నిస్తంద్ర తేజో నటు
న్మంద్రాలంకృత దిగ్దిగంచలములై మూర్తీభవ న్మోద సం
పద్రాజద్బహు వర్ణ ఘూర్ణితములై, పక్షానిలా వేగ జా
గ్రద్రాగారుణ హృద్రహః పథములై కన్పట్టు స్వప్నావళుల్.
మృత్యు ప్రేక్షణ నిష్ఠురాంధ భయముల్ మృత్పాత్ర వద్గాత్ర సం
భృత్యేషావశ బుద్ధి కల్పితములే, భృంగమ్ము రిక్త ప్రసూ
న త్యాగమ్మున్న కోడి కుందినటులే నష్టా సుమాధ్వీకమున్
సత్యమ్మంచు హృదగ్రపీఠమున సంస్థాపింతు రంధాత్మకుల్.
శాంత మపరిచితానంత శరధి తలము, స్వాప తూలముల నరాలు నీపథాన
చిమ్మచీకటి, వీడు మీ చిల్లి పడవ, ఈది చనవచ్చు హాయిగ నిచ్చదీర.
ప్రాతర్గమ్య విహీనము, వాతానీతాప్త గంధ వైణిక గీతా
జ్ఞాత స్రోతము, శీత భవాతపమీ, నైశ యాత్ర వాంఛితమిడుతన్.

# చెరలో షాజహాను

నాడు నా ఎదనలమిన నడిమి రేయి
మొరకు నిముసము తొడివిన ముదురు చివురు
సాంద్ర తమసము కన్న ఆ స్ఫటిక శిశువు
ప్రేమ పాషాణి పవళించు ప్రేతభూమి.
శిలల చెర జిక్కి పొగులు వెన్నెలల కలలు
రవల జిలుగుల వెలిగెడి రజత శవము
దగ్ధ మోహ పాశపు వక్ర దర్ప భూతి,
రాజసాహంకృతి పతాక తాజమహలు.

శిల్పీ భూత తమిస్ర శోకమది, రాశీ భూత రాకా కళా
కల్పమ్మై కనువిందు గొల్పెడిని, నిష్కంపాచ్ఛ శంపాచ్ఛవిన్
కల్పాంతావధి కల్పనా కలనయై, కారాగృహాంధ్యస్థు నీ
యల్ప ప్రాణిని గేలి సల్పెడిని, దీవ్య న్నిర్ఘృణాశ్మ స్మితిన్.
విగత స్నేహ మమేఘ మానస తటిన్, వీచీ విలో లాహిలా
స్వగతానందము చిందులాడదు, రహస్సల్లాప లీలన్ జల
స్వగతాలాపము వీను లానదు, వితృష్ణావాలుకా శ్రేణికల్
నిగళాబద్ధ పురా సమృద్ధ లహరీ నిస్తబ్ధ కంకాళముల్.
నిద్రా మంత్ర విమూఢ విశ్వహృదిలో, నిర్ణిద్ర గూఢ వ్యథా
గ్న్యద్రి క్షోభము, జీవిత జ్వర చిరా శ్రాంతః ప్రలాప స్వన
మ్ముద్రే కావిల భావనా పటిని, నృత్యోన్మత్త రేఖా కృతుల్
రుద్రస్థాన చరన్నిశాచరములై రోదించు దుశ్చింతనల్.

విపుల విశ్వము, ఒక మహా వికటకార, అందు ఔరంగజేబు
మహాలును నాదు,
చీకటి చెరయు రెండును చిన్ని గదులు, కైదు చేసిన దెవ్వడు,
కైది ఎవడు.
రాల పాలందురు జనులు, రాజధనము, భంగుర స్మృతి
యమృతిని బడయ భవ్య
భవనములు నిల్పినాడను చివరికిటుల, ప్రాణపక్షుల పాలిటి
పంజరముగ.

# అపూర్ణకవిత-1

శతఘ్నులు గర్జించాయి.
ధూళీ ధూసర ధ్వాంతాక్రాంత దిశాంతంలో
కృపణ స్వాంతుల మృత్యు చుంబిత ప్రశాంతంలో
ద్వివిధా తిమిర పటలి పాలిట నిశ్చిత నిశాంతంలా
క్రోధోద్విగ్న శత శతఘ్నులు గర్జించాయి, కృతాంతాగ్నులు
సర్జించాయి.

వినీలవ్యోమంలో విమానాల విజయదామం,
న్యాయదూతల శతాంగాల్లా, స్వేచ్ఛా స్వచ్ఛ విహంగాల్లా,
సత్రోక్రోధాగ్ని సముద్భూత నగ్నావ్యాజ పూత తేజో తరంగాల్లా
విమానాల భీమ స్వానమవిరామం.
ఇరుప్రక్కల దిక్కులెల్ల పిక్కటిల్లి, ఉల్లాలెల్ల తల్లడిల్లి
బ్రహ్మాండం దద్దరిల్లి, బద్దలయ్యీ, యుద్ధం అనిరుద్ధం అని,
సర్వం సన్నద్ధం అని
రౌద్ర మంద్ర భర్జనలో సాంద్ర తంద్రా విసర్జనం.
మర ఫిరంగి స్వర మదిగో, వివరిస్తోంది పూర్వపక్షం
శోణిత శోణ చిర తర్కాన్ని వరిస్తోంది వీరవక్షం
బలిదానం మిత్తవ మంచు మైదానపు టంచుల వరకు
పరువులెత్తి చరుపుతోంది చరణ చిహ్నాలు తనవి తానే.
పర్జన్య పాంచజన్య ప్రతిఘోషిత హృద్రోదసి.
రుధిరం క్రక్కి రోదించాయి బధిర మూక పాషాణాలు.
విశ్వ వియద్వయొలిన్‌పై తుపానుల కమానెగసి
రేపింది నరనరాల్లో అమరవాంఛల గానాలు.
బాహుయుగంలోన నేడు దుర్ధర్షార్ష ప్రేరణ
తొడ చరచి కాలునితో కలియబడే కుతూహలం,
వెన్ను విరచి వెన్నివ్వను పగరు కనే నిర్ధారణ
అప్రతిహత గతి చరిత్ర చక్రోద్ధతి సముచ్ఛలం

నీ చక్షులలోన నేడు జీవిత వేళా దిదృక్ష
నీ వక్షంలోన నేడు అమృత జ్వాలా బుభుక్ష
నీ సమక్షమందు నేడు లాక్షారుణ మృత్యు రూక్ష పక్షచ్ఛవి
తక్షక నిఃశ్వసన విషమ విషపరీక్ష.

ఇది తరుణం బాధా సంఘటనానికి
చరమ తిమిర వైతరణీ తరణానికి
నర భక్షక రాక్షస సంహరణానికి
ఇది తరుణం మరణానికి, అమర మరణ వరణానికి.

# అపూర్ణకవిత-2

ఆమె కన్నులలో అనంతాంబరపు నీలినీడలు
సంజమబ్బుల నెడ నెడ దోచు ఎఱ్ఱని కలల జాడలు — లేవు.
ఆ కన్నులు ఎపుడో ఎండి పాడుబడిన చీకటి బావులు
ఆ హృదిలో త్రోవతప్పిన తెలి తుంపరల తేనె తావులు — రావు.
ఆ నిశా శ్మశానశయ్యకు ప్రాతఃప్రసక్తి లేదు.
ఆ పాంశుల పాషాణికి ముక్తినిచ్చే శక్తి లేదు.
ఆ హృదయ మగాధ పాతాళం,
చీకటిలో గడ్డకట్టిన కాలం.
అట తాండవించును మృత్యు శైత్యమొకటే
శ్రాంత జీవిత వైఫల్యమొకటే.
ఊచల్లాంటి చేతులు, పుల్లల్లాంటి కాళ్ళు
చదువురాని చేవ్రాళ్ళు.
వంకరటింకర గీతలు, అధివాస్తవిక విధి రాసిన రాతలు
శిథిలభవనంలాంటి ఆమె వీపుమీద మాంసశైలశిఖరం ఆది
దున్నపోతు మూపురంలా, సైతాను గోపురంలా
ముద్దకట్టిన కురూపం.
జీవిత క్రూరత్వపు ఘోరాపస్మారక స్మారక స్తూపం
గూనిపిల్ల; సౌందర్య సరోవరపు నత్తగుల్ల.
నిజం కంటే నిజమైన కల్ల.
ఈ దేహంపై మోహం ?
ఈ పిడికెడు ఎముకలప్రోవు ఈ గుప్పెడు మాంసపుముద్ద.
పిడుగుబడిన చెట్టులా పెడపెడగా తోటవద్ద.
కడలి గట్టుకు కొట్టుకొచ్చిన పాతాళపు దైత్య శిశువు
మానవయోని పొందబోయి విఫలమైన పశువు.
ఎపుడే దుర్ముహూర్తాన గ్రహాల దురాగ్రహంలో
రావణుడు రంభను బలిమిమై కూడినపుడో
హిరణ్యాక్షుడు భూమితో బంతులాట ఆడినపుడో

పిశాచాల వసంతోత్సవంలో చీకటి తప్పుల ఫలమై
భీభత్సం భీష్మించిన అందని అందలమై
నేలను వాలిందో తారలు రాలే వేళను.
కుక్కలు నక్కలు అరచే, తీతువు కూసే వేళను.
ఈ దేహంపై మోహం
ఇది పగిలిన పిల్లనగ్రోవి
పాడుబడిన బొమ్మరిల్లు.
చైతన్యపు చిరిగిన చొక్కా.
ఇది అచ్చు లేని హల్లు.
సౌందర్యపు విందులోంచి
ఇది ఎండిన ఎంగిలియాకు :
గోడనుంచి రాలి పడిన
విరిగిన వంకర మేకు.
వారసుడు లేని సొమ్ము
తిరిగివచ్చిన ప్రేమలేఖ.
పిచ్చివాని గది గోడను
బొగ్గుముక్కతో రాసిన బూతుబొమ్మ.
జీవకణాల పచ్చి పులుసు
బ్రహ్మాండపు కంటి పుసులు
ఈ దేహంపై మోహం :
ఈ డొక్కు కారులోనా పయనిస్తున్నది ఆత్మ ?
ఈ చెడిన రేడియోలో పలుకుతుందా అంతరాత్మ ?
ఈ విరిగిన సొరుగులోనా
ఆశలు, ఆకాంక్షలు, స్వప్నాలూ
ముఖ్యమైన కాగితాలు, పత్రాలూ :

# అపూర్ణ కవిత-3

పాపల్లారా! పూపల్లారా!
బ్రతుకుల ముళ్ళడొంక కిరుపంకల కిలకిల నవ్వే పూవుల్లారా!
ప్రేమల పూవుల తావుల్లారా!
మాతృస్నేహామలనీరంలో కెరలే, చెరలే చేపల్లారా!
ముద్దుల సేద్యపు కాపుల్లారా!
పారిజాతముల పూతల్లారా! దివ్య ప్రపంచపు దూతల్లారా!
మీరు వీడి వచ్చిన దే దేశం?
శోక మలిన మానవలోకానికి ఏమిటి మీరిచ్చే సందేశం?
బోసి పలుకులా, పసిడి తునకలా, అమృతం తొణికే పే మా చెణుకులు
ఎక్కడి మురుపులు, ఎక్కడి కులుకులు?
అనంతార్థ గంభీర జలధిలో ముత్యాలేరే మూగి మునకలా?
అర్థం లేని "మహా కావ్యాలకు" ఓనమ లెరుగని కవిమనీషులా?
విరిగిన శబ్దపు తునక లేర్చుకొని, కావ్యం కూర్చే అమృతభాషులా?
ఎవ్వరు మీరీ విశ్వమరువులో, హఠాద్దృష్ట హరితోపవనంలా,
ఘోర నిదాఘ తప్త గోధూళిని, శీత పూత మలయ వ్యజనంలా!

స్పర్శ రూప రస గంధ శబ్దముల
ఈ అనంత జీవితపు విపణిలో
చిరునవ్వుల వర్తకులా మీరలు
అవి మీ తెచ్చిన మణులో ఘృణులో
అహో దిగంబర మూర్తుల్లారా!
ఆశుతోష శివ శంకరులారా!
బలిని ఛలించి మరల వామనులై
వెలసిన ఓ త్రిలోక హరులారా!
మీ పావన పదధూళి సోకి గద
పునర్జననమైనది పాషాణికి.
మీ కపోల కాంతుల నిగనిగలే
కవిత నేర్పినవి ముద్దియ వాణికి.

# అపూర్ణ కవిత-4

జీవితానికి జాలి లేదు.
అవును, మరణంకన్న కూడ జాలి లేదు.
ఒంటరి నరుని మేధ ఇరవొంది చీకటి చెరలోన గాలి లేదు.
జీవితానికి జాలి లేదు.
ఎపుడు ఎచట శాంతమౌతుంది విశ్వదేహపు రుధిరాణువుల పోరాటం.
ఎపుడు ఎచట అంతమౌతుంది అలభ్యం కొరకు అనవరతపు ఆరాటం.
నింగి నీలాలు, నేల చూలాలు చెక్కుల పసిమి, డేగల రెక్కలపై ఎండ తావి
చీకటి ముద్దుల చేత చెరిగిపోయే సంజ పెదవుల కడపటి కావి
వేకువ రాక, పచ్చని చేల పైరుగాలి, ఆకుల్లోంచి పాపల నవ్వుల పూలు
వెలుగునీడల వేన వేల చాయలతో మాయా కాంచన మృగాల కిరణాలు
కల్పనకూ, శిల్పానికి ఎంతో దూరముంది.
నింగికి నేలకు నడుమ మోయరాని జీవిత భారముంది.
సురగలు గ్రక్కుతోంది నడివేసవి, పడగ విప్పి,
వడగాడ్పుల బుసలుగొట్టి,
మండే భూమండలాన్ని వజ్ర కుండల పరిధిలో చుట్టుముట్టి,
పచ్చగ కనుపించే ప్రతిదానిని మంటల నాల్కలతో తుడిచిపెట్టి,
సురగలు గ్రక్కుతోంది నడివేసవి బుసలుకొట్టి.
పరుగులు పెడుతున్నారు జనులు నీడలకొరకు,
మరచిన హృదయార్ద్రితల జాడలకొరకు.
పాము రేడు దవడల మర్రి క్రింద, కోరల ఊడల ఇరుకు వాడలకొరకు
కారుతోంది స్వేదం ప్రతి తనువున తళతళ మెరిసే గరళధారల్లా
నల్లని దేహాలపైన నెత్తుటి నీటిచారల్లా.
ఎక్కడా ఒక పురుగు లేదు ; మూసిన మదుల గదులు,
మూసిన జీవన విపణివీథి
మండే గాడ్పుల ఎగిరే రాలుటాకులు, పూలరేకులు, దుమ్ము, బూది.
ఇది జీవిత మధ్యాహ్నం.
పట్టు పచ్చికపైన ముత్యాల మంచులోన రేయి కలలు చెరిగే చిన్నెల్లేవు,

సూర్యుని సప్తాశ్వాలు పరుగులిడిన నీలాల్లో
మబ్బులతోటల విరిసిన వన్నెల్లేవు
ప్రేమ పరిమళాలు తేలే సోమరి చిరుగాలులలో
నీరవ నికుంజాల రహస్యాలు లేవు
జాగర రాగారుణ దృక్ దిగంతాల,
కాటుక మొయిలు తునకల దృశ్యాలు లేవు
కలరుతాలు, కూజితాలు లేవు, ఇపుడు నిశ్శబ్దం, నిస్తబ్ధం, నిశ్చిహ్నం
ఇది జీవిత మధ్యాహ్నం.
నిప్పులు కురుస్తోంది నింగి, నిప్పులు చెరుగుతోంది గాలి,
నిప్పులు క్రక్కుతోంది నేల.
భీకర జ్వాలా సాగర మగ్న ధరణి, కానరాదు చూపుమేర స్నిగ్ధ వేళ.
జ్వాలల పక్షంలోన ఏ పవడాలు, జ్వాలల గర్భంలోన ఏ ముత్యాలు ?
ఏ విచిత్ర చిత్రాల వన్నెల తోట ? ఏ జలకన్యల అద్భుత నృత్యాలు ?
జ్వాలా జలధిని బాధా శుక్తి గర్భ ముక్తా ఫలాలు వెదకే వీరులెవరు ?
ప్రాణపవనం లేని చోట పావనిలా సజీవినివటి వెదకే ధీరులెవరు ?
మంటలను నెత్తురుతో రంగరించి, జీవితానికి రంగులు వేసేదెవరు ?
జననమరణ సుఖదుఃఖాల పడుగుపేకల వినీల కాలపటం నేసేదెవరు?
కన్నీరు ముత్యాలుగ, చిరునవ్వులు వజ్రాలుగ మార్చే మాంత్రికుడెవరు ?
బ్రతుకుల మసిబొగ్గులను కళామాణిక్యాల రూపుగ మార్చే
తాంత్రికుడెవరు ?

# అపూర్ణ కవిత-5

ఇప్పుడు సకల శబ్దాలు నిశ్శబ్దమైన వేళ
మెదడును తొలిచే వేరుపురుగులు నిస్తబ్ధమైన వేళ

కవిత జీవితానికి కుంటిసాకు
కుంచియ చిత్రించిన ఆడని ఆకు.

ఆత్మల అవిచల ఏకాంతంలో, శిశిర శర్వరి గ్రసియించిన శాంతంలో
నేను గడగడ వడకే నా ఛాయను చూస్తున్నాను.
అదృష్టపు అంకెలవంటి తారల శాంబరమాయను చూస్తున్నాను.
చీకటి రేయి నరుని కూయి, లక్షల నక్షత్రాల నీడ క్రింద ఒంటరి
నరుడొక నీడ
శోకపు వెర్రి మర్రి క్రింద ఎండిపోయిన మొండి ఊడ.
భీకర తిమిర తరంగాల తలపై నురుగు రవ్వలు వెలుగు చాలు,
చీకటి చెట్టు కొమ్మల వ్రేలే మిణుగురు నవ్వుల పూలు

కాని మానవ భాగ్యలిపిని తెలుపగలిగే వెలుగు లేదు
వికృత జీవిత విహితవిధిని ఎదురించే ఎలుగు లేదు.

# నైశ భూమిక

నల్లబడిందాకాశం పగటి మిల్లుల పొగ గొట్టాల ధూమ వమనంలో -
చల్లబడిం దఖిల ధరణి చిర నిద్రాకోశంలోంచి వొంగిలించిన క్షణంతో
చిక్కని చీకటి దుప్పటి కప్పుతోంది నిఖిల ప్రాణుల ఒరిగిన శరీరాలను.
నీరవతా మృదు గీతం తాకుతోంది, నిశాగ్రసిత దూర దూర తీరాలను.
ఇది సమయం విశ్రాంతికి
ఇది సమయం దివాక్లాంత శిథిలాంగాల, శ్రాంత హృద్విహంగాల
మధుశాంతికి.

ఇది సమయమనేగదా కునుకుతున్నది, వెచ్చని పొయ్యి
బూడిదలో గజ్జికుక్క,
గోడపై కదలని బల్లి, ఇంటి పిల్లి, నాథునికై కాచుకొన్న తెల్లని ప్రక్క.
కునుకుతోంది మిల్లుల్లో రేయి అంతుల యంత్రాల భీషణ గర్జన కూడా
పని చేసే కూలివారి నోళ్లల్లో తెరిపిలేని తర్జన భర్జన కూడా.
వెదుకుతున్నవి పేలకై నిదుర వ్రేళ్ళు చీకటుల విరియబోసిన కురుల్లో
కెలుకుతున్నవేదో కోల్పోయినట్లు తిమిర సంకులావ్యక్తపు ఝురుల్లో.
అంతా ఒకటే చీకటి, చీకటి కానిదే లేదు, చీకటి అన్నిటి హేతువు.
బాహ్యాంతర ప్రపంచాల సరిహద్దులు, కలుసుకొన్నవీ చిక్కని చీకటిలో
జనన మరణ తీరాలను జోడిస్తూ క్రమ్ముకొంది నిద్రాశ్యామల సేతువు
గురకల సడి, పురుగుల సవ్వడి తప్ప అలికిడి లేదు, నిస్తబ్ధత విశ్వకుటిలో
నేనొకణ్ణి, నిశిత కృతక కాంతుల జాగారంలో, నిశాచర ప్రపంచంలో
నేనొకణ్ణి, ఎంగిలి మెతుకులా, కడిగి తుడిచిన
ఈ ద్రుపదపుత్రి కంచంలో :
నేనొకణ్ణి, ఉబ్బసపు రోగిలాగు విరిగిన ఈ కుక్కి బ్రతుకు మంచంలో:
నేనొకణ్ణి, దొంగల, జేబు దొంగల, బిచ్చగాళ్ళ,
వేశ్యావిటుల ప్రపంచంలో !
నీడల కూడలి ఇచ్చట, దోమల సంగీతానికి నక్కిన నల్లుల నటన,
చీకటిగది మారుమూలల చిట్టెలుకల పరుగే ఒక అద్భుత విచిత్ర ఘటన.
వెలుగుచుట్టు శలభాలు మూగుతున్నవి.

ఒక దురూహ్య మోహంలో అనువులు కోలోప్పటానికి
ఉగ్రాతలూగుతున్నవి,
మూగరేయి నగరంపై మృత శిశు దేహాన్ని
ఎదకు పొదవుకొనే తల్లిలాగు,
శోకావిల లోకావళి, చీకటి చిక్కని నల్లని భీషణ విషవల్లిలాగు.
ఎక్కడ పాపాల పూలు ?
ఎక్కడుంది దివాప్రసవ సంవేదన వదలి చనిన తన నెత్తుటి ఆనవాలు ?
మురుగుకాల్వ కెందామర ? చీకటి గదుల, గదుల మదుల
వెలిగించే మణిదీపం.
నేరాలకు పరిహారం ? కోరిక వేసగి గాడ్పుల శీతల చందన లేపం ?
ఇది కాదు సుమతీ శతక రచిత జగతి, కాళరాత్రి ఆదర్శాల ధాత్రి కాదు.
ప్రబంధాల పరిమళ బహుళ కక్షంలో,
పవళించిన మృదు శిరీష గాత్రి కాదు.
ఇచ్చట అందంకూడా కటికచేదు, ఆనందం రోగార్తుల మత్తుమందు.
చింత చచ్చినా చావదు బ్రతుకు పులుపు,
ఇచ్చట బ్రహ్మాండం ఒక మురికిసందు.
మింటి ఒడలిపై తెల్లని మచ్చలవే, ఈ జగతిని కుష్ఠురోగి దేవదూత.
నరాల సాగిన తంబుర తీగెలపై పలికిన తుంబురగీతం బ్రతుకు రోత.
పిచ్చివాని మెదడులోని డొంకలంట వంకరగా పరుగులిడే ఆహ్లాదం.
ఆత్మహింసకాంతరాన పరులపట్ల స్నేహార్ద్రిత కెడ మివ్వని అవసాదం.
పరాజితుల ప్రతిహింసల ప్రాజేతల ప్రేతాలకు నూతన పునరోత్థానం.
తంద్రా సాగర తటాల స్పృహాలహరుల మంద్రావసాన
శోక మృదుస్వానం.
చలిస్తున్నవి వీథిదీపాల మ్లాన మలిన కిరణ వీక్షణాలు.
సుప్తనేత్ర శతపత్రాల సంపుటాల్లో ముద్రితా శోకాస్రాల హిమకణాలు.
నవపల్లవ కల కపోల పాళిపైన సుఖస్వాప మృదులానిల నిశ్వాసాలు ;
స్తబ్ధ జగతిని సూక్ష్మదృశ్య సూత్రాలలో గ్రుచ్చిన
మమతా మోహపాశాలు.
స్వప్నాంగుళుల మృదుస్పర్శ వసుధా వక్ష కాఠిన్యాన్ని
లాలించి పాలిస్తోంది.

చీకటిలో, నిద్రిత నేత్ర సంపుటిలో రంగుల మతాబాలు కొలుస్తోంది.
శ్రాంత స్పృహ నిహితమైనది విశ్రామ సైకతాలలో అంతర్వాహినిగా
మనోరజనీ ప్రాంతరాల ధూళి ధూసర రహస్యాల ప్రచ్ఛన్న సాహిణిగా
ఎక్కడున్నది సంస్కృతి సింధు సముద్ఘోష,
స్వప్నోత్థిత విహంగాల పలవరింతలు,
నిద్రా నీల వనంలోన రాలుటాకుల గుసగుసలు,
సమసిపోని పగటిచింతలు.
దైనందిన కల్పాంతాల విలయవేళ, వినూతన మన్వంతరపు విష్కంభం.
తామస హైమాచ్ఛన్న వసుధ పైన మరొక దినము,
మరొక సర్గ సమారంభం.
నిన్నటి శోకనిర్మోకానికి రేపటి నవజ్యోతిర్లోక మొదంబడదు
రేపుకుకూడా రేపుంటుంది కాని మరల ఈ కన్నుల నిద్దుర విడదు
వేచి వున్న మహారాత్రికి సూచనగా మరీచికలు లేని రాత్రి
తిరుగుపోక కనుమతించే తీరానికి స్వల్ప విరామాల యాత్ర
దిగులెందుకు ? కలల కాసులు వెచ్చించాక
తిరిగొస్తాము యథావిధి స్వసదనానికి
రక్తంకన్న స్వేదమెక్కువగ పారే కలుషకర్మల కదనానికి
ఈలోపు రేటు ఉన్నది, బ్రతుకు ధరలు పడిపోయినవి విపణివీథి
వినిమయాల బ్యాంకుల సప్త మహా సౌధ దేహాలపై
కుక్కల నిద్దురలో ఒక హాయి ఉన్నది.
వెలుగుకొరకు వగపెందుకు, సూచి భేద్యా మేచక
శైవలావృత మీ నిశాకాల కాసారం
మన దగ దీర్చకపోదు, రిక్తబోదు దివాంధాల దుష్కర కృష్ణాభిసారం
కాటుక కొండల కవల ప్రొద్దుందని అనేవారు,
నిజంకాని నిజమొక్కటి చెబుతున్నారు
ప్రొద్దున్నది కాటుకకొండల క్రింద గనుక ముందు
పెకలించాలి కాటుకకొండల బారు
ప్రొద్దును సృష్టించాలి ఒక్కొక్క హృత్స్పందనమిచ్చి
ఒక్కొక కిరణసూత్ర మేర్చి

మానవ నైరాశ్యాల కరుడుగట్టిన నెత్తుటి కూడు
ఒక్కొక్క ముద్ద కూర్చి, చేర్చి
ప్రత్యూషాల చిర సనాతన గమ్యానికి సాగే పయన మాగిపోదు
విశ్వావన గంగోత్తుంగ తరంగాళి హరుని జటాజూటంలో దాగిపోదు
వేకువ కనుమతించాలని మనం చేసిన తీర్మానం వీగిపోదు
కాని ఒకే ఒక్క దువిధ - పులుగులు ఎలుగులెత్తినపుడు రేలకు అలవాటుబడిన
వారంతా ఏమౌతారు, రేయల్లా మేలుకొని అలసిన కనులు
తమంతటను మూతబడిన
పవలు కూడా రేయికాదా ? వేరేదీ త్రోవ లేదా ?

# అపూర్ణ కవిత

## దైత్య దేశంలో గలివర్

ఆ పలల స్తూపాలు లోల శైలాల లీలగా
ఆ త్రాసద రూపాలు సాహసానికి సవాలుగా
ఆ కర్కశ బాహార్గళ కౌగిలి కఠిన శిక్షగా
ఆ రక్కసి మక్కువలు పౌరుషానికి పరీక్షగా
చాలు మనికి కిక తరుణీ తనువు తమి చాలనగా
చాలు పలల లాలాశ్రమజలగంధము చాలనగా
వెగటు గలిగినది, విసువు కలిగినది, వెరగు కలిగినది
చేతకాని నా సేతల నాకే వెడగు కలిగినది.
బుడుతల జగతికి నియతిని, విధినై, ఈ దితిజ క్షితి,
బుడుతను, బొమ్మను, కొమ్మల చెండును, ఇది నా దుర్గతి.
వారి మొరకు సేతల, రీతుల హిత నిహిత సమాదృది
నా పాలిటి కాలాహతి వారి వినోదము నా మృతి.
అసుర రమల భీమ స్తన సీమల పవళించాను
ఉచ్ఛ్వసితాందోళిత డోలా కేళిని తేలాను
జటిల జటాజూటాటవి సఘన శ్యామచ్ఛాయల
ఎన్నో శాంబరమాయల లోతుల విహరించాను.

# ఎర్రక్రీస్తు

ఆ ప్రాచీనాచారాల ప్రాచీరాలు
బంగారపు దేవళాల నింగి నేలే గోపురాలు
పాత కాపులు పూజారులు, అస్మితముఖులు
అమలినాద్భుత చీని చీనాంబరధరులు
స్వర్ణ దండ మండితకరులు, ధర్మ ధ్వజ రక్షకులు.
దేవళంలో ధూప దీప నైవేద్యాల దుర్భేద్య సౌగంధ్యాల
చిక్కని పొగమంచులోన ఉక్కిరిబిక్కిరియై
గాలికికూడ ఊపిరాడని శాశ్వత సంధ్యాజగాల
యత్న రచిత రత్నఖచిత విచిత్ర విగ్రహాల మ్రోల
నర్తించే పసిడి వన్నియ కన్నియలు —
నీ వక్కడ లేవని నాకు తెలియక కాదు.
(అది ఒక ఖయ్యాళి అను, అసమర్థుని జాలి అను)
పుత్తడి పుట్టలోనిది చావని నాకు తెలియక కాదు.
తల తాకున ధీర మేరు గౌరవాన్ని ;
కాంచన కుంభి కుంభాన్ని ఢీకొనాలని అనుకొన్నాను,
(వ్యర్థయత్నం ; ఒక నిరర్థ సంకేతం)
కరుకు కేల, మొరకు బ్రతుకు నెత్తుటి చెమటల తీర్థం తెచ్చిన నేను
అగణిత క్షత విక్షత చరణ ధూళి ధూసర దేహుడనై వచ్చిన నేను
(కూలీల మెలిదిరిగిన, బలిసిన కండలు ; రైతుల్లాంటి అరచేతులు;
మొరటు మొగం)
ప్రేమోద్రిక్త క్రోధంతో ; అక్కడ కూడా,
ఆ బంగరు పంజరంలో కూడా,
నీవు విధిగా ఉండి తీరాలని శాసించాను.
లోలోన పిరికిగానే ఆశించాను.
ధర్మశాస్త్ర రహస్యాలు
తర్క మహా మాయాజాలచ్ఛిద్రాన్వేషణల సూక్ష్మ సూత్రాలు
వాటివెనుక దాగిన నీ లీలా గూఢ పరమార్థం నాకెలా తెలుస్తుంది.

మూఢుడను — నీ ఉనికీ, లేకునికీ, ఒకేలా చలిస్తుంది.
మూడు మారులు కోడి కూసి
ద్రోహపు నల్లని ప్రొద్దు భళ్ళున పొడిచిన వేళ
నా నీడ చూచి త్రుళ్ళి నేనే హడలిన వేళ
నా కండలు తిండి కాగ
నా రుధిరం మధువు కాగ
పుత్తడి మిత్తవ ముద్దు నా పెదవుల భగ్గున మండిన వేళ
నే నిచ్చే ప్రాణం తప్ప, నీ విచ్చే దానం గురుతించని నేను
"దేవా! నీ వెక్కడ?" అని అరచానే కాని
నా అశక్త దాహంలో, జనుల రక్త దాహంలో
అపహేళనల ఉమ్ములోన, అవమానపు దుమ్ములోన,
నీవు నాకు మునుపటికన్న, సన్నిహితుడవైనా పసుకొన లేదు.
నా వెనుకనే ఉన్న నిన్ను కనుగొన లేదు.
బాధా శైలాగ్రాన,
కంటక మకుట శూలాగ్రాల, రోజాలు రాజసంగా మొగ్గలిడగా,
కాళుల, కేళుల కమ్మని కెందమ్ములు భగ్గుమనగా
(అజ్ఞుడను) అప్పుడు నిన్ను గురుతించాను.
కడపటి కృతజ్ఞతతో నిట్టూర్చాను.

# వినతి

నిరుపహతి స్థలముల్లేవు
రమణీ ప్రియ దూతికలు తెచ్చి ఇచ్చే కప్పురపు విడెముల్లేవు
జరీ నగిషీ కాశ్మీర శాలువలూ, గండపెండేరాలూ లేవు.
భావ కవుల గిరిజాల్లేవు, విరహాల్లేవు.
'కాలిన ప్రేయసి దేహపు చమురు కంపు లోకంలో'
మరఫిరంగులు మందు గనులు ప్రేలే చోట
అది మా గాయాల పూలతోట.
ఇనుని కప్పి ఎగిరే ఇనుపడేగల రెక్కల చప్పుడులో
దిగంతాల మార్మోగే మృత్యు జవనాశ్వాల పెను డెక్కల చప్పుడులో
మా కేకలు మాకే వినిపించని చోట
అది మా పూలతోట.
ప్రతి అక్కర మొక భటుడూ, ప్రతి పదమూ ఒక శకటం
ప్రతి ఊహా ఒక వ్యూహం.
శంకాతంకిత జీవితాల సంకుల సమరంలో
కవితను ఏమనుకొన్నావు ?
పెదవుల చివురులు ఉమిసిన జేగురు దుమ్ము
దాహపు సహారాల గికురించిన నోటి చెమ్మ
నెత్తుట తడిసిన జండా.
పెద్దవాడు పెద్దన, కాదన లేను, కాని నేను
అతని కోవవాడను కాను.
ఏ మన్నాడు శ్రీనాథుడు ఉద్దండ పండిత పిండం ?
కస్తూరి కోరినాడా ? (సిరి గలవానికి జెల్లును)
మా కెందుకు ? కవితా మృగ మద గంధ వ్యాకుల మృగములము మేము
చింతామణిధర భీకర గరళోరగములము మేము
ఉద్గమ మెరుగక దిగ్భ్రమ తమసులో భ్రమిస్తున్నాము.
కోకిలలము, కాము కాము, కాకములం, కా కవులం
మా కఠోర కంఠాలెత్తి చెవిటి చీకటుల పొరలను చీలుస్తున్నాము మేము.

మాకు మాత్రం, శాశ్వత శవపేటికలో మూసిన మమ్మీ కాదు కవిత —
బ్రతుకు నీలిమంటలలోంచి పారే చిక్కని లోహం,
విషకన్యక అధర సుధల తీరని, ఆరని మోహం —
అందని ఊపిరిలో సూక్ష్మ యక్ష్మ క్రిముల అప్సరసల మృదులాసం.
మృత్యువు ముట్టడించిన దేహపు రాజధానిలోన
దాగిన క్లొయస్టరాల్ ఉపహాసం.
చల్లని మలాము కాదు, కాదు కవిత, నాగుబాము! నాగుబాము!
కాటేస్తుంది జాగ్రత్త!
దీని కాటుకు విరుగుడులేదు జాగ్రత్త!
ఏదో రాస్తున్నానని
కీర్తి కనక సౌధ సింహద్వారం వద్ద పడిగాపులు కాస్తున్నానని ఎంచకు!
బ్రహ్మాండపు గోదాలో, మిత్రుల నెత్తుట తడిసిన జేగురు మంటిలోన
కాలునిపై కలియబడి కుస్తీ పడుతున్నాను.
కాళియుని ఫణాలపైన స్వేచ్ఛానృత్యం చేస్తున్నాను నేను.
నా నెత్తుట ఇరుసంజలు రంజిల చేస్తున్నాను.
"ఏమిటీ కవిత ?" అని అడుగకు వెర్రివాడా!
కొంచెం దుమ్ము, కొంచెం ఉమ్ము, నెత్తురులూ, కన్నీరూ,
ప్రేమ గాని, కవిత కాని, ఏ ముంటుంది అంతకన్న ?
నా శిలువను చూడలేవు; నా నీడను చూడలేవు
సిరాలోన కలిసిన రుధిరం కూడా చూడలేవు.
ఏదో జీవిస్తున్నానని ఎంచకు!
బలిపీఠపు నెత్తుటి పాచిలోన
పంబల రుంజల మ్రోతల మౌనం చీల్చి
వధ్యపశువు కనులలోని అర్థం కొరకు అర్థిస్తున్నాను నేను.
మరణాసన్నుని గళాన, రతి రణ చరమోద్ధతి స్రుత మణితాల్లా
పారిపోయే ప్రాణపక్షుల రెక్కల రెపరెపల్లోంచి
అమృతాన్ని అన్వేషిస్తున్నాను నేను.
ఈలోకపు లేకి లంజ మరకల మంచం మీద
ప్రేమలోని పరిశుద్ధతను పరిశీలిస్తున్నాను నేను.

కుష్ఠరోగి కురుపుల రసిలో ముద్దుల తమి తీర్చుకొంటున్నాను.
ద్వేష ప్రేమల శ్లేష కావ్యపు ఒకే ఒక అర్థం కొరకు
అర్థం వెనుక భావన కొరకు, భావనలోని దయగల దీవెన కొరకు
అలమటిస్తున్నాను నేను, కలవరిస్తున్నాను నేను.
కవితలోన లేదు ఘనత
విశ్వ మహా కావ్యాలన్ని వేదనతో విలపించే
పసివాని అశ్రుబిందువు పాటి చేయవు
ఏసుక్రీస్తు పదరేణువు పాటి చేయవు;
హృదయపు చీకటి పూచిన పూవుల తావి
మహామహుల కరుణాపరీమళానికి సరి రాదు.
వినతి నేర్చుకొంటున్నాను ;
మణిధర ఫణికి ప్రణతి నేర్పుతున్నాను.

# కెందామర

ఆకాశపు కాసారంలో సూర్యుడు కెందామర
బ్రతుకు పూల ధూళి చిమ్మే పుడమి ఒక కెందామర
నాడీ నాళ శైవాలా లలమిన ఈ
శరీర సరోవరాన హృదయం ఒక కెందామర
మందేహ దేహచ్ఛాయాసిత మోహ తంద్రా విల తమస్వినిలో
జాగ్రత సందేహం ఒక కెందామర.
మస్తిష్కపు రుధిర స్నిగ్ధ బలివేదిక కెందామర
అక్షరాల సిరామరకల తరంగిణి శిరసుమీద
పూచిన కవిత కెందామర.
కరువు చెరువులో ఆకలి కెందామర
బాధల అగాధంలోంచి, నిరాశల నిశీథపంకంలోంచి
అంకురించిన రుధిరాంకం, క్రాంతి ఒక కెందామర.
క్రీస్తు కాళుల, కేలుల వ్రణాలు కెందామరలు
తథాగతుని నొచ్చిన చరణాలు కెందామరలు
చీకటి కోటకొమ్మను వ్రేలిన వీరుల శిరసులు కెందామరలు
దిగంతాల అనంతశూన్యంలోన
పరమాణువుల. రేణువుల, పదార్థపంకంలోన
తరుగక, చెరుగక, నిలచే ఆ అదృశ్య ఆదిశక్తి కెందామర.
వినీల కేశాల కాసారంలో నీ వదనం కెందామర
నిశ్చలనీరంవంటి నిర్మలవదనంలో కన్నులు కెందామరలు
కన్నీరుల సరసిలో పూచిన ప్రేమ కెందామర.

# రెండు క్రిస్మస్ గీతాలు

అవకాశం, ఆహ్లాదం, ఆలోకం
నెత్తుటి మడుగుల పూచిన తెల్లని తామరపూవై
క్రీస్తు వెలసినాడు మరల, లోకమంత నిశ్శోకం.
హింసాశర్వరి గతించి, స్వర్ణఘంటికల సుస్వర
సురభిత గీతులు రతించి, దేవపుత్రకుని నుతించు
పథభ్రాంత పణ్యాంగన, దిక్కులేని కుష్ఠురోగి
చనిపోయిన లాజరస్సు, ఎందరెందరున్నారో
అందరికీ అవకాశం, ఆనందం, ఆలోకం, లోకమంత నిశ్శోకం !
శాంతి, శాంతి భూతలిపై, శుభైషణలు జనావళికి !
ఈరోజున జనించాడు, రారాజు హృదయద్యుతుల
నీరాజనము లెచటోయి ? శైశిర ప్రాతఃపథాన
తుహిన స్నాతావనిపై రవి కిరణాలోకనముల
శతసహస్ర శక్ర చాప వితతుల అగణిత మణిమయ
జ్యోతులుద్భవిల్లు నేడు; లోకమంత నిశ్శోకం.
శాంతి, శాంతి భూతలిపై, శుభైషణలు జనావళికి !

2

యూదులకు కూడ శాంతి
ఆమిషాస్థిమయ గాత్రం
దీనం కరుణాపాత్రం
వంచన తామస నైజం, అప్రవంచితం కాంతి.
పైలట్లకు కూడ శాంతి.
క్షమ్యం మానవుని నియతి
కేవలాంధకర్మ నిరతి
బాలురమాయకులు వారు, సహజ సులభము విభ్రాంతి.
హంతకులకు కూడ శాంతి
హింసకు ప్రతి కాదు హింస

ఆరని జ్వాలిక జిఘాంస
నృశంసుల తగిన శిక్ష ప్రేమపాశముల క్షాంతి.
దుర్బలులకు కూడ శాంతి
మూడుమార్లు కోడికూత
అగ్నిపరీక్షలకు దూత
అడుగులు తడబడినవారి రక్షమ పంథా శ్రాంతి.
సైతానుకు కూడ శాంతి
ఓడిన దేవులు దైత్యులు
ఓడిన ఆర్యులు వ్రాత్యులు
ఘృణాఘృణుల స్వర్ణరేఖ కవలిదెల్ల విభ్రాంతి.
విష్టపత్రయాన శాంతి
ఈ నిముసం నవ జననం
గతము తుడిచినది తుహినం
శ్రాంత పాంథగమ్యం కనుచూపుమేరకు కాంతి.
శాంతి, శాంతి, శాంతి.

# పాంచజన్యం

పత్తనాల రాజవీథుల పందులు తిరుగుతున్నవి.
ఎంగిలికై ఎగబడే నరులను చూచి కుక్కలు మొరుగుతున్నవి.
బియ్యపుకొట్ల వద్ద బారులుతీర్చి నిలబడినారు పౌరులు.
తినటానికి నోచుకోరు పండించినవారలు.
అన్నపూర్ణ భాండంలో తండులాలు నిండుకొన్నవి.
ఆరిన దాలిగుంటల్లోన కుక్కలు, పిల్లులు పండుకొన్నవి.
ఆక్రోశించి శపించే వ్యాసుడేడి ?
అవమానపు ఉమ్మలతో, దుమ్ములతో నిండిన భిక్షాపాత్ర
బ్రద్దలు కాబోతోంది ; పీడిత ప్రజా హృదయంలాగే.
రెక్కలు ఆడినాయి, డొక్కలు ఆడలేదు
ప్రేవులు పాడినాయి, గొంతుక పాడలేదు.
గంగా యమునలు, కృష్ణా గోదావరులు,
అమృతం పొంగే ఏరులు పారుతూనే ఉన్నాయి.
శ్రమియించే తనువుల స్వేదాలు కారుతూనే ఉన్నాయి.
బంగారం పండే చేలు పండుతూనే ఉన్నాయి.
గిడ్డంగులు, చీకటికొట్లు, వినాయకుల జేబులు నిండుతూనే ఉన్నాయి.
అయినా, ఈ అన్నపూర్ణ భాండంలో తండులాలు నిండుకొన్నవి
కుక్షి ప్రోద్భవ నిష్ఠుర క్షుధిత మహాజ్వాలలు మెండుకొన్నవి.
నాడుపైన మెల్లగా ప్రాకుతున్నవి, నల్లని కరువు రక్కసి నీడలు.
పిల్లలకు పాలులేవు.
పిల్లలగన్న తల్లులకు కూడులేదు, నిలువ నీడలేదు.
కూలివాండ్ర గుడిసెలపైన, గుమాస్తాల గూళ్ళలోన
రైతుల కొంపలపైన, అంతటా కరువు నీడలు.
బక్కచిక్కిన డొక్కలపైన, ఎండిన రొమ్ములపైన,
నల్లని మొగాలపైన అంతటా కరువు నీడలు.
ప్రతినిత్యా ఏకాదశి, ఇంటింటా నిరశనవ్రతం.
పొయ్యిలో రాజని చిచ్చు కడుపులో రగులుతోంది.

కన్నీరుల ఆరనిమంట ఎడదలో ఎదుగుతోంది.
పగ సెగలై పొగులుతోంది.
కలలు అడుగంటాయి, వెలలు మిన్నంటాయి.
కడుపు కరువు, గుండె చెరువు, బ్రతుకు బరువు
ఈ స్వరాజ్యం స్వారాజ్యానికి రాచబాట.
పాచిపళ్ళ దాసరి పాతపాట.
గూడేల్లో దీపాలారి, మేడల్లో దీపావళి.
ప్రతిపూటా ఒక పండుగ, ప్రతిగడియా ఒక వేడుక!
ముసలిముండ ఢిల్లీకి పడుచుమిండడు దొరికాడు.
పేదసాదలను చూస్తే చులకన దానికీనాడు.
దిక్కులేని రాజఘాట్, యమున విలపిస్తోంది.
గురువుకు నామంపెట్టిన శిష్యుల తలపోస్తోంది.
తలలులేని టోపీల రాజ్యంలో, తల ఉంటే తల తీస్తారు.
రైతులకు, కూలీలకు టోపీవేస్తారు.
తేనెపూసిన కత్తులు, తడిగుడ్డలు అక్కరలేదు.
శుద్ధఖద్దరుతో గొంతులు కోయవచ్చు,
తెల్లనిటోపీ చాటున ఏమైనా చేయవచ్చు.
గొర్రెదాటు ప్రజాస్వామ్యం, జేబుదొంగల సోషలిజం
గోబెల్సు చెప్పిందే నిజం, నిజం!
దేశభక్తిని గుత్తకుకొన్నవారు బ్లాకున తప్ప అమ్మరు.
బొజ్జ పెంచిన విస్సన్నల వేదం తప్ప నమ్మరు.
కాసు రాజ్యమేలుతోంది.
రేడియోల్లో, పత్రికల్లో నోటికి వచ్చినట్లు ప్రేలుతోంది.
కంచుకన్న మిన్నగ కనకం నేడు మ్రోగుతోంది.
జరీ అంచుల పొందూరు ఖద్దరు కట్టి వీధిన ఊరేగుతోంది.
మహాత్ముని శిష్యుల రాజ్యంలో రెండే రెండు జాతీయ పరిశ్రమలు
వ్యభిచార గృహాలూ, దొంగసారా బట్టీలూ.
పని చేసేవారికి పనుల్లేవు, పనులున్న వారికి వంగదు వారు
కంచే చేను మేస్తున్నది, దొంగలు తాము ఊళ్ళు పంచుకొంటున్నారు.

రామరాజ్యంలో నేస్తం, క్షామం తప్ప క్షేమం లేదు
నవభారత సంగ్రామం జరుగని గ్రామమంటూ లేదు.
ఎటుచూస్తే అటు చీకటి, ఎటుచూస్తే అటు శోకం.
ధరణీగర్భాన శిరసు దాచుకొంది ఆలోకం.
ఉక్కిరిబిక్కిరియైన దిక్కులకు ఊపిరాడదు
తరగల తలలొగ్గిన కడలి, కంబు కంఠమెత్తి పాడదు.
ఆకసపు టంచులపైన ఏ మూ నల్లని నీడలు
రాబోయే పెనుతుపాను తొలిజాడలు.
అధికార దుర్మదాంధులు, తెల్లగుర్రపు రౌతును,
కత్తిపట్టిన కల్కిని కానలేరు.
వధిరుల వీనులు వినలేవు గుర్రాల డెక్కల సడి.
మిత్తవ రెక్కల సవ్వడి.
నల్లని మేనులపైన క్రమ్మిన ధూళి — అదే పృథివి.
నల్లని వెన్నులపైన మెరిసే చెమట — అదే జలము.
బక్కచిక్కిన డొక్కల ఆకటిచిచ్చు — అది అనలము.
సెగ పొగలై ఎగసిన ఊర్పు — అది అనిలము.
దీనుల నయనాల్లో నిండిన శూన్యము — అది గగనము.
పిడికెడు మంటిలోన ఇమిడిన పంచభూతాలవి —
పొరలిన దిగ్గజాలు, కదిలిన జరఠ కమఠము
దుర్భరతర ధరాభారం మోసే ఆదిశేషుడు, కోటిశీర్షుడు
అకించనుడు మించులాగ చలించాడు.
దద్దరిల్లిన దిక్కులు, బద్దలౌతున్న ధరణి.
అదిగో, కదలి వస్తున్నది, అమ్మవారు, ఆద్యశక్తి
కాళిక, కరాళ కాలనేత్ర జ్వాలిక !
చండిక, ముండమాలిని, అదిగో, కదలి వస్తున్నది !
ఒక్క అడుగుతో భూమీ, ఒక్క అడుగుతో వ్యోమం
మూడవ అడుగు ఎక్కడ మరి, మహిషుని శిరసుపైనా ?
రక్తనయన, రక్తవసన, రక్తరసన, జగద్ధాత్రీ !
ద్రోహుల శవాలు పరచిన బాటలంట,

మా హృదయాల మురికి పిరికి పేటలంట నడచిరా! నడచిరా!
స్వాగతమిస్తాము నీకు చూపుల పూవులు చల్లి
ఆరతిపళ్ళెరాల్లో శిరసులు నైవేద్యంగా, స్వాగతమిస్తాము నీకు!
జయం, జయం, జనతా హృదయనేత్రీ! క్రాంతిధాత్రీ!
నీ అడుగుల సడి ఫెళఫెళ పిడుగులపడే సందడియై
నెరియలు విచ్చినాయి అండపిండ బ్రహ్మాండాలు
రెండే రెండు వర్గాలై, రెండే రెండు దుర్గాలై, రెండే రెండు మార్గాలై.
నెరియలు విచ్చినాయి, బ్యాంకులు, విపణివీథులు, మహాసౌధాలు.
ఇసుకతో కట్టిన దాములు, విసిగిన ప్రజల హృదయాలు
నెరియలు విచ్చినాయి దేవళాలు, దేవతల విగ్రహాలు.
నెరియల్లోంచి బయటపడినవి నక్కలు, గుంటనక్కలు, తోదేళ్ళు
ఆకసపు నొసటిపైన వేగుచుక్క!
ఎర్రని ప్రొద్దు పొడుస్తోంది తూరుపువ్రక్క!
నల్లని మేనుల మెరిసే విషపు చెమట —
కదలే కందరాలు పడగవిప్పి ఆడే త్రాచులు
రెపరెపలాడే రేచులు.
ఆ నల్లని దేహాల మేఘాల్లో విద్యుత్తు.
వైశ్వానరుని సర్వభక్షణ శక్తు!
సోదరులారా! దీక్షగా ఏమిటి త్రవ్వుతున్నారు?
పురాతన జగత్తుకు సమాధి!
వినూతన జగత్తుకు పునాది!

# మాతృగీతిక

చీకటి పడినది తల్లీ! దీపం
            చూపవేలనే ?
మాకై దీపం చూపవేలనే ?
ఆటల పాటల ప్రొద్దు బుచ్చినవి
పిట్టలు గూటికి తిరిగి వచ్చినవి
రెక్కలార్చి పవలెల్ల నొచ్చినవి
సంజమసక నిను దరియ వచ్చితిమి
            కోపమేలనే ?
మాకై దీపం చూపవేలనే ?
పాప పుణ్యములు పరచిన బాటల
కూడని వేడుక కూడిన చోటుల
పయనించాం మా పసి చెలగాటల
మలిన దేహులము, చల్లని చేతుల
            చాపవేలనే ?
మాకై దీపం చూపవేలనే ?
నీ గొంతుక వినిపించని గేహం
మా మదిలో దుర్భర సందేహం
దీపికగా వెలిగే నీ స్నేహం
ఈ దోబూచుల పెనుజీకటిలో
            దాపనేలనే ?
మాపై కోపం చూపనేలనే ?
తల్లీ! దీపం చూపవేలనే ?

# శిలలలో మెడోనా

[ 'Madonna of the rocks' చిత్రం చూశాక]

నీలి నింగి, నీలి రాళ్ళు, నీలి నీరు -
జనన నిధన గహ్వరాలనుంచి ఉబికే ఒకే ఉనికి సెలయేరు !
ఇచట చరమ శతదళపు పరమ సుషమ
          శాశ్వతంగా వికసిలి, విలసిలిన చోట,
పుష్పిత శిరీష మృదుల, పుష్యరాగ ప్రభా పటలి
          హీరక నీర తరళ కాంతి !
          ఒకే భవ్య, దివ్య శాంతి !
నందన మసృణ పరిమళాల, చిరు విసురుల చల్లనితోట !
సూర్య చంద్రుల, లక్షల నక్షత్రాల, స్వర్ణిమ జ్యోతిష్పథాన
కాలానలకీలల, బహుళ ప్రజ్వల దుల్కాల రుధిరావభృథాన
ఆద్యంత విరహితగతిని భ్రమిస్తోంది విశ్వచక్రం —
రుజా జరా మరణాల భీకర శోక నరకభూతి మసిలా చిమ్మివేస్తూ,
                                        నెత్తుటి ఉమ్మివేస్తూ !
ఎంత శోకం లోకంలో !
ఎంత చీకటి లోకపు ఆలోకంలో ?
కాని తల్లీ ! నీ నల్లని కురుల చాయ ముసిరిన చోట,
          నీ చల్లని యూర్పుల తావి విసరిన చోట,
          నీ చూపుల తెలికలువలు దయతో విరిసిన చోట,
                                        ఇంచుక మచ్చిక నీడ !
          పరులెరుగని పరిమళాల విరళపు జాడ !
లోకమంతా ఒకే మాత !
లోకమంతా ఒకే శిశువు !
కోటి కోటి రోజాల, చెంగలువల, కెందామరల విరితావుల
                    వింజామరల విసురుల ఉసురులోన ఒకే అశువు !
ఇచట ఈలోకంలో శోకంలో అంతా చలిస్తుంది ;
          వగలై, దగలై, సెగలై జ్వలిస్తుంది !
          చిటికెడు మసి చీకటిలో కలుస్తుంది !

రకరకాల వాహనాలు, రైళ్ళు, ఓడలు, విమానాలు,
అంతా ఎక్కడికో, పిల్లల్లా, మారాములు, గారాములు, ఆరాటాలు !
జీవితపు అంతులేని ఆవేదన, ఆందోళన, ఆర్భాటాలు, పోరాటాలు !
ఎక్కడికో పరుగులతో, నురుగులతో, తిముల, సొరల నోళ్ళలోకి !
ఉరుల, చెరల జైళ్ళలోకి !
తిరిగిరాని బాటలలో, చీటులలో !
సమాధుల, శ్మశానాల, కూలిన రాచరికాల కోటలలో !
రేబవళ్ళ నెత్తుటిమసి క్రక్కి క్రక్కి విశ్వచక్రం భ్రమిస్తోంది,
పూర్వ నిశ్చిత ప్రళయపథాన క్రమిస్తోంది !
ఎవ్వరూ మరలిరారు; అలా అలా పోతారు,
అలసి సొలసి నిశిలో నిదురపోతారు !
సంజమసకలో తల్లి ఒక్కతే వేచి ఉంటుంది,
చిరు అడుగుల సడి, నవ్వుల సందడి కలలు కంటుంది !
ఆ మొగాన, ఆ కరుణనయన యుగాన
జీవితపు అనంత సకలైశ్వర్యం, సౌందర్యం, సౌశీల్యం, వాత్సల్యం,
లోకంలో అలౌకికమైనదంతా
ఈ అనృతంలో అమృతమైనదంతా.
శత శత గత శతాబ్దాల ధూళి ధూసర దుర్గతిలో
సకలోద్భూత భూతకోటి, దుస్థితిలో, దుర్మృతిలో
స్థితమైనది, ఋతమైనది, అమృతతులితమైనదంతా
ఆ మొగాన,
ఆ కరుణనయన యుగాన ;
లోకమంతా ఒకే మాత
లోకమంతా ఒకే శిశువు !

# వియత్నామ్

భ్రాంతివలన శాంతి రాదు,
మిధ్యావిశ్రాంతివలన శాంతి రాదు.
[శాంతి క్రాంతివలన వస్తుంది,
నవయుగ సంక్రాంతివలన వస్తుంది.]
మెత్తని కుర్చీలపైన మేజా బల్లలపైన శాంతి పండదు,
"హిజ్ మాస్టర్స్ వాయిస్" ల చిలకపలుకులవలన శాంతి నిండదు,
శోణిత శోణ విశ్రాణ కృపాణాల
ధారాతీరాలపై శాంతి కాంతి తళతళ మెరుస్తుంది.
త్యాగుల నెత్తుటివాగుల తడిపిన మాగాణాల
మేలిమి రాజనాల వానలుగా కురుస్తుంది,
శాంతి క్రాంతివలన వస్తుంది.
నవయుగ సంక్రాంతివలన వస్తుంది.
ఆసియా భూఖండపు గుండెలపుండు
సామ్రాజ్య విషవృక్షపు మేడిపండు
వియత్నామ్! వియత్నామ్!
వ్యర్థ విచికిత్సలేని శస్త్ర చికిత్సకులు
గుండెల పుండును కోస్తున్నారు.
తెల్లవాని కల్లవాని సామ్రాజ్యాన్ని
చల్లగా వల్లకాటికి మోస్తున్నారు.
క్రాంతిని తెస్తున్నారు, శాంతిని కాస్తున్నారు.
ఆకలిచిచ్చు రగులుకొన్నది.
బౌద్ధభిక్షుల ఆత్మార్పణపు ఆరనిచిచ్చు రగులుకొన్నది.
విప్లవ ప్రతీకారపు తీరనిచిచ్చు రగులుకొన్నది.
ఆసియాలో, ఆఫ్రికాలో, లాటిన్ అమెరికాలో
అంతటా అనంత క్రాంతిజ్వాలలు రగులుకొన్నవి.
విమానాలు మిడుతల్లా కూలి రాలుతున్నవి.
ట్యాంకులు బింకం వదలి తోక ముడిస్తున్నవి.

మారణాయుధాల బారులు నీరు కారిపోతున్నవి.
శత్రువులు శలభాల్లా కాలి వాలిపోతున్నారు
ఉత్తిచేతుల మిత్రవతో పోరే వీరులజూచి
మిత్రవకూడ సిగ్గుపడి దూరంగా పారుతున్నది.
తెల్లదొరలకు పట్టుకొన్న మనాది వియత్‌నామ్.
సామ్రాజ్యపు సైతానుకు సమాధి వియత్‌నామ్.
జనశక్తుల ఉదయానికి పునాది వియత్‌నామ్.
ప్రాచీ దిగ్వధువు నొసట
తీర్చిదిద్దిన విజయతిలకం వియత్‌నామ్.

# స్ఫురణ

ఎప్పుడో ఒకప్పుడు, నేను వయసులో ఉన్నప్పుడు
ఎక్కడో ఒక కవిత చదివినట్లు గురుతు - అప్పుడు
భావం తెలియలేదు; కాని క్రమేణ గ్రహించాను;
తరంగాల తాడనలా అర్థోద్ధతి సహించాను.
పాటలోత్పల దళాల కాంతులు జారిన వేళ
నయన నీలిమలు కెంపిల జీరలు తేరిన వేళ
చలువరాతి నుదుటిపైన కలువ చెక్కిళుల రేకుల
తమస్వినీ నిశ్వాసాల, చల్లగ రాలే ఆకుల
గుసగుసలో పాపల పాలవాక కేరింతలలో
నిభృత హృదయరహస్యాల వింత వింత పుంతలలో
శవ వక్త్రాధర స్మితిలోన చిర నిమీలిత నయనాల
ఛాయాచ్ఛాదిత మేధా బాధా గాథా ప్రాక్తన వనాల,
సెలల వెలుగు పరుగులలో వెలుగు నగవు మురుగులలో
కోటి కిరణ వర్ణాళుల హరిధనువుల పరుగులలో
తొలివెలుగుల పులుగులలో మరుపుటరల ఎలుగులలో
ఆదిమ హింస్రోరగాళి నిదురించే కలుగులలో
లేవక్కడ దయనాగుల శత శిరసులపై కిరణమణులు.
కోటి మృతక రహస్యాత్మల ప్రదీప్త నయనఘృణులు.
మనసులోని వేన వేల రేఖలలో చాయలలో
మెలమెల్లగ చెదరివున్న అర్థాలను చేర్చాను.
చివరికి ఒక స్ఫురణతోడ, ఒక దండగ కూర్చాను.
అర్థమొక మెరుపు, భావం శ్వేత నీల కాంతిధార
నేటికి విచ్చినది ఎలాగో నా జన్మాంధకార
నేనిక వెదుకను, నాకిది కడపటి స్ఫురణలో కాంతి,
జీవితపు చరమసీమలో ప్రసవించిన ప్రశాంతి.

# సాంధ్యగీతిక

పడమట వాలుతోంది రవిబింబం,
వాడి మాడి వీడినది పోడుములు కలుషాలిప్తం కిరణకదంబం.
వికల విహగ కలకంఠ నినాదం
చిలుకుతోంది ఇలపై అవసాదం.
శోకానికి స్వాగతశ్లోకంలా, ఘూకరవానికి లేదు విలంబం.
శిథిలహృదయ మందిరద్వారం కడ
నిరాలోకవేదికకు చేరబడి
రేయి గడప జూచే ఒంటరినిక నంటదు ప్రత్యాగమ సంరంభం.
పశ్చిమ గగన చితానల రేఖలు
రచించాయి నైశాగమ లేఖలు
సంధ్యా చరమఘోషలో రజనీ ప్రథమాంకానికలన విష్కంభం.
కీచుకీచుమని కీచురాళ్ళ రొద
చెబుతున్నది పుంతల వింతల సొద
ఊరిచివర నొక పూరిగుడిసెలో రగిలిన దివ్వె రేయి కవలంబం.

# ?

వీరులు, నీలకంఠులు, మృత్యుంజయులు
వేదనల విషం త్రాగి జనతకు
మహితకు
సమతామృతం పంచుతారు
మృత్యువు వారికి వంగిచేస్తుంది జోహారు
వగపు వలదు
ప్రతి చెర ఒక తిరుపతిగా
ప్రతి శిల ఒక తిరుమలగా
పూజించే రోజులు ముందున్నాయి !

(ఈకవిత పూర్తిపాఠం లభించలేదు. శీర్షికకూడా ఏమిటో తెలియని కారణంగా ప్రశ్నార్థకం ఉంచుతున్నాం.)

# నరులారా!

నరులారా! సోదరులారా!
భావి శాంతి సౌఖ్య శ్రీవరులారా!
మీబాధలు, తీక్షణాపజయగాథలు మరచిపోయి ఆలించండి,
నేను ఆలపించే ఈ నవమానవ విజయగీత.
నేటికి ఖేదం చాలించండి.
ఆకాశపు అందరాని మ్రానిపండ్లు చేతికి చేరువైన వేళ
మానవుడే పావనిగా దూరము నేరమైన వేళ
లక్షల నక్షత్రాల జరీవిరుల నల్లిన నీలాంబరము
వ్యూఢోరస్కుడు, వృషస్కంధుడు, సాలప్రాంశుండు,
మానవుని మహాభుజల కలంకారమైన వేళ
మీ దైన్యం చాలించండి.
విజయుడు, నరుడు పూరించే పర్జన్య పాంచజన్య
ప్రతిఘోషల నాలించండి.
ఆశాంతాల ఊహాంతాల ప్రాంతంలో
అగణిత గ్రహాల, ఉపగ్రహాల అంతరాళధ్వాంతంలో
అనంతాంతరిక్షంలో, జీవన పరమావధుల సమక్షంలో
గర్వంగా నిలచిన నరుడు సుపర్వులపై సవాలు చేస్తున్నాడు.
అమరుల కోటలోన పాగా వేస్తున్నాడు.
సోదరా! చింతలేదు, ఏమాత్రం వింతకాదు.
మానవమేధా విజయపరంపరల కంతం లేదు.

# హే జననీ!

జన జీవన జననీ! ప్రియ ధరణీ!
ధరణీ! జననీ!
నీ చిర హరితాంచలములు
చంచల మానవ శిశు తనూ ధూళి ధూసరములు.
నీ శైల పయోధరములు
సించిత మానవ దృగవారిక్షీర నిర్ఝరములు.
మమతా, సమతా, క్షమతా భరితా! మహితా జననీ!
నీ శ్వాసల మారుతములు
పంచును మా హృదిలో మంద గంధ శీకరములు.
నీ ఆశల కూజితములు
నించును మా శ్రుతిలో దివ్యగాన సుస్వరములు.
స్పర్శమాత్ర వికసితములు స్వప్నతతులు హే అవనీ!
నీ ఒడిలో యుగయుగములు
శాశ్వత సుస్థిర చిర సుప్తిమగ్న కాలగతులు
మారిన, ఆరిన జగములు
అగణిత జనపదములు, భాగ్యహీను లలకా నృపతులు
నీ చరమాశ్రయమున సుఖశయన మందరికి జననీ!
మానవాళ విలపించును
ఆకాశపుటంచుల మించిన అంచెల కలకై
మానవాస్థి విలసిల్లును
నీ పంక సంకులాంకపు క్రౌంచ్చేలికల మొలకై
నీ పాంశుల పరిరంభణ మనివార్యము హే జననీ!

# అదే జ్యోతి

అదే జ్యోతి వెలిగించుము దేవా!

ఇందు కిరణ మృదు మంద చరణముల
నందన వన మకరంద తుహినముల
గంధ శ్వసన స్వచ్ఛంద వ్యజనముల
ఏ ఆనందము జాలువారునో
అదే కాంతి కలిగించుము దేవా!
అదే జ్యోతి వెలిగించుము దేవా!

ప్రోద్ధత ఝంఝా ప్రళయ తర్జనల
కృద్ధ జలధి సంక్షుబ్ధ గర్జనల
భంగ తురంగమ ఫేన సర్జనల
ఏ విలోల కల్లోలమాడునో
అదే జ్వాల రగిలించుము దేవా!
అదే జ్యోతి వెలిగించుము దేవా!

జనని నయనద్వయ నీల నలినముల
స్వప్న సఘన వన హారిత పులినముల
శైశవ సుప్త స్మితాధర స్వనముల
ఏ దివ్యామృత మూటలూరునో
అదే శాంతి ప్రసరించుము దేవా!
అదే జ్యోతి వెలిగించుము దేవా!

# అనిలతరంగం

క్షణభంగుర మనిల తరంగం
ఉత్తుంగం అవిచల శృంగం
మృత్తిక బలవత్తర పాశం
ఉపహాసం స్వేచ్ఛాహాసం
సాంద్రం, భ్రమతంద్రాపటలం
నిశి జటాజూట మతి జటిలం.
సురసరికే తరుణోపాయం ?
ఎవ్వరు భగీరథుని సాయం ?
ఈ భీమ శ్యామలాకాశం
అటనే ఆలోకావాసం ?
చలదభ్రాంచల ఛలఛద్మం,
అటనే దివ్యామర సద్మం ?
ఈ పాండుర శుష్క ధరాస్యం
జనిదాస్యపు పరమౌదాస్యం
వరియించునటే మధులాస్యం ?
కురిపించునటే మృదుహాస్యం ?
ధూసర మీ దిగంతరాళం
మన్నికగల మాయాజాలం
సర్వగ్రసనం ఈ కాలం
భవ సరోభరిత శైవాలం
ఈ గోచర గురు బ్రహ్మాండం
చైతన్యపు ఛిద్రిత భాండం
స్మృతి భావ శూన్య మస్తిష్కం
ఊసరం విరస పరిశుష్కం—
ఎక్కడ ఋతవేదపు ఋక్కులు ?
ఇవి అన్నీ గీతలు, చుక్కలు.
ఈ చవిటి చీకటుల లోకం

పండుతుందెలా ఆలోకం ?
లయనిద్రల రుద్రావని ఇది
పదముద్రల నిద్రావని ఇది.
సొలసిన స్వప్నాలకు శయనం
అలసిన అస్త్రాలకు అయనం.
ఒకటే ధ్రువమిక్కడ శోకం
సంతత నవమిక్కడ శోకం,
స్వరమొకటే రుదనోదారం
లయ ఒకటే హాహాకారం.
మారక తీరని దీ లోకం
మారని దొక తీరని శోకం.
హర్షం ? మిథ్యా సత్శూన్యం
నింపదు తథ్యానంతర దైన్యం
పాషాణికి జీవన మెక్కడ ?
పతితాహల్యా వన మెక్కడ ?
దేహపు చెరలో నరు డొంటరి.
క్రూరుడు కనుపించని కాపరి.
ఊపిరులే సంకెల లంకెలు
చెర గడువును కొలిచే అంకెలు.
దుర్గమ దిగంత ప్రాచీరం
నిర్గమ దృగంత ఘురతీరం
శ్రమసంగమ పారావారం
తమసావృత మగమ మపారం.
మణగే మిణుగురుల వివేకం
వివరించిన త్రోవ లనేకం.
తదుపరి సరిజూచిన హేతువు
శూన్యంలో గతజల సేతువు
మేధోజ్వల రోచిర్వీచులు
కడకన్నీ మృషా మరీచులు.

# వీడుకోలు

వీడుకోలు వేడుకలేని విశ్రాంతికి.
నిశ్చిత నిశ్చింత నిద్రలోని నిరపాయ మాయాశాంతికి
కానగల కబోది కనుల అర్థంలేని కృతకకాంతికి.
వీడుకోలును వేడుతున్నా.
ఇక్కడ ఉన్నన్ని నాళ్ళు —
తెలి వెలుగుల ఉలిపిరి జిలుగుపొరల అందాల్లో
విరి గోడల చెరసాలల ఉరితావుల బందాల్లో
మెరుగుపూత చిరునగవుల నెరనమ్మిన డెందాల్లో
బందీనై ఉన్నా లేనట్లున్నా.
పందలాగు కన్నా కననట్లున్నా.
వంతలేని వింతలేని కొంత బ్రతుకు
అర వలపుల కొర తలపుల పిరికి బ్రతుకు
చాలు చాలు — ఇంక చాలు ఈ మనుగడ
నేటితోటి ఇక విరగడ.
చిరిగిన తెరచాప గాని, విరిగిన చుక్కాని కాని
రానీ, రానీ పెనుతుపాను రాని.
చేర, రాని తీరం దూరాన గాని లేకపోని.
నడికడలిని పడవకొరకు పొంచి ఉన్న సుడులలోన
కానరాని ప్రవాహాల ప్రమాదాల వడులలో
అడుగడుగున చావు బ్రతుకు.
గడియ గడియ క్రొత్త జడుపు.
ఇచ్చట ప్రాణి ఉనికి మృత్యుఝంఝలో ఎగిరే ఎండుటాకు.
చండకాళి ప్రక్షోభపు పదతలాన శిశుశర్వరి పసిసారు.
ఎడతెగని కడలి హోరు — విడని చావు బ్రతుకు పోరు.
ఉత్తేజం, ఉద్వేగం, ఆవేశం, ఆవేగం
ఇదే పుట్టుక — ఇదే చావు — ఇదే అచ్చమైన ఉనికి.
గాలిమూల్గులో పిలిచే జలకన్యల ఆహ్వానం.

# అన్వేషణ

పెనుతుపాను చేతుల్లో చిక్కుకొన్న ఎండుటాకు
జీవితనదీ ప్రవాహాన పడిపోయే గడ్డిపోచ.
తన అగమ్యగోచరమౌ లక్ష్యానికి పయనించే
నా జీవిత శిథిలనౌక!
శాంతిలేదు క్షణమాత్రం నిలువలేదు అణుమాత్రం
జీవిత జ్వరపీడితమై ఉన్మాదపు అలలలోన
క్షణక్షణం మారుతోన్న పాడు పీడకలలలోన
పయనిస్తుం దెటనెటనో వెర్రి ఆశ! ఏమిటికో!
ఈ విశాల జగతిలోన సుఖశాంతుల అన్వేషణ!
మృదుల కుసుమదళాల్లోన ప్రాతఃమలయ వాయువులో
తేటమంచు చుక్కల్లో హిమమండిత శిఖరాల్లో
వనపథాల జనపదాల శాంతికొరకు సుఖంకొరకు
వెదకి వెదకి వేసారిన నా జీవితయాత్రకు ఇక
అంత మెచట? శాంతి ఎచట?
ఓ దేవా! ఓ బుద్ధా!
అర్ధనిమీలితాలైన నీ కనురెప్పల్లోపల
శాంతిసాగరపు వేళలు ఉంటాయని ఒక ప్రతీతి!
విశ్వజలధి మథన జనిత జీవిత హాలాహలాన్ని
గళములో ఇముడ్చుకొన్న శాంతిలోన మునిగియున్న
ఓ దేవా! నీలకంఠ!
ఆందోళిత విశ్వజలధిలో లేచిన తరంగాలు
నీ ప్రశాంతి పర్వతాన్ని ఢీకొని పడిపోతున్నాయ్!
శత సహస్ర క్రందనాల బాష్పాకుల మేఘమాల
నీ హృదయపు ఆకసాన్ని సోకలేక పొట్టివాని
లా చేతులు జాస్తున్నది తన నిష్ఫలయత్నంలో!
ఎక్కడిదా అమరశాంతి? ఎక్కడిదా అచలదీక్ష!
ఓ దేవా! నీలకంఠ!
ఆ ప్రశాంతి సాగరాన్ని చేరుకొనే బాట ఏది?
సుఖఃదుఖాల బాధలేని నిర్వాణపు త్రోవ ఏది?
మా జీవితప్రవాహాల గమ్యమేది? లక్ష్య మెచట?

# నీకోసం

నీ కోసం, నీ కోసం
సుప్త జీవితాబ్ధిలోన
నవజాగృతి బడబాగ్నులు రగిలాయి
మానవ హృదయపు వ్రణాలు
కింశుక ప్రవాళద్యుతిలో వెలిగాయి
నీ కోసం, నీ కోసం
అంధకార జడహృదిలో
చైతన్యపు మధుకీలలు మండాయి
ఆకాశోద్యానంలో
పూచిన సుమాలు తారలు
నీ కోసం, నీ కోసం
పూర్వ దిశాఫాలంలో
కుంకుమ ప్రకాశధారలు నీ కోసం
నీ కోసం, నీ కోసం
ప్రపంచ ప్రాంగణంలో
జన సమూహ కలరావం
నీ కోసం సంఘర్షం
మానవ రక్తస్రావం
నీ కోసం, నీ కోసం
ఆనందలహరి గానం
ఉద్వేగపు పవమానం
ఆది విశ్వ కటిమేఖల
హిమ ప్రస్తర సంవృతాబ్ధి
నిద్రిత పరమాణు వితతి
మృత్యు శీతలత్వ వ్యాప్తి.
చిరునగవులు విరియించని
కాలుని భ్రూ మేఘాల్లో

ప్రాణప్రద ప్రత్యూషగ
జీవితపు ప్రథమఘోషగ
ఉదయించిన నీ హాసం.
మా కోసం
సృష్టిని పుట్టించింది.
ఇపుడు మేము నీ కోసం
ప్రపంచాన్ని మారుస్తాం
దైన్యంగా విలపించే
జీవితాన్ని నీ కోసం
మళ్ళా నీ చిరునవ్వులు
కురిసేందుకు యోగ్యంగా చేస్తాం
శక్తిని పుట్టించలేని
రక్తిని కలిగించలేని
ఈ వంధ్యా జీవితాన్ని
మానవ ప్రేమార్ద్రంగా చేస్తాం.

# ఎవరో వస్తున్నారు

ఎవరో వస్తున్నారు —
            ఎవరు వారు ?
అనంతాంధ్యావృత నిశీథ గర్భంలో వేదనలా
కుహూరహో నీహార నిస్వన నయన రోదనలా
గాలిలో జాలిలా
తేలి తేలి సోలి తూలి నేల రాలే ధూళిలా
దిశాంతాల అనంత కాంతార శకుంతాల
అస్ఫుట స్ఫురిత గళ కలరుతాల భవిష్య రహస్య వసంతాల
మసృణ కుసుమ స్రజ రజఃపాళిలా విరాళిలా
గాలి వాలున పరిమళాల జాలులా జాలిలా
ఎవరో వస్తున్నారు !
నాకై తే తెలియదు కాని, ఎవరు వారు ?
అలసిన వాలుటాకుల, రాలుటాకులలోన గాలి
యుగయుగాల ఊడిగాల మ్రోడుల గోడుల ముసిరిన జాలి
దురాగత సాగరాల నిస్తంద్ర మంద్రఘోష
ఆదిమ తరంగాల తురంగాల ఫేనాచ్ఛన్న ఉద్ధత ఫేనోత్థిత హేష
దిశాంతాల నిశాంత తీర విస్తృత సంతమసాల స్వప్నోదంత కలరవాలు,
ఘూర్ణితార్ణవ గర్భంలో నిద్రిత విగతానాగత భవాలు
ఏదో ఒక అలజడిలా రెక్కల రెక్కల సవ్వడి, వడిగుర్రపు డెక్కల సడి
చీకటి ముసుగు రౌతులు, దూరాన కోట్లకొలది అడుగుల సందడి
నేనై తే ఎరుగను గాని ఎవరో వస్తున్నారు !
                        ఎవరు వారు ?
చీకటొకటే తెలుస్తుంది, చీకటి చీకటిలో కలుస్తుంది
చలిస్తుంది, జ్వలిస్తుంది, చీకటి చీకటిలో ఫలిస్తుంది
చీకటిలో చీకటిలా చలిస్తున్న నేను
నల్లని కాటుక సెగలా లోలోపల జ్వలిస్తున్న నేను

రాబోయే తుపాను సూచికలా
చీకటి ముసుగులో ప్రాకే విసూచికలా
అదృశ్య విషక్రిముల సంచలనం
చీకటి గాయాలలోన నల్లని కుళ్ళు మంటల ప్రజ్వలనం, సంక్రమణం
కుహేళికలో నెత్తుటి ప్రొద్దు నాలుకలా, కాళికలా
ఎవరో వస్తున్నారు —
నేనైతే ఎరుగని కాని, ఎవరు వారు ?

# హోరున వీస్తున్నది గాలివాన

నిర్జన పురవీథుల్లో
మరచిన మృతగాథల్లో
మానిన వ్రణబాధల్లో
స్మృతి క్రూరకరం కెలికిన విధాన
హోరున వీస్తున్నది గాలివాన.
జలజల రాలిన చినుకులు
వణికిన వెనుకటి కినుకల
కన్నీరుల తలమునుకలు;
శంకాపంకిల జీవితపథాన
హోరున వీస్తున్నది గాలివాన.
ఈ అజస్ర మహోధార
శోకాకుల వారిధార
పృథ్విని కనుచూపుమేర
క్రమ్మిన శీతలాలింగనాన
హోరున వీస్తున్నది గాలివాన.
జోరున పెరిగిన కెరటం
నావ తెగిన గాలిపటం
చిరిగిన పుస్తకపు పుటం
తప్పేదెలాగు జీవితపు ఆన
హోరున వీస్తున్నది గాలివాన.
ఓ వ్యర్థ సాహసికుడా !
నడిసంద్రపు నావికుడా !
ఓ ఒంటరి మానవుడా !
నీపై పగబట్టిన గాలివాన
హోరున వీస్తున్నది మత్సరాన.
ఎక్కడ ఆశ్రయమిప్పుడు
భ్రమ ఆ తలుపుల చప్పుడు
వేచి విసిగి నీకై కొడి
గట్టిన దీపపు మసిలా జగాన
వీస్తున్నది చీకటి గాలివాన.

# జయ 'దేవానాంప్రియ'

శాంతి సాగరోద్గత కౌస్తుభ ! జయ, జయ భవార్తవారుణ పలాశమా !
జయము కోటి శిశువుల ఆనందపు ప్రోజ్వల ముక్తామ్లాన హాసమా !
జయము హైమగిరి రజతశిఖరమున ప్రతిభాసించిన సూర్యకిరణమా !
నిరత ముఖరమై వర్ధిల్లుము, ఓ నవయుగ వైతాళిక గాయనమా !
తావక మంగళమయ మార్గమ్మున పరచుకొనును అగణిత
దృక్సుమములు,
సుమనస్సురభి రజోవాసితమగు ధౌత రజతగిరి ధూళి భ్రమములు.
రెక్కలుచాచిన శాంతివిహగమై నీ విమానమెగురును లోకముపై.
దాని చాయలో మానవులందరు నవ్యసృష్టి చేతురు శోకముపై.
రాష్ట్రి - వాద - గత రాగ - ద్వేషములకుమించి మానవమర్యాదలు
శస్త్ర ఝుంకృతిమించి లోకములు వినును అబలజీవుల పిరియాదులు.
రాష్ట్రి - పితృ - స్వప్నావళి నీ ఈ సుదృఢ హస్తములచే రూపొందును.
అమ్లానమ్మాదర్శము, ఆశల మొక్కవోని పదనులు వెలుగొందును.
కోటి కోటి మానవుల అర్చనల దీప్తినందు ఓ పుణ్యధామమా !
హే ! మధ్యమ ఋజుపంథాగ్రేసర ; ఏకైకా దక్షిణావామమా !
కోటి కోటి జఠరానలార్చికా ! కోట్లకొలది అధరాల దాహమా
కోటి కోటి నయనాంబుజ విగళిత కరుణాశీతల వారిహావామా !
సమాశ్వస్త భీతావని జయహే ! సత్యాహింసల మంగళదూతా !
జంగమ సంగమ వల్లీన కృత భావి వర్తమానాంచిత భూతా !
మంగళమగు గావుత మార్గమున నీ అడుగుల సడిలో సంగీతం
మేలుకొలుపు రేతిరి కనురెప్పల క్రొవ్వెలుగుల క్రొంగ్రొత్త ప్రభాతం.
మరకత దూర్వాదల భూషితమై పచ్చపచ్చనగు ధరణీవక్షము.
గరళదగ్ధ హింసా శిలీముఖము నిత్య విఫలమగుగాత విలక్షము.
భారత భువి ఛాత్రమగుట విరహిత సమ్రాట్టూ ! జయ దేవానాం ప్రియ !
తెరచిన విశ్వహృదయ దేహలిలో కాలిడిరమ్మ, శుభమ్మగు, జయ, జయ!

# జనం గెలుస్తారు!

విప్లవానికి దొడ్డిగుమ్మం లేదు,
అన్నా అది పాలకులు, రాజస్యాలకులు తెరిచేది కాదు.
అమెరికాలో తిరిపెమెత్తుకొనేవారు,
అకలిగొన్న ప్రజల ఆర్తి తీర్చలేరు.
ఇన్నాళ్ళకు చెర తలుపులు తెరచినవారు,
దీనుల దారిద్ర్యపు చెర తలుపులు తీయలేరు,
భారతదేశమనే చెర తలుపులు తీయలేరు.
అవి తెరవవలసినవారు,
జన నాయడులైన మీరు.
అధికార దురహంకారపు కంచుకోట బ్రద్దలుకొట్టి
మృత్యు శిఖర చరమాగ్రాన
రుధిరోజ్వల విజయధ్వజం ఎగురవేసి వచ్చినవారు
జన నాయకులైన మీరు!
మీకై వేచి ఉన్నది జనత,
మోడుదారిలో గుండెల్లోన జీవం పొయ్యాలి మీరు,
ఆశాభావం పొయ్యాలి మీరు,
నిదురమత్తు వదలగొట్టి ముందుకు నడిపించాలి.
దుశ్శంకల సంకెలలను విడిపించాలి.
దెబ్బకు గాని దడవని దెయ్యాలను జడిపించాలి.
మీరు జైళ్ళలోన సుగ్గి మ్రగ్గిన రోజుల్లో
మిత్రవ ముగ్గులోన నిలచిన మొనగాళ్ళ మగటిమి
అగ్గిలాగు నిగ్గు తగ్గని రోజుల్లో
పిశాచాలు వేదాలు వల్లించాయి,
ఘూకాలు శ్లోకాలు చదివాయి,
కొంగలు దొంగజపం చేశాయి,
మొసళ్ళు కన్నీరు కార్చాయి,
నక్కలు వినయం చూపించాయి,

తోడేళ్ళు జాలి ఒలికించాయి.
బోనులోన చిక్కిన సింహాలను చూసి
గ్రామసింహాలు వెక్కిరించాయి.
దేనినీ మరువరాదు.
ద్రోహానికి తలుపులు తెరువరాదు.
మా దండి ఫార్గే అల్లికలో
మృత్యువు శాసనాలు లిఖిస్తోంది.
గోడలమీద రాత కన్నులు గలవాళ్ళకు కనుపిస్తోంది.
మీరు మీ నెత్తుటితో ద్రోహుల మరణశాసనం
జనతా విజయశాసనం లిఖించారు.
జనమే నిలుస్తారు.
కడకు జనమే గెలుస్తారు.
చిన్ని చిన్ని చెరల తలుపులు తెరచారు,
కాని భరతఖండమనే విస్తృత కారాగారపు తలుపులు తెరవాలి మీరు.
విప్లవ శిల్పులుగా జీవంలేని శిలలకు జీవం పోసినవారు,
కరడుకట్టిన గుండియలో భావం పోసినవారు
శిలకొక నాలుకగా, తలకొక నాలుకగా,
ప్రజాహృదయ నయగారా భీషణ ప్రళయ
ఘోషల రావం పోసినవారు
మిత్తవ కంచుకోట బ్రద్దలుకొట్టి
అధికార దురహంకార శిఖరాగ్రాన
రుధిరోజ్వల విజయధ్వజం ఎగురవేసి వచ్చారు.
జన నాయకులు మీరు - ఇదే జనుల జోహారు.

# సుగత స్తవము

బహుళ హింసా ప్రతప్త ప్రపంచపథము
పెదవి తడియారు, నాలుక పిడుచగట్టు
కాలు కాయమ్ము, మిరుమిట్లు కనుల గొలుపు
ఎండమావుల దగ తీరుపెటుల నొక్కొ.
దప్పిదీర్చుకో జాతుమా, దప్పి పెరుగు
తృప్తి కాశించినంత యతృప్తి పొసగు
తప్త మానవ హృన్మరుతలము తాకి
పారునెన్నడు కరుణాచ్ఛ వారిధార ?

చూడుమదే, భవాబ్ధి పొడసూపిన హాలహలంపు కీల దో
గాడి విరూప కాల కటుకాంతుల నొందె సితాంబరము, అ
ల్లాడెడు దిక్తటాల మృదులాస విలాసము లింకిపోయె ను
త్పీడిత భూతచేతముల భీతిని బాపెడి నాథుడెక్కడో ?
జ్వాలల బుట్టు దేహమిది జ్వాలల మెట్టును, మెట్టినంత నా
జ్వాలల గిట్టిపోవు, శిశువాదిగ జర్జర వృద్ధు దన్క నా
జ్వాలలు జుట్టియుండు, భవ జ్వాలల మాలిక సర్వజీవ సం
ఘాల కవార్య భూషణము, కాలుని గ్రాసము కాని దెద్దియో ?

ప్రాతరుదిత స్వర్ణధౌత కాంతుల వెన్క
రగులు సాయంకాల రక్తశిఖలు
ప్రౌఢాహ్న చండాతాప స్వచ్ఛ హృదియందు
ఇరవొందు నడిరేల ఇరుల కందు
మధుమాస సుధలీను మదిరగంధము దాగి
చనుదెంచు హేమంత జరఠ క్రాంతి
క్షణదాక్షణిక విలక్షణ దీప్తి చన్నంత
దట్టమౌ చీకట్ల చెట్టు చాయ
ముగ్ధ పిక కంఠమంతలో మూగబోవు
తలిరుటాకుల రసమేది ధరణి రాలు

నిన్న గెరలిన క్రొన్నన కన్నెలొక్క
నిశ్వసన మేని గాలులనించి చనవు.
తావుల దేలిపోయి చలితానిల వీచుల, రాలిపోవు నా
తావులఁ గన్న పూవులును, తావుల పూవుల వెన్కఁగూలు పూ
దీవెలు వ్రాలి పోలి నలుదిక్కుల మోహ మహోగ్ర మేఘ గ
ర్జా వికటార్తి దక్క, గనజాలము జీవనబిందు వొక్కటేన్.
కాలవ్యాళ కరాళ పూత్కృతులచే కంపించు నీ విశ్వ మా
భీలజ్వాల నభంలిహోగ్ర రసనల్ పెల్లార్చు, కల్లోలి తో
త్తాలోద్దామ విభీమధూమ నిపతచ్ఛాయార్త, ఘూమ్యాంబ రాం
దోలత్కాళియ నీలదేహ రుచులన్ దోగాడు కాళిందినా.
చరణాక్రాంత ధరాభృదుద్ధత రజస్పందిగ్ధ దూర్వాక్షి భీ
కర వక్షస్థ నృముండహార వికటోద్ఘర్షోగ్ర రావార్త ది
క్కరి సంఘమ్ము, చలోర్ధ్వ బాహుయుగళా ఘాతాధ్వ్రస్తోడ శీ
కర సంఘాతము, దిగ్భ్రమాభల నటత్కాలాగ్ని కాళీచ్ఛవిన్.
చిర ధూమాయిత విశ్వయష్టికిది ఉజ్జీవాగ్ని సంప్రీతి, సం
సరణాంభోనిధి గర్భశోక శతధా సంస్ఫోట సంఘాత వి
స్ఫురదుద్వేగ ప్రవేగ రాగరుచితో పూరించు నాశాంతముల్
తరణోపాయము లేదు, లేదు తటమే, తథ్యమ్ము నర్తించెడున్.
దుస్తర రక్తవీచికల దూగెడు జీవిత భగ్నయానముల్
ధ్వస్త ప్రమోదవాటికలు త్రాగెడు తిక్త దివాంధ గానముల్
ప్రస్తరసౌధ గేహతులు రాగిలె ప్రార్థిత మస్తకా హతిన్
గ్రస్త మనుష్య భాగ్యరవి క్రాగెడు స్వీయ మరీచికా చితిన్.
లోకాల శోకాల భీకరోద్రేకాలు
పోకార్చి సాకంగ బూను నెవడు
కాలకంఠుని బోలి కాలకూటము గ్రోలి
కాలిగోటను మీటు కాలు నెవడు
సందేహ సమ్మోహ మందేహ విద్రోహి
సందోహమున్ జెండు బందు గెవడు
మసి జిందు నిసియందు దొనగొందు కసుగందు

దెసనిండు స్మితమందఁ దేర్చు నెవడు
ఎవని పదధూళి సోకి రాలింతులగును
హాసమరసిన హిమము జాహ్నవిగఁ బారు
ఊర్పులెవని విభ్రాంతి మేఘోగ్ర పటలి
జీర్ణ జడపర్ణముల కగు జీవ ఝంఝ

అసహాయుండు మనుష్యుడీ జగతిఁ నైరాశ్యాంధ కూపస్థు దే
దెస బోనేర్చును, జీవిత ప్రవహనార్తింబాయ నెట్లిచ్చుటన్
గృషియించున్ దనలోనఁ దాను, తలపై గోరంత కొండంతలై
కసిఁ వీచు న్నిఖిలావహాపహములై కల్పాంత వాత్యాహతుల్.
తాఁ సృష్టించిన శక్తులే తనుం పాతాళానికిన్ ద్రొక్కఁ దా
నే సాహాయ్యము గోరు, నేపద సాన్నిధ్యమ్ముపేక్షించు, సం
త్రాసా రావము దిక్తటాంతరములన్ రాపాడి ఏతెంచు, లో
కేశ క్రూర శిలాహృదుద్గత దిశోత్కీర్ణాట్టహాసార్భటిన్.

దీనుల హీనధ్వానము
వీనుల జొరరానిచోట, వేడ్కన్ సౌఖ్యా
సీనుండై ఏ సూనరి
ఈ నరుల దురంతబాధ లింపుగ గ్రోలున్.

## ఒకే సత్యం

సర్వమసత్యం, ఒకటే సత్యం
ఎల్లబాటలూ వల్లకాటికే,
ఓటమి తథ్యం, ఓటమి సత్యం
అన్ని పాటులూ భంగపాటుకే.

# ఆవాహన

లేవయ్యా! నవకవీ! యువకవీ!
సమతా దీక్షాపర భైరవాహన సంరంభ సంభవకవీ!
సంజీవన ప్రణవకవీ! భీషణ న్యాయాశని గర్జనా విభవకవీ!
తరుణారుణ బల రుధిరాసవకవీ! నవకవీ లేవయ్యా! లే!
శాశ్వత స్వాతంత్ర్య స్వప్నద్రష్టా!
వాస్తవ వ్యవహార విశ్వస్రష్టా!
దుష్టశక్తులు చెలరేగాయి
వ్యష్టిని సమష్టి పిలుస్తోంది లేవయ్యా! లే!
ఎన్నాళ్ళు దాచుకొంటుంది ఉష్ట్రపక్షి శిరస్సు?
ఎన్నాళ్ళు చేస్తాడయ్యా ఒకమేని తపస్సు?
ఎన్నాళ్ళు గోళ్ళు గిల్లుకొంటూ కూచోవడమిక?
ఊరక వాపోవడమిక?
అటుచూడు మరల నరకపు
మరకల చీకటిచెర మరతలుపులు కిర్రుకిర్రుమంటున్నయ్.
అటుచూడు మరల పొగలో.
క్రూరజంతువుల బారులు గుర్రుగుర్రుమంటున్నయ్.
ఇనుపరజనులా రాలే మలిసంజ మంచుపొగలో
నైరాశ్యం గిట్టినప్పటికిని ఆశ పుట్టని ఈ వెలుగులేని సెగలో
నింగి గుండెల పొంగిన కండరాల్లో ప్రేవుల నేలమాళిగలో
గణగణా, గణగణా, మ్రోగుతోంది గంట
భుగభుగా, ధగధగా, రేగుతోంది మంట
కోతకు వచ్చిందయ్యా పాపాలపంట.
గాండీవపు నారి సారించు, పూరించు పాంచజన్యం
గర్జన్య పర్జన్యంలా మేల్కొంటుంది జనసైన్యం
గడగడ హడలుతోంది దౌర్జన్యం, విడిపోతోంది మడికట్టిన దైన్యం.
ఎక్కడున్నారు కవులు, రచయితలు, మేధావులు, బుద్ధిజీవులు
బూజుపట్టిన గ్రంథాలయాల గనుల్లో, పరిశోధనశాలల్లో

పత్రికల ఆఫీసుల్లో, నాటక, సంగీత, నర్తనశాలల్లో
ఊహాస్మరణ శక్తుల అంతులేని చేలల్లో ఒంటరిసేద్యం చేస్తూ
సత్యసౌందర్యాల శైవ నైవేద్యం మోస్తూ, ఎక్కడున్నారు ?
బయటకు రండి ! ముందుకు రండి ! విస్తృత వసుధ మీదకు.
ఇంటికి నిప్పంటుకొంది, తరతరాల పంటకు నిప్పంటుకొంది.
గంట మ్రోగుతోంది, మంట రేగుతోంది.
ద్రోహానికి, సందేహానికి, మాయామోహానికి తావులేదు
సత్యప్రవాహానికి, మానవస్నేహానికి, స్వాతంత్ర్యప్రవాహానికి చావులేదు.
ముందుకు రండి, కార్మికులు, కర్షకులు.
నకించనులు, క్షుధాధనులు, వ్యథాఖనులు
దినదినగండంగా అఖండ భూఖండంమీద
గనుల్లో, వనుల్లో రకరకాల పనుల్లో
వెచ్చని ఎడారుల్లో, పచ్చని మైదానాల్లో
కొండల్లో, లోయల్లో, అసంఖ్య జనపదాల
నరసాగర సరినిర్ఝర పరితటాల, లక్షలకొలది, కోట్లకొలది
నల్లవారు, తెల్లవారు, పచ్చవారు, రంగురంగులవారు.
దేశభాషల, వేషభూషల జాతుల మతాల మిథ్యా వివక్షతలు
కల్పితపు సరిహద్దుల ముళ్ళకంచెలు, గళ్ళ తడికెలు దాటి
అజ్ఞానాంధ స్వార్థ ద్వంద్వపు దుర్గంధిత బంధనాల నధిగమించి
శ్రమించి, విక్రమించి వామన చరణాల్లా
భూమిని ఆక్రమించి, మించి, ముందుకు రండి
ప్రళయ పయోధి నాశ్లేషించి ఘోషించే
ప్రభంజన సంజనిత పయోధరయోధుల్లా
శాబక సంరక్షణాసన్నద్ధ వ్యాఘ్రంలా, కృద్ధాత్యుగ్ర పాశుపత శరాగ్రంలా
బ్రహ్మాండాన్ని వజ్రమండల పరిధిని పరివేష్టించే
మణిమండిత కోటికోటి కాల ఫణజాలంతో విద్యుచ్ఛటలు సృష్టించే
మదోన్మత్త నర్తనమగ్న మహాఫణిలా,
దావా దందహ్యమాన వనిలా, తరణిలా
ముందుకు రండి, మండించండి, లెండి, నడవండి !

జనం, జనం, మహాజనం
కనులపండువు, వీనులవిందు, విశ్వరూప సందర్శనం
ఎటుచూస్తే అవే తలలు
ఎటుచూస్తే అవే అలలు
జ్వాలలుగా, మాలలుగా హేళాభర ఖేళనతో
ఒడ్డులొరసి పారుతున్న మహాప్రవాహంలా
అనితరసాధ్య సాహసంతో అవిచ్ఛేద్యవ్యూహంలా
ముందుకురండి కమ్మకోండి మిడతలదండులా భూమినంత.

# వర్షాయామిని

మేఘాల మోహాలు ముసురుకొను నీరేయి
వీడి క్రొమ్ముడి చెదిరి క్రమ్ముకొన్నవి కురులు
నల్లత్రాచుల వోలె ఒల్లమాలిన ఇరులు
చూపులందని పొరల చీల్చి మూగిన మరులు
ప్రాత తలపులు గుబులుకొన్నవీ పయ్యెదల
ఊర్పు తావులు కొసరి విసిరి చను నీరేయి,
మేఘాల మోహాలు ముసురుకొను నీరేయి.
ఆకాశదీపాలు ఆరిపోతున్నాయి
తెగిన ముత్తెపుసరులు జారిపోతున్నాయి
రేగనుల నీలాలు కారిపోతున్నాయి
దెసల చెక్కిలినంటి కారుకాటుక చాయ
నొసటి వ్రాతలు చెరిగి చెమరుకొను నీరేయి.
మేఘాల మోహాలు ముసురుకొను నీరేయి.
మెరుపు మెరిసినచోట తెరచి మూసిన తలుపు
చిమ్మచీకటి బాట చేరనీయదు మలుపు
ఈరేయి మీటినది ఏనాటిదో పిలుపు
మతుల తీగెల నూపి, స్మృతుల గాయము రేపి
వెతల క్రొంజివురులను పసరుకొను నీరేయి.
మేఘాల మోహాలు ముసురుకొను నీరేయి.

# జ్యోతి!

జయము నీకు ఓ జీవజ్యోతీ!
అంధకారబంధుర భవపథమున
అరుణకిరణ తోరణయుత రథమున
వడివడిగా పరుగిడి యరుదెంచెడి
దివ్యజ్యోతీ! భవ్యజ్యోతీ!
సఘన తిమిర ఘన ఘటా పటలమున
విష కలుషావిల నైశ నిటలమున
కాంచన కాంతితిలకమై భాసిలు
శైవజ్యోతీ! జీవజ్యోతీ!
జనగణ ఉషస్సు మనసాసనమున
మధుర మదాస్వాదన వ్యసనమున
మైమరచిన హేమ భ్రమరమ్మగు
భావజ్యోతీ! జీవజ్యోతీ!
తావక హసన పరవశాఖిల భువి
భువనమోహనము నీ దివ్యచ్ఛవి
తద్వాకర్షణము అనివార్యము ఓ
రమ్యజ్యోతీ! ధర్మ్యజ్యోతీ!
విలసిల్లుము మా హృదయేందిరపై
దినదిన నవనూతన సుందరివై
జన నందన వందనములు నీవే
పూతజ్యోతీ! ధౌతజ్యోతీ!
జయము నీకు ఓ జీవజ్యోతీ!

# నాకు చావులేదు

మృత్యువును చూసి కాదు నేను, జీవితాన్ని చూసి జంకుతున్నాను
హంతకుని కత్తి చూసి కాదు, కనుల ద్వేషం చూసి గొంకుతున్నాను
మనసులోని క్రౌర్యం చూసి జంకుతున్నాను.
గుప్పెడు మమ్మలోన మృత్యువుంది
పిడికెడు బూదిలోన మృత్యువుంది
రక్తమాంసముల దేహపు అణువణువున, కణకణాన,
క్షణక్షణాన మృత్యువుంది.
చూపులోన రూపులోన, మరుడుచేయు తూపులోన
ప్రీతిలోన భీతిలోన, పృణ్యాప్రసవ గీతిలోన మృత్యువుంది.
పువ్వులో పురుగులాగు
తీయని తెలినవ్వుల్లో నురుగులాగు మృత్యువుంది.
మృత్యువు లేనిచోటు చెప్పు, మనకచట ఉనికి ఏర్పరుస్తాను,
పారిజాతపు పూవులు చల్లి స్వర్గం సృష్టిస్తాను.
నేస్తం! నేను ప్రతిక్షణం మృత్యువుతో పరియాచికాలాడుతూనే ఉన్నాను
జీవితపు పణమొడ్డి పాచికలాడుతూనే ఉన్నాను.
కాని మృత్యువు ప్రతిక్షణం ఓడిపోతూ ఉంది.
నన్ను వీడిపోతూ ఉంది.
నా శిలువ నేనే మోస్తున్నాను.
వధికుని వేయికనులతో వెదుకుతూ వస్తున్నాను.
భీష్మునిలా నా మరణ రహస్యాన్ని నేనే వెల్లడిస్తున్నాను.
ఉత్తరాయణం కొరకు స్వేచ్ఛామరణం కొరకు ఎదురుచూస్తున్నాను.
మరణాన్ని చూసి నాకు భయమెందుకు ?
తెరచిన చెరతలుపు వంటిది మరణం
విసిగిన బాటకు క్రొత్తమలుపు వంటిది మరణం
దూరపు వలపుపిలుపు వంటిది మరణం

అయినా ఒకటి చెబుతున్నాను. విను — నాకు చావులేదు.
నే సృజించిన అనంతజీవన వసంతవనంలోన చావుకు తావులేదు.
నేను మానవుణ్ణి.
ప్రాణదాత్రి, పుణ్యధాత్రి కనకగర్భ సముద్భవుణ్ణి.

వేదనాగ్ని సంభవుణ్ణి, భవుణ్ణి
నిత్య పునర్నవుణ్ణి, మానవుణ్ణి
నాకు చావులేదు.

బ్రహ్మాండపు పురిటిగదిలో కెవ్వుమనే పసిఏడుపు వినిపించినంతవరకు
బాలింతల చెక్కులపై పచ్చనిచేల పసిమి మిసిమి కనిపించినంతవరకు
ప్రణయ మహావాహినులు ప్రియసాగర పరిణయానికి
పరుగులిడినంతవరకు
మరణ కాళియ ఫణాగ్రాల గోపాలుని పద నఖ స్మృతి
మెరుగులిడినంతవరకు
క్రొంజివురు టాకులపైన సంజల పసిడి లే ఎండలు
తళతళమనినంతవరకు
నీటిలోన రూపుచూసి మురిసే కిరణాల కసులు మిలమిలమనినంతవరకు
విలయ ఝంఝూ విక్షుభిత మహాసింధుతీరాన
ఆడుకొనే పసిపాపల కేరింతలు, చప్పట్లు వినిపించినంతవరకు
జీవన శోకాశ్రు ప్రఖర నిర్ఝరాల మేలమాడే రుచిర మరణ మందస్మితి
భూ దివాలకు భవ్య శక్రచాపసేతువు వెలయించినంతవరకు

నాకు చావులేదు
నేను మృత్యుంజయుణ్ణి
మా న వు ణ్ణి.

# ఉరుము చెప్పినది

(టి. యస్. ఇలియట్ వ్రాసిన 'వేస్ట్ లేండ్' చివరి భాగానికి అనువాదం)

చెమర్చిన మొగాలపైన కాగడాల అరుణకాంతి
ఉద్యానవనాల్లోని హైమాహత ప్రశాంతి.
శిలాప్రాంతాల యమయాతన,
అరుపులు, కేకలు, అరణ్యరోదన,
చెరసాల, రాచనగరు, ప్రతిధ్వనులు
సుదూర శైలశ్రేణిపై ప్రథమమేఘగర్జన
బ్రతికిఉన్నవాడాతడు చనిపోయాడు
బ్రతికిఉన్నవాళ్ళం మనం చనిపోతున్నాం
కొంచెం ఓరిమితో.

*

ఇక్కడ త్రాగేందుకు నీళ్ళేవి బండరాళ్ళు,
కటికరాళ్ళు, నీరెక్కడ, ఇసుకత్రోవ
పర్వతాలపై చుట్టుక ప్రాకే త్రోవ
శుష్క, ముష్కర, శిలాసంకట శైలశ్రేణి
నీరుంటే సేద తీరేవాళ్ళం త్రాగి,
బండలపై ఆలోచించటమెలా ఆగి ?
తడియారిన చెమట, ఇసుకలో కూరుకుపోయే కాళ్ళు.
నీరుంటేనా ? ఆహా ! బండరాళ్ళు !
ఉమియలేని పిప్పిపండ్ల గిరిముఖ మృతగహ్వరమిది !
కూర్చునేందుకు, ఇంచుక విశ్రమించేందు కెక్కడ వ్యవధి ?
పర్వతాలలో ప్రశాంతి కూడా లేదు.
పరిశుష్కవిఫల వంధ్యా మేఘగర్జన, వర్షపుజాడ లేదు.
కొండలలో ఏకాంతం కూడ లేదు.
పగిలిన, నెగిలిన మట్టిఇళ్ళ బొరియల్లోంచి
కరువబోతయ్ ఎర్రమూతులు కోపంతో వెక్కిరించి.

*

IV

ఈ బండరాళ్ళుకాక నీళ్ళుంటే
ఈ బండరాళ్ళున్నా నీళ్ళుంటే
నీరు ! నీరు !
ఒక సెలయేరు !
రాళ్ళమధ్య
చిన్న దొరవు !
జల జల జల నీరుపారే శబ్దమున్నా
ఎండుగడ్డి గలగల, కీటక క్రేంకారం కాక
రాళ్ళమధ్య నీరుజారే శబ్దమున్నా !
దేవదారు చెట్ల మధ్య జలపక్షుల
కుహూ, కుహూ, కుహూ, కుహూ కూజితాలున్నా బావుండేది ?
కాని ఎక్కడ ? నీరెక్కడ ?

*

నీప్రక్కను నడుస్తూ డెల్లప్పుడు; ఎవ్వడా మూడోవాడు ?
నీవు నేను మాత్రముంటాం, నేలెక్క వేసినపుడు
కాని శ్వేతమార్గంమీద ముందుకు చూసినపుడు
నీప్రక్కను నడుస్తూ డెల్లప్పుడు ఇంకొక్కడు;
బూదిరంగు దుప్పటిలో ముసుగువేసుకు ప్రాకుతూ
ఆడదో, మగవాడో తెలియదుకాని,
ఎవరది నీకావలప్రక్క ?

*

ఎత్తుగా గాలిలో ఏమిటా మహాశబ్దం ?
మాతృగర్భ శోకాల కలవరం !
ఎవ్వరా ముసుగు రౌతులు గుంపులు గుంపులుగా
అంతులేని మైదానాల్లో,
పరిశుష్క క్షితిజమాత్ర పరివేష్టిత
విదీర్ణ వసుధావక్షంపై పడి లేస్తూ పోతున్నారు ఎవరువారు ?
ఏమిటా మహానగరం కొండలపైన ?
పగుళ్ళు, మరమ్మతులు
వినీలవాయువులో విస్ఫోటాలు.

V

పతనోన్ముఖ గోపురాలు
ఎరుషలేము, ఏథెన్సు, అలెగ్జాండ్రియా
వియన్నా, లండన్.
మిథ్య.
ఒకస్త్రీ తన సుదీర్ఘ శ్యామల కుంతలాలు గట్టిగా లాగిపట్టి
ఆ తంత్రులపై రహస్య సంగీతం పలికించింది.
నీలి వెలుగులో పాపల ముఖాల గబ్బిలాలు
ఈలవేసి రెక్క లల్లార్చినవి.
తలక్రిందులుగా క్రిందకు ప్రాకినాయి నల్లని గోడలపై.
గాలిలో తలక్రిందులైనాయి శిఖరాలు
కాలాన్ని సూచించిన జ్ఞాపకాల ఘంటలు మ్రోగిస్తో :
ఎండిన తోట్లలోంచి, పాడునూతుల్లోంచి
పాడినాయి కంఠాలు.

*

కొండలమధ్య ఈ మురుగు బొరియలోన
పేల వెన్నెల, పాడుతున్న గడ్డిదుబ్బులు
శిథిల సమాధులమీద గుడిదగ్గర
(అక్కడొక పాడుబడిన గుడి ఉన్నది.)
గాలిమాత్రం నివసిస్తున్నది.
ఆగుడికి కిటికీల్లేవు, తలుపులు ఊగుతున్నవి.
ఎండు ఎముక లెవరినేమీ చేయలేవు.
కప్పుపైన గుంజపైన
కోడిపుంజు మాత్రమొకటి నిలుచున్నది.
"కొక్కొరొకో, కొక్కొరొకో !"
మెరుపుల కాంతిలోన, అప్పుడొక తేమ గాలి
తెచ్చింది వర్షాన్ని.
లోతుకుపోయినది గంగ, వాడుటాకులు
వేచియున్నవి వర్షంకొరకు; ఈలోపున
సుదూర హిమవత్ పర్వతంపైన
కారునల్లని మేఘాలు ప్రోగైనయ్ !

VI

మహావనం పొంచియున్నది నిశ్శబ్దపు చీకాటున.
అప్పుడు పలికింది ఉరుము.
ద.
దత్తా ! ఏమిచ్చాం మనం ?
నేస్తం, నాహృదయ రక్త సంచలనం.
ఒక్క క్షణపు ఆత్మార్పణలోనున్న సాహసాన్ని
ఒకయుగపు వివేకమైనా మరలించలేదయ్యా !
దీనివలన, దీనివలనే బ్రతికాం మనం
కాని ఇది మన మృత్యుగాథల్లో
మేలుచేసే సాలీడు అలంకరించిన జ్ఞాపకాల్లో
మనఖాళీ గదుల్లో, బక్కపలుచటి న్యాయవాది
పగులగొట్టే సీళ్ళల్లో, పొందబడదు.
ద.
దయాధ్వం. ఒక్కసారి విన్నా నేను తాళంచెవి
తాళంలో తిరగటం, ఒకేసారి.
అందరం తాళంచెవిని గురించి ఆలోచిస్తాం;
ఒకొక్కడు తనచెరలో.
నిర్ధారణ పరుస్తాడు ఆలోచనద్వారానే,
ఒకొక్కడు ఒక్కచెరను.
రాత్రిపూటమాత్రమే గాలిలో గుసగుసలు
ఒక్కక్షణం మేల్కొలుపుతాయి భగ్నకారి యోలెనస్‌ను,
ద.
దమయతా !
తెరచాపల తెడ్లసంగతి తెలిసిన హస్తాలు
చెప్పినమాట వింటున్నది పడవ సంతోషంగా,
ప్రశాంత సముద్రంలో, ఆహ్వాన మందినపుడు
నీహృదయంకూడా సంతోషంగా
చెప్పినమాట వినేదిగదా? అదుపుగల
చేతులకు ఆజ్ఞానువర్తినిగా స్పందిస్తూ.

VII

ఒడ్డున కూర్చున్నాను చేపలు పట్టుకొంటూ,
నా వెనుక ఎండిన మైదానం
ఇక నారాజ్యాలను చక్కదిద్ధుకొనేదా ?
లండన్ వంతెన పడిపోతోంది; పడిపోతోంది ! పడిపోతోంది !
ఈతునకలు దరిజేర్చానా ధ్వంసంతో పోరి;
షంకేం, నేను నీకు సరిపోతా ! హిరోనెమోకు మళ్ళీ పిచ్చెత్తిందట.
దత్తా. దయాధ్వం, దమయతా.

శాంతిః, శాంతిః, శాంతిః !

# చీకటి

(టి.యస్. ఇలియట్ వ్రాసిన 'ఈస్ట్ కోకర్'లో మూడవభాగం)

ఓహో ! చీకటి, చీకటి, చీకటి, అంతా పోతున్నారు చీకటిలోకి
గ్రహాంతర శూన్యంలోకి ; శూన్యం కలుస్తోంది శూన్యంలో.
పరిశ్రమల కప్తానులు, బ్యాంకర్లు, ప్రముఖ సారస్వత సేవకులు
అధికారులు, రాజకీయ ధురంధరులు, పోషకులు, మహారాజపోషకులు
ఖ్యాతి నొందిన ఉద్యోగులు, అనేక సమితుల అధ్యక్షులు
పరిశ్రమల ప్రభువులు, చిన్న కాంట్రాక్టర్లు అంతా నడుస్తున్నారు చీకటిలోకి.
చీకటిలో మాయమౌతారు సూర్యచంద్రులు, కుప్పావారి పంచాంగం
స్టాక్ ఎక్స్ఛేంజి గజెట్, నిర్దేశకుల నిర్దేశిని అన్నీ చీకటిలోకి.
చల్లబడిన ఇంద్రియజ్ఞానం, పోయిన కర్మప్రేరణ
మనం కూడా పోతాము వారితోబాటు, మాటల్లేని దహనసంస్కారానికి.
కాని అది ఎవరి దహనం కాదు, దహనం చెయ్యటాని కెవరూలేరు,
నేను నా ఆత్మతో అన్నాను—కదలకు! చీకటిని రానివ్వు నీ మీదకు,
ఆ చీకటి భగవంతునిదౌతుంది—నాటక భవనంలో
దీపాలార్పేస్తారు దృశ్యం మార్చటానికి, రెక్క లల్లార్చిన
రిక్తరావంతో, చీకటిలో చీకటుల కదలికలా.
మనకు తెలుసునపుడు, ఆ కొండలూ, ఆ చెట్లూ, ఆ సుదూర దృశ్యాలూ
ఆ భవ్యభవన సమ్ముఖ భాగాలూ, అన్నీ మడచి తీసుకెళ్ళుతున్నారని
లేక భూగర్భ సొరంగంలో రైలు రెండు స్టేషన్లమధ్య మరీ ఆగినపుడు
సంభాషణ సాగి సాగి నిశ్శబ్దంలో చెరగిపోతుంది. ప్రతి ముఖంలో నీకు
మానసిక శూన్యం పెరిగి, ఆలోచించటాని కేమీ లేదనే
భీతి మాత్రం కనిపిస్తుంది.
లేక మత్తు ఇచ్చినపుడు మనస్సు చేతనమైనా,
శూన్యంలో చేతనమై ఉన్నట్టుల.
నేను నా ఆత్మతో అన్నాను—కదలకు, వేచియుండు, ఆశ లేకుండానే
ఎందుకంటే, ఆశించదగనిదాని యందుంటుంది ఆశ;
వేచి ఉండు ప్రేమ లేకుండానే.

IX

ఎందుకంటే ప్రేమించదగనిదాని యందుంటుంది ప్రేమ;
ఇంకా విశ్వాస మొకటి ఉంది కాని,
విశ్వాసం, ప్రేమ, ఆశ, అన్నీ వేచి ఉన్నాయి.
ఆలోచన లేకుండా వేచి ఉండు. ఆలోచన కొరకింకా
సిద్ధంగా లేవు నీవు.
అందువలన చీకటి వెలుగౌతుంది నీ కొరకు; నాట్యమౌతుంది నిశ్చలత.
పారే సెలఏళ్ళ గుసగుసలు, శిశిర శంపాలతలు,
అదృశ్య వనమూలికలు, అడవి గంగరేగులు,
పూలతోటల పకపకలు. అత్యంతికానంద ప్రతిధ్వనులు.
పోగొట్టుకొన్నది కాదు, కావలసినది, వ్రేలెత్తి చూపుతున్నది
జీవన మరణాల ఆవేదన కేసి.
నీవంటావు నే నిదివరకు
చెప్పినదే మళ్ళ చెబుతున్నానని, మరోసారి చెబుతా విను :
చెప్పేదా మరోసారి? అక్కడకు వెళ్ళటానికి,
నీవున్న చోట చేరటానికి, నీవు లేని చోటునుంచి వెళ్ళటానికి
ఆనందంలేని త్రోవను వెళ్ళాలయ్యా నీవు :
నీ వెరిగియుండని దాన్ని చేరుకోవటానికి
అజ్ఞానమున్న త్రోవను వెళ్ళాలయ్యా నీవు :
నీవు కలిగియుండనిదాని కలిమి కలిగేందుకు
లేమి ఉన్న త్రోవను వెళ్ళాలయ్యా నీవు :
నీవై యుండని దాన్ని చేరుకొనేందుకుగాను
నీవు లేని త్రోవను వెళ్ళాలయ్యా నీవు :
నీవు ఎరుగని దేదో, అదే నీవు ఎరిగినది.
నీకు ఉన్న దేదో, అదే నీకు లేనిది.
నీ వెక్కడ ఉన్నావో, అక్కడే నీవు లేనిది.

# యాత్రికులకు ఒకమాట

(టి.యస్. ఇలియట్ వ్రాసిన 'డ్రై సేల్వేజస్'లో మూడవభాగం)

కర్మణ్యే వాధికారస్తే, మా ఫలేషు కదాచన-(గీత)

ఆలోచిస్తున్నాను కృష్ణుడన్నదానికి అర్థం ఇదేనా అని
అనేక విషయాలా లేక అనేక విధాల విషయం అదేనా అని
భవిష్యత్తు చెరిగిపోయిన పాటయని, పాటలమని, పన్నీటిజల్లు అని
తెరువని పుస్తకపు పసుపు పచ్చని పుటల్లో మూసియున్నదని
ఆరాటపడటానికింకా ఇచట లేనివారి తీరనికోర్కెల ఆరాటమని.
అనుకొంటున్నాను, ఊర్ధ్వయానం, అధోయానం ఒకటేనని,
పురోగమనం, తిరోగమనం ఒకటేనని.
భరించటం కష్టమే కాని ఇది మాత్రం నిజం.
కాలం గాయాలు మాన్పలేదు, గాయపడిన వాడిక్కడ ఉండడు గనుక.
బండి బయలుదేరినపుడు యాత్రికులు కూర్చుంటారు
పళ్ళతో, పత్రికలతో, ఉత్తరాలతో
(వారిని సాగనంపటాని కొచ్చినవారు అప్పటికి వెళ్ళిపోయి ఉంటారు)
వారి ముఖాలు బిగువు సడలుతాయి విచారం తగ్గి
భారం వదలి, గడచే గంటల నిద్రా సంగీతంలో
ముందుకు సాగండి, యాత్రికులారా! గతాన్ని తప్పించుకొని
భిన్న జీవితాల్లోకో, భవిష్యత్తులోకో కాదు ;
స్టేషన్నుంచి బయలుదేరినవాళ్ళు కాదు మీరు,
ముడుచుకొనే పట్టాలు, ఒకటొకటి జారిపోతూ
ఏదో ఒక గమ్యాన్ని చేరుకొనేవాళ్ళు కాదు మీరు.
మంద్రధ్వనితో బయలుదేరిన ఓడ డెక్ మీద నిలబడి
చీలిన కడలినీళ్ళు కలుసుకోవటం చూస్తూ
గతం గతించిందని కానీ, భవిష్యత్తు మీ ముందు ద్వారంలా
తెరుచుకొన్నదని కానీ, ఆలోచించ వలనుపడదు.

XI

రాత్రిపూట చీకటిపడిన తరువాత
తెరచాపల త్రాళ్ళనుంచి, గాలినుంచి
ఒక కంఠం వినవస్తుంది (భాషకాని భాషలో శ్రుతులుకాని శ్రుతులకు,
కాలశంఖ కలరవంలా)
యాత్రలు చేస్తున్నామని అనుకొంటున్న మీరు
ఓడలోంచి దిగేవారు కారు మీరు:
ఇక్కడ కడలికట్టల రెంటి నడుమ
కాల తిరోగ్రహణంలో, భూతభవిష్యత్తులను
యోచించండి మీరు సమభావంతో.
క్రియా నిష్క్రియతలు స్పృశించని ఈ క్షణాన
ఈ ఒక్క విషయం మాత్రం గ్రహించండి మీరు –
'మానవ మృత్యుక్షణాన మనస్సు ఏ ప్రాణక్షేత్రమందు
లగ్నమై ఉంటుందో' – ఆ ఒక్క కర్మ మాత్రం
(ప్రతిక్షణం మానవుని మృత్యుక్షణమే.)
ఫలిస్తుంది తదితరుల జీవితాల్లో.
అందువల్ల ఆశించకండి. కర్మఫలం
ముందుకు సాగండి,
యాత్రికులు! నావికులు!
ఈ రేవు కొచ్చినవారు,
తరంగాల విచారణకూ, సాగరుని తీర్పుకూ
కట్టుబడిన శరీరాలు కలవారు; సాగండి ముందుకు.
మీ వాస్తవ లక్ష్యమిదే!
బహుశా కృష్ణుడిదే అని ఉంటాడు
కురుభూమిని అర్జునునకు కర్తవ్యం బోధించినపుడు
'సౌఖ్యంగా పోయిరండ'ని కాదు;
ముందుకు సాగండని మాత్రమే, ఓ యాత్రికులారా!

# బోలు మనుషులు

(టి.యస్. ఇలియట్ వ్రాసిన 'THE HOLLOW MEN' అనే కవితకనువాదం)

1

బోలు మనుషులం మేమే
దిష్టిబొమ్మలం మేమే
ఒకరి కొకరు ఊతంగా
తలల నిండ చెత్తయ్యా !
మేమంతా సణిగినపుడు
మా ఎండిన నులిగొంతులు
అర్థరహిత శాంతంతో
ఎండుగడ్డిలో గాడ్పుల
గాజు తునకలపై ఎలుకల
చప్పుడులా ఉంటాయి మా
ఎండిన నేలమాళిగల్లో –
రూపంలేని ఆకృతి, వర్ణంలేని చాయ
పక్షవాతగ్రస్తశక్తి, స్పందరహిత సంకేతం.
సూటియైన కన్నులతో
అపర మరణ రాజ్యానికి
నిర్గమించినట్టివారు
ఎప్పటికైన గురుతొస్తే
మమ్ముల ననుకొంటారు
హింసా భ్రష్టాత్మలమని కాదు
బోలు మనుషులని మాత్రం
దిష్టి బొమ్మలని మాత్రం.

2

కలలోనైనా నేను కలుసుకొన సాహసించలేని కనులు
మరణ స్వప్న సామ్రాజ్యంలో
కావిక్కడ ప్రత్యక్షం ;

XIII

అవిగో అటనున్న కనులు.
విరిగిన స్తంభంపై పడిన ఎండ
ఊగుతున్న చెట్టొక్కటి
గాలి పాటలో గొంతులు
ఉన్నవి చెరిగే తారకన్న
దూరంగా, గంభీరంగా.
నన్నెక్కువ చేరువగా చేరనీకు
మృత్యు స్వప్న సామ్రాజ్యంలో
తాల్చనివ్వు నన్ను కూడా
బుద్ధిపూర్వక ఛద్మవేషం.
ఎలుక బొంత, కాకి తోలు, అడ్డపుల్లలు.
పొలం మధ్య
వాయువు నర్తించిన విధి వర్తిస్తూ
చేరువగా లేకుండా –
వలదా చరమ మిలనం
సంధ్యా సామ్రాజ్యంలో.

3

ఇదిగో ఇది చచ్చునేల
బొమ్మజెముడు కంపల నేల
నిలుపుతారు ఇచట శిలావిగ్రహాలు.
ఇచట పొందుతారు వారు
మృతకరాల అనునయాలు.
చెరిగే తార మిణుగురు వెలుగు క్రింద.
అక్కడ కూడ ఇట్లాగే ఉంటుందా
అపర మృత్యురాజ్యంలో.
ఒంటరిగా మేల్కొంటూ
మార్దవంతో కంపించే వేళలందు
ప్రార్థన నుంచి ఖండిత పాషాణం వరకు
దేనినైనా ముద్దిడుకొనే పెదవులతో –

XIV

4

ఆ కన్నులిక్కడ లేవు
ఇక్కడ లేవా కన్నులు.
చనిపోయే చుక్కల లోయలోన.
ఈ బోలు లోయలోన.
కోల్పోయిన మన రాచరికాల విరిగిన దవడలోన.
ఈ అంతిమ సంగమస్థలిని
అంటిపెట్టుకొని వస్తూ
సంభాషణ తప్పిస్తూ
పోగయ్యాం ఈ ఉబికిన నది ఒడ్డున —
చూపు లేదు, ఆ కన్నులు
మరల మరలి వస్తే తప్ప,
శాశ్వత ధృవతార వలె
మృతి సంధ్యా సామ్రాజ్యపు
సహస్రదళ పాటలమై
ఈ రిక్త మనుజమాత్రుల
ఏకైకాశాస్వరమై

5

తిరుగుతున్నా మిట నాగజెముడు చెట్టు చుట్టూ
నాగజెముడు చెట్టు చుట్టూ
నాగజెముడు చెట్టు చుట్టూ
తిరుగుతున్నాం నాగజెముడు చెట్టు చుట్టూ
ఉదయం అయిదు గంటలప్పుడు.
భావానికీ, భవానికీ మధ్య
కదలికకూ, క్రియకూ మధ్య నీడపడుతున్నది.
ఈ రాజ్యం నీదే గనుక.
భావనకూ, సృజనకూ మధ్య
ఆవేగానికీ, అనుక్రియకూ మధ్య నీడ పడుతున్నది.
జీవిత మిది సుదీర్ఘం.

XV

వాంఛకూ, సంకోచానికీ మధ్య
సామర్థ్యానికీ, అస్తిత్వానికీ మధ్య
సత్యానికీ, అవరోహణకూ మధ్య నీడ పడుతున్నది.
ఈ రాజ్యం నీదే గనుక.
నీదే గనుక, జీవితం నీదేగదా అని –
ఇలాగే అంతమొందుతుంది ప్రపంచం
ఇలాగే అంతమొందుతుంది ప్రపంచం
ఇలాగే అంతమొందుతుంది ప్రపంచం
దభేల్మని కాదయ్యా,
కిర్రుమని మూలుగుతూ.

# శబరి

(మరాఠీ మూలం : బాల సీతారామ్ మర్ఢేకర్.)

కుడ్య కరతలముపై వడలిన తన
పాండు జీర్ణ గండములు మోపిన
పాతదొక్క ఈగుడిసె — ముదుసలిది
చవిగొను పులిసిన రిత్త నిముసముల.
ఒక్కొకతరి చూస్తుంది యులికిపడి
అష్ట కష్టముల అత్తిలు లోకం.
నెత్తిని నెలగల శబరి విరూపిణి
క్షణాల రేగులు ప్రోగులుపేడుతూ
గెలుస్తుంది మంటిని ఒక ఆటగ;
దాపదు క్షణాల రేగుల పుచ్చులు.
కమ్మని మెత్తని, మాగిన, ఎర్రని
పండొక్క కనుపిస్తే దానిని,
వ్రేళుల లాలిస్తుందా కమ్మని
క్షణాన్ని; శబరి నవ్వి మధురంగా.
ధార్మిక శాస్త్రిలపైన పిడకలు
కొడుతూ రే యంటుంది మెల్లగా—
"సీతాపతి పొరబాటునైన ఈ
బాట నెన్నడైనా వస్తారా ?
ఈరేగుల దరిద్ర నైవేద్యం
దయతో వారు స్వీకరిస్తారా ?"
"ఎక్కడి రాఘవు డెక్కడి జానకి ?"
వంకర కంకర రోడ్డుంటుంది.
గుడిసె ముసలి మళ్ళీ తన ముడుతల
చెక్కిలి గోడ చేత పెడుతుంది.

# శాంతిపర్వమిది

(హిందీమూలం : రామేశ్వర శుక్ల)

వేంచేయండి పొండి ఓ హింసా విపణి విధాతల్లారా!
శాంతి పర్వమిది, పొండిక విద్వేషపు విక్రేతల్లారా!
వినబడలేదా వీరమానవుని విజయఘంటికారావం
నర రక్తాక్త చరిత్రపుటలలో చెరగిన గురుతుల భావం
నవమానవ హృదయాలయ దేహళి, నవసంకల్పితదీక్ష.
కాలము మారిన దేల గ్రహింపరు, చాలును అగ్నిపరీక్ష
మనుజ నయనముల హింసాహోలిక, మంటల పంటలు చాలు.
చాలు చాలు మీ మారణహోమం, చాలు చాలు ద్వేషాలు.
మానసాలయపు ప్రాణపీఠమున, మరణపూజనం చాలు.
చావును నాటిన చావు పండదా, చాలును శ్మశానాలు.
జగతి రగిలినది పొండిక విద్వేషపు విక్రేతల్లారా!
వెడలిపొండి యిక చాలును హింసా విపణి విధాతల్లారా!
ఘోర రుధిర నదములనే ద్రావిన కుంభసంభవులు మీరు.
మనమున భీకర లావా నిర్ఝర ఫణులను పెంచినవారు.
మీ నృశంస ప్రతిహింసా కీలల మేదిని ధ్వంసంకాగా,
మిగిలిన దేమున్నది వెలిబూడిద, మెత్తని పచ్చికపోగా;
బంగరుపంటల మంట గలిపినవి ప్రళయపు జవనాశ్వాలు.
చటుల ఖడ్గ ఖర ధారాధాటికి, జ్వాలలు జత కాబోలు.
సాగవులే ఇక మీ ఆగడములు చాలు చాలు పోపొండి.
నిదుర మేలుకొను నవభువిపై మీనీడలు పడనీకండి.
పారిపొండి మారాడక మానవ పలలపు వర్తకులారా!
శాంతిపర్వమిది పొండి పొండి ఓ శవముల సాధకులారా!
దేశ రాష్ట్ర మత జాతి వర్ణగత ద్వేష త్రాసములేలా?
క్రూర ఘోర రణ మారణమేలా? రోషావేశములేలా?
మానవులంతా ఒకటే కాదా? మానసమున దయలేదా?
జనులకనులలో, చెలిమి కలల నన లొనరు శుభదినమురాదా?

## XVIII

వెలుగు చీకటుల, కలిమిలేములను కలసి పంచుకొనలేరా ?
నవ్యజీవనపు దివ్యతీర్థమున స్నానమాడగా రారా ?
క్రోద్ధత కాళ కరాల కీలికల బుసలు చెవుల చొరరావు.
శ్రీధర మురళీస్వర పరవశమై శిరసు వంచినది చావు.
పాత పాపముల ప్రేతములారా ! పొండి, పొండి ! పో పొండి !
మీపాతకముల నల్లనినీడలు మాపై పడనీకండి !
మీజ్వాలా కందుక కేళులలో ప్రజ్వరిల్లినది లోకం.
మాడిపోయినవి జడ జంగమములు మసియై అలమెను శోకం.
రోదసి నిండినదేమది దీనుల రోదన ఘోర విరావం.
మరణ మేఘములు కురిసేదేమిటి ? మానవ రుధిరస్రావం.
మింటిని మంటిని రెంటిని యొరసిన మహాప్రళయ రాజీవం.
మరణ సురభిమయ కింజల్కాంజలి, పరమాణువుల ప్రభావం.
జరయు రుజయు, మరణపు మూడడుగుల శాంభవ తాండవకేళి.
పలల కణాల రాశిగా మారిన పదవిదళిత మనుజాళి.
సృష్టి మౌళి మకుటాగ్ర మహామణి శృంగారపు ఇతడేనా ?
హంతకులారా ! మీకొనరించినవంతయు ఇందులకేనా ?
అత్యున్నత మాదర్శ శృంగమది, మృత్యువరణ మభియానం.
లేదు హృదయపాత్రను రస మసలే లేదు పెదవులను గానం.
ప్రాణవిహీన శీత వాతాహతి, శాణకృపాణపు ధార
దుర్గమమార్గ మహావరోహణము, దోహదము రుధిరధార!
ఎద రగిలే పొగిలేది సెగ సుమా, ఎరుపు రుధిరమే కాదు,
లేదు, లేదు కన్నుల తడి పెదవుల లేశమేని తడిలేదు.
తెరవు తాను, తెరవరియును తానే, నరుడే అనలశలాక.
ఆరిపోదు స్ఫురదరుణ పతాకను గిరిపై నిలిపేదాక.
మీ తరమా ఈతని నావగ మీ వ్రాతను కనుగొనలేరా ?
త్రోవతొలగి పో పొండి తక్షణము, ద్రోహ విషోరగులారా !
నరుడు నరుని కని పరునివోలె కాతరుడై పోడిక ముందు.
స్నేహామృతము నింపెదము నీరస జీవన పాత్రికలందు.
మేలుకొలిపెదము నేల నాలుకను పాలసెలల గానాల,

## XIX

నీలి నింగిపై, నేల కొంగుపై, మేలిమి వెలుగుల జాలు.
వినిపించవు రణ పటహ నినదములు, ద్వేషపు భీషణ ఘోష.
పచ్చని పైరుల దాటి చేసికొను. ప్రళయ భయద హయ హేష.
ఘోరసమర దాహాకుల ధరపై కురియునుగాత ప్రశాంతి.
శ్యామల భీమతామస శాఖల విరియునుగావుత శాంతి.
శాంతి పర్వమిది, కాంతి పర్వమిది, గంతవ్యము మనముందు.
ఓ దారుణ పలలాశనులారా ! మీ దుకాణమిక బందు.
దయచేయండి పొండి ఓ హింసావిపణి విధాతల్లారా !
శాంతి పర్వమిది పొండిక విద్వేషపు విక్రేతల్లారా !

# బుద్ధుడు

(ఆంగ్లమూలం : రేనర్ మేరియారిల్కా - జర్మన్ కవి.)

అతడేదో వింటున్నటులే ఒక సంపూర్ణ శాంతి.
దూరంగా మనం ఆగగా వినిపించదు మనకిక.
అతడు నక్షత్రం మన కనుల కేమి కనుపించదింక.
దూరేతర నక్షత్రాల విస్తారం అతని శాంతి.
ఆతడు శేషం, మనం ఆతని మ్రోల నిలుచున్నది
అతడు కనగలందులకా ? ఏ మవసర మతనికి అది
మనం అతని మ్రోల ప్రణమిలినా అతడు —
ఒక గభీర ధీర మృగంలా అసలు లక్ష్యపెట్టడు.
ఏమనగా దేనికి ప్రణమిస్తున్నామో నేడు,
అది ఆతనిలో భ్రమియించింది వేల ఏండ్లనాడు
మన కనులకు తడి తేగల దాని నతడే మరచినాడు
మనకు శాస్తి, అతడు తనలో తాను నిండియున్నాడు.

# ఉద్బోధము

(మూలం : పారసీక కవి — షమ్సుద్దీన్ హాఫిజ్)

రక్తకీలల రోజాలు రగులుకొనియె
లలిత గళమెత్తె మధుమత్త బులుబులియును
అమృత మధుర హస్తంత్ర దీక్షార్థులార !
రండు, రండిదె, ఆర్తవ రమ్యవార్త.
అచల దుర్భేద్యమై తోచినట్టి మనల
శ్రమ వినిర్మిత సంయమ సౌధ మూల
మొక్క క్షణమున వ్రయ్యలై యుండె నేడు.
కనుడు, క్షుద్ర భంగుర చషకమ్మె తాకి
హాల దెమ్మాత్మ ముక్తి సభాంగణాన
పాదుషా ఎవ్వ డాశ్రిత భటుడెవండు
నిపుణ నైష్ఠికు డెవడు, మద్యపు డెవండు
ఎల్లరు సములు గాదె ఈ ఎల్లలందు ?
ద్వారయుగ యుత మీ మహాధర్మసత్ర
మిట యునికి, మూడునాళ్ళ ముచ్చటయె గాన
జీవితాలయ ద్వార మూర్ధావలంబ
మున్నతమ్మైన నేమి, గాకున్న నేమి ?
కష్ట కంటకాంధ పథము కడచి కాని
కోరికలు పూచు దోటల జేరబోము
ఏను నీ వాడనని నరు డియ్యకొనియె
దైవ సన్నిధి నిజహృదయ దర్పముడిగి.
ఇంక కలిమి లేముల గూర్చి శంకలేల
సంతసింపుము, వ్యర్థ దుశ్చింతలేల ?
ఎంత నిష్కల్మషాస్తిత్వ మేది కడకు
అంతమంద నస్తిత్వ శూన్యాంధ నిశను.
ఆసవుని వైభవ మ్మనిలాశ్వ వితతి
విహగ భాషల నేర్చిన వింతనేర్పు.

## XXII

ఏవి ? దుమ్మయి గాలిలో ఎగసిపోయె
అతని తోటనె వ్యర్థమై అంతరించె.
ఎగిరిపోకుము గాలిలో ఇలను వదలి
ఎగయు బాణము రివ్వున గగనవీథి,
అంతలో జవముడిగి తా నవని గూలు
ఎగిరిపడు వారలంతియె ఎవ్వరైన.
నీదు కవితల బహుమతి నేల నాల్గు
చెరగులకు గాని చనువారి కొఱకు ఎట్టి
తీయ పలుకుల విందుల సేయగలదు
నీ కలము నాల్క, హాఫిజ ! నిక్కముదువు !

# అనునయము

(మూలం : పారసీక కవి - షమ్సుద్దీన్ హాఫిజ్)

నీ సంయోగపు వార్త విన్నతరి, నే నీ మృణ్మయావాస పం
గాసిన్ వీడుచు లేచి వచ్చెద, విహంగమ్మాత్మ నీడే క్షణో
ల్లాస ప్రోద్ధతి రెక్కలార్చినటులే, లావొంది నా యాత్మ కై
లాసౌన్నత్యము నందబోవు, మమతా తాల్యంపుటుచ్చుల్ విడన్.
నీ ప్రణయమ్ము బిల్వ విని నే నమృత ప్రవదంతరుండనై
అప్రతిమాన వేగమున నంబరవీథిని తేలివత్తు; నా
కప్రతిమ త్వదంఘ్రితల కామిని, దుర్లభ జన్మ మృత్యు యు
గ్మప్రభుతన్ త్యజించెదను, కాలము, దేశము కాలదన్నెదన్.
దేవా ! ఎక్కడ తావకీన కరుణా దివ్యాంబుదాసార సం
స్రావమ్మక్కట ! నాదు బూది నవ సంస్కారార్థ మెన్నాళ్ళుగా
త్రోవల్ గాచె తృషార్తధూళి పటలిన్, రూక్షాబ్దముల్ పోయె, ఝం
ఝూ వాత్యల్ గొనిపోకమున్నె రసముల్, జాలొంద వర్షింపుమా !

# నీలిమ

(బంగాలీమూలం : జీవనానంద దాసు)

ఎండల మిలమిల
వేకువ మిన్నుల, నడిమిరేల చిక్కని నీలంలో
నీ అనంత సౌందర్యాభాసము కనుపిస్తుంది మరల మరల
ఈ నిస్సహాయ నగరపు చెరసాలల గోడల కావల.
చుట్టుముట్టి లేస్తుంది ఇచట దట్టపు పొగ.
మరి మరి రగిలి భగ్గుమంటుంది అగ్గలమౌ పొయి సెగ.
కడు వెచ్చని ఎడారి యూర్పుల భుగభుగలతో పులిమిన
మృగ మరీచికల భ్రాంతుల యలమిన ఎఱ్ఱని కంకర
అగణిత పథికుల ప్రాణా లహర్నిశలు వెదకి వెదకి వేసారి విసిగినా
తెరవన్నది కనరాదు ఎచ్చటా !
శాసనలౌహ నిగళ నిబద్ధ పదములు కలదని జడశిల లకటా !
ఓ నిర్నిమిష నీలమా ! లక్షల విధి నిషేధముల కారాగారము
మాయావిని ; నీ మాయాదండంతో తుత్తునియలు చేస్తావుగ తృటిలో
నే నొంటరిగా ఆలోచిస్తా జన కోలాహల పరుషార్భటిలో
ఏ సుదూర మాయానగరపు మహదింద్రజాలముల పసరు పులుముకొని
నీ వొచ్చావు వొంటిగా, వాస్తవ విశ్వరక్త తీరాలు పావనం చేయటానికై.
నీ స్ఫటికాలోకంతో నిండిన నీలాంబరాంగణము
వివృత మౌన స్వప్న కలాపికలాపాచ్ఛన్న దిగంత ప్రాంగణము
నా నయనాల్లో వ్యాధవిద్ధ భూహృదయ రుధిర లిపి చెరిపివేసి,
జ్వలిస్తుంది నీ అనంతాంబరపు గౌరదీపికా శిఖారాశి.
అశ్రుపాంశు సిక్తాతప్తము లీ పృథు సైకతములు
నగ్నశిరస్క విశీర్ణాంబర మీ భిక్షు సమూహం -
విస్తృత నిర్ఘృణ ఘంటాపథములు
ఈ లక్షల లక్షల ముమూర్షువుల కారాగారం
ధూళి పటలి, ఈ ధూమ్రగర్భ విస్తృతాంధకారము

## XXV

అన్నీ నీలిమలో నిమగ్నమై, స్వప్నావిష్ట విముగ్ధ దృష్టితో
శుభ్ర శంఖ సిత నీరద పుంజం, శుక్లాంబరాన మెరిసే తారలు
హృదయాలన్నీ హర్షలగ్నమై; నీ కించిత్ కరస్పర్శ మాత్రమున
కీటకవత్ వసుధా నిర్మోకం తునియ తునియలౌతుంది ఏలికా!
ఓ నిస్తంద్ర సుదూర కల్పనాలోక పాలికా!

# వనలతాసేన

(బంగాలీమూలం : జీవనానంద దాసు)

(వనలతా సేన్ అన్నది ఒక కాల్పనిక రమణి పేరు – నాటీర్ ఒక ఊరు)
వేయి వత్సరాల నుంచి సంక్రమణం చేస్తున్నా నే నీ పృథివీ పథాన
సింహళ సాగరం మొదలు మలయద్వీపం మేరకు ఈ మహాంధ నిశీథాన
పెక్కుమార్లు పయనించాను ; బింబిసార అశోకాది చక్రవర్తు లిల నేలిన
ధూసర సమయానహడా ; ఉన్నాను విదర్భ పురాతీతంలోనూ లీలగ ;
నేనొకశ్రాంత ప్రాణిని ; నలుగడలా భీకర జీవితవారిధి నురుగు లీన
కొలది క్షణాల ప్రశాంతి నా కిచ్చిన ఆమె పేరు నాటోర్ వనలతాసేన.
ఆమె కురులు ఎప్పటివో, విదిశానిశ లలమిన
చిక్కని కాటుక మరుల ఇరులు.
ఆమె మోము శ్రావస్తీ శిల్పశోభ ; ఊహకందని సుదూర వనధి పథాన,
చుక్కానీ విరిగిన భగ్ననావికుడు ఏ దిక్కూ తోచని తరి సమ్ముఖాన ;
తాల్చిన చెక్కుల దీవిని మెత్తని పచ్చికల పట్టు హఠాత్తుగా కన్నట్టుల
కనపడుతుంది నాకు ఆమె చీకటిలో, ఇన్నాళ్ళెక్కడ నీ వని అడుగుతాను.
పులుగు గూటిలా నా కనులకు కనుపిస్తుంది ఆమె, నాటోర్ వనలతాసేన.
పవలంతా కడచినాక మంచుతుంపర పచ్చికపై మెలమెల్లన రాలినట్లు
విచ్చేస్తుంది మలిసంజ, రెక్కలపై ఎండతావి తుడుస్తాయి చీకట్లు.
పుడమిగల రంగులన్నీ అయిపోతాయి ;
అప్పుడు సిద్ధంచేస్తాను లిఖితప్రతి,
మిలమిలలాడే మిణుగురు వెలుగు వన్నెలతో ;
లేక ఎలా నడుస్తుంది కత ?
పులుగులన్ని తమ గూళ్ళకు చేరుతాయి ; నదులు కూడ ;
బ్రతుకు బేరం ముగిస్తుంది.
చివరకు మిగిలిన చీకటిలో కుదురుగా ఉంటుంది వనలతాసేన.

# పిపాస

(ఉర్దూ మూలం : నియాజ్ హైదర్)

తొణికిసలాడే పూర్ణ చషక మిది
కాని నేను త్రాగలేను సాకీ :
పూర్వపరిచితాస్వాదిత మధువిది
క్షుద్ర మాదనం, తిక్తస్వాదం
క్షణికాహ్లాదం.
సుందర మందహసిత చంద్రానన
దృక్పథాన క్షిప్రగతిని చని మాయం అయినట్లే
క్షణికాహ్లాదం.
తృష్ణ తీరుతుందా ఈ భంగుర పానచషకమున
పగులగొట్టు ఈ కుంభచషకములు
ఈ పిపాస జీవితాకాంక్షకే మరొక పేరు గద ?
జీవించనీ నన్ను నిశ్శంకగ —
ఈ పిపాస సర్గాదినుండి హృదిలో వసించినది
ఈ పిపాస కామితపు కారణము
కామితాభిరుచి కామిత రమ్యత
ఈ పిపాస వల్లనే నిలచినవి దేశ కాలములు.
కంటికి కునుకు లేకనే గడపిన వ్యాకుల రాత్రులు
మలి జాముల కన్నీళుల తడిసిన చీకటి రాత్రులు
రేయి కనులు రాల్చిన మృదు సుందర తుహిన బిందువులు
తృటిలో త్రావేస్తాడు తృషిత బాలార్కుడు వానిని
ప్రాతర్వేళల లక్షల లక్షల కుసుమ చషకములు
సిద్ధంగా ఉంటాయి తృషిత రవి కోసం ధరపై.
ప్రాతరాసవము, దానిని త్రావి హర్షద్యోతితమై
జ్వలిస్తుంది మిహిరుని ముఖబింబం.
ప్రఖర కిరణ తతి తృషితాహులలా
త్రావేస్తుంది తుహిన శీకరములు.

XXVIII

అశ్రుబిందువులు, తుహినబిందువులు
ఏవీ మిగిలి ఉండవీ ధరపై.
ఆర్ద్ర సుమాలు, ఆర్ద్ర నయనాలూ
అన్నీ వాడి వడలిపోతాయి.
సూర్యుని క్రూరాతపం త్రాగగల
వాడెవడైనా ఉన్నాడా అని అంటే అడుగో మింటను చంద్రుడు.
ఒకగ్రుక్కలో త్రాగేస్తాడు చండకర జ్వాలలు.
తుహినాశ్రువులు మ్రొక్కుకొంటాయి,
అసలు ప్రొద్దుపొడవనే కూడదని—
కాని తప్పదే! శుష్కాధర తృష తీరేదెలాగ?
వింటున్నాం ఎప్పటినుంచో మరి—
అరుణాధర చుంబనాల వలన
ఆత్మతృష్ణ చల్లారుతుందని ఎలా నమ్మటం?
ప్రేమతృష్ణ తీరదులే చల్లని నీరు త్రాగితే!
తొణికిసలాడే పూర్ణ చషక మిది
కాని నేను త్రాగలేను సాకీ!

# యుద్ధనౌకతావ

(ఇది ఒక చిలీ కవి, తమ దేశ తీరానికి అమెరికన్ యుద్ధనౌక ఆగమనాన్ని గురించి వ్రాసిన కవిత కనువాదం.)

నాకు తెలుసులే నీ వొక మహిత లోహ శిల్పానివి
ఈగల్లా ముసిరే నావికులకు నీ వొక మృదుల తల్పానివి.
నాకు తెలుసు, ఈ శ్యామల సముత్తుంగ తరంగాలు,
నీ లోహపు దేహాన్ని, మృత్యుగర్భిత వినాయకుని ఉదరాన్ని
ముద్దిడుకొన పరుగులిడే నీచ దాస్య సంఘాలు.
నాకు తెలుసు నీ రాకను పసికట్టిన భీకర మహామత్స్యాలు
విపినంలో సింహగర్జన విని బెదరి చెదరిపోయే గోవత్సాలు.
విలయాగ్నులు వర్షించే నీ శతఘ్నుల మహోద్రగ్రరావం విని
చలిజ్వరం వచ్చిన భూఖండాలు, వడకుతాయి గడగడమని.
మానవ మాంస వాణిజ్యపు, జనభక్షక సామ్రాజ్యపు
రక్షణ దీక్షాదక్షత గలిగిన నీవు,
సేన్‌డాంగో అఖాతంలోకి ఎందుకు వచ్చావు ?
నీ కిక్కడ ఏమిటి పని ? అసలెందుకు రావాలని ?
నీ విక్కడి కొచ్చినది ధైర్యంవల్ల కాదు, భయంవల్ల, భయంవల్ల !
ప్రజలను చూస్తేనే నీకు హడలు, నీ యజమానులకు హడలు,
విప్లవాల విలయఘోష వింటేనే నీకు హడలు, నీ యజమానులకు హడలు.
అందుకనే నీ విక్కడి కొచ్చావు.
ఈగల్లా ముసురుతున్న నావికులను తెచ్చావు.
చెబితే నమ్మరు కాని, భయంవల్ల నీ విక్కడికొచ్చావు—
చీకటిలో దొంగలాగు దాగి, దాగి, నక్కి, నక్కి వచ్చావు.
వికట భయద విలయాగ్నుల వర్షించగల్గిన నీవు,
తృటిలో ఈ మా దీవుల బూది ప్రోవులుగా మార్చగల్గిన నీవు.
జ్వాలాగోళా లుమిసే నీ శతృఘ్ను శతఘ్నుల భూకంపాలను
సృజించగల్గిన నీవు.

XXX

అగ్నిపర్వతంలా ప్రక్కన నిలిచావు.
వికట వదన గహన గహ్వరాలు తెరచి మమ్మ మ్రింగదలచావు.
అయినా ప్రజలను చూస్తే నీకు హడలు, నీ యజమానులకు హడలు.
గత చరిత్ర గురుతుకు తెచ్చుకో నీవు.
మొట్టమొదట సాంటామేరియాలోన క్రిస్టాఫర్ కొలంబస్ వచ్చాడు
ఈ దీవుల నివాసులకు సంకెళ్ళూ, కొరడాలూ, కానుకగా తెచ్చాడు.
ఏది ఆ ప్రబల నౌక ? కాల జలధిగర్భంలో కలిసి చివికిపోయింది.
నీకు గూడ అంతేగతి పడుతుంది.
మొన్న మొన్ననేగాదా యుద్ధనౌక 'మెంఫస్' పొగలు గ్రక్కుతూ
ఇక్కడికి కొచ్చింది.
కడకు దానికే దుర్దశ పట్టింది ?
నీకుగూడ అంతేగతి పడుతుంది.
నీ ధాటికి సాటెవరని గర్వించకు !
నీ దేహం లోహకవచ రక్షితమని భావించకు.
కడలి తరగ నాల్కలు నీ కవచాన్ని తినేస్తాయి.
కఠిన కాలశిలల పైన నీ అస్థులు ఎండుతాయి.
ఉప్పెన గాలుల విసరులు కొరడాలై చరుస్తాయి.
మేకపోతు గాంభీర్యం చూపించకు.
నీ గుండెలలోని హడలు నాకు తెలుసు.
కన్నుల గంతలు విదల్చి, దుర్భిణితో కాస్త తేరి పారజూడు.
నిన్ను మట్టుపెట్ట ఒక్కపెట్టున లేస్తున్నదిలే ఊరు నాడు.
ఆసియాలో, ఆఫ్రికాలో, లేటిన్ అమెరికాలో ఒక అదృశ్య
మహాశక్తి లేస్తున్నది.
దిగంతాల వ్యాపించిన నీ విశాల సామ్రాజ్యం అంతమొంద
ప్రజాశక్తి లేస్తున్నది.
లోహపు నీ దేహయష్టి గజగజలాడగ తన కోట్లకొలది
హస్తాలను చాస్తున్నది.
రాజ్యాలు, సామ్రాజ్యాలు పేకముక్కల మేడల్లా
కూలి రాలిపోతున్నాయి.
భీకర యుద్ధనౌకలు కాగితాల పడవల్లా చివికి తునియలౌతున్నాయి.

XXXI

విమానాలు కడుపుచిచ్చు పెచ్చరిల్లి తామే ప్రేలిపోతున్నాయి.
అదిగో, ప్రజలు లేస్తున్నారు : అసత్యాల అరణ్యాలను
నరికి పారవేస్తున్నారు.

ప్రభువుల పత్రికల బాకాల పీకలు తెగిపోయాయి.
మంతనాల తంతువులు వితంతువు లయ్యాయి.
అబద్ధాలు అడ్డంపడిన రేడియోల గొంతులు నొక్కుకుపోయాయి.
రాయ'బారు'ల ఆలయాల్లో గబ్బిలాలు, గుడ్లగూబలు ఏలికలయ్యాయి.
వెల్లువలై పెల్లుబికిన ప్రజా క్రోధ ప్రబల ప్రళయ వాహినిలో
వికృత విగత విశ్వగాథల పాపాల గోపురాలు
పూచికపుల్లల్లా కొట్టుకపోయాయి.

వత్సరాలు గతించాయి. శతసహస్ర రక్తాక్త మత్సరాల వత్సరాలు
దుష్టత విశిష్టతగా తరతరాల చెరలు ఉరులు పరచిన వత్సరాలు
చెమటోడ్చినవారి ఉసురుపోసుకొన్న, ఆకలి చీకటిరాత్రుల వత్సరాలు
నిశ్శబ్దత, నిస్తబ్ధత, విక్షుబ్ధత, సురిగి, రగిగి మరగిన బహు వత్సరాలు
రగిలోపల, దుర్భరతర భూమి గర్భవేదనలా,
లోలోపల పెల్లుబికే వెల్లువలా,
శయనించే విశ్వనయన యవనికలో విప్లవ మహాస్వప్నం.
వత్సరాలు గతించాయి; క్లేదస్వేద తిక్తరక్త వాహినులు స్రవించాయి.
పచ్చని పైరుల సౌరు ప్రుచ్చిలు మిడుతలదండ్లు :
తోటలోని, గూటిలోని పూవుల పూపల ఎదల గ్రుచ్చిన ముండ్లు.
హంతల చేతులు చెండిన ; ఆడుకొనిన, తలల చెండ్లు
ఇక సాగవు మీ ఆటలు ; అదుగో ప్రజలు లేస్తున్నారు.
బారులు తీర్చి కలసిన కేలశృంఖలాల భూగోళాన్ని చుట్టుముట్టివేస్తున్నారు.
మారణ పరికరాలను విరిగిన ఆటబొమ్మల్లా విసరి పారవేస్తున్నారు.
ప్రాత పాచి ఊడ్చివేసి భూతలాన్ని కడిగి, తుడిచి శుభ్రం చేస్తున్నారు.
తుపానుల చీపురుతో ఊడుస్తున్నారు.
వెల్లువల కలయంపి చల్లుతున్నారు
సుందర స్వప్నాల ముగ్గులు పెడుతున్నారు.
హృదయాశయ ప్రియాతిథికి స్వాగతమిస్తున్నారు.
అందుకనే ప్రజలను చూచి నీకు హడలు, నీ యజమానులకు హడలు.

# హృదయ హిమాలయంపైన

(జర్మన్ కవి 'రేనర్ మేరియారిల్కె' కవితకు ఆంగ్లంనుంచి అనువాదం)

హృదయ హిమాలయంపైన బయలుగా ; చూడు ఎంత చిన్నదో,
అదే చూడు— శబ్దాల కడపటి శివారు అదే, ఇంకా పైన,
అదీ ఎంత చిన్నదో
ఆవేగ సుక్షేత్రం ఒకటి, అదిగో, కనుపిస్తోందా ?
హృదయ హిమాలయంపైన బయలుగా ; రాతినేల
నీ గట్టి పట్టుక్రింద ; అవును, నిజం, పూస్తున్నది
ఏదో ఇచటకూడా. మూగికొండ వాలున అది
ఏదో ఒక మూర్ఖపు మొక్క జపంచేస్తూ మొలుస్తున్నది.
కాని జ్ఞాని ? జ్ఞానోదయం మొదలిడగా
మౌని అయినాడిపుడు ; హృదయ హిమాలయంపైన, బయలులోన.
కాని నిరాపదంగా పోతాయి ఇచటకూడా
చెక్కు చెదరని తెలివేదో త్రోవ చూప కొండజింకలు
పోతాయి, ఉంటాయి. ఆ సురక్షిత పక్షీంద్రుడు
శిఖర స్వచ్ఛ నిరాకృతిని చుట్టి చుట్టి ఎగురుతాడు.
అరక్షితుడు ఇచట హృదయ హిమాలయంపైన అతడు.

XXXIII

# ఏదో వస్తున్న గ్రహణం

(జర్మన్ కవి 'రేనర్ మేరియారిల్కే' కవితకు ఆంగ్లంనుంచి అనువాదం)

పెద్ద బయలు నట్టనడుమ ఒక పతాకలాగు నేను
రాబోతున్న పెనుగాలిని పసికడతాను ; దానిలోనే మనుతాను.
అప్పటి కింకా నిదురలో ఉండి కదలవు క్రింది లోకంలో జీవాలు
తలుపులు మెత్తగానే మూతబడుతాయి ; నిశ్శబ్దత నిండిన పొగగొట్టాలు
కిటికీలు టపటపమని కొట్టుకోవు ; నేలపైనే పడి ఉంటుంది ధూళి.
కాని నాకు అప్పటికే తెలుసును తుపాను,
సంద్రంలానే అలజడి చెందుతాను.
బయటకు చాచుకొంటాను,
నాలోనికి పడిపోతాను.
నన్ను నేనే పారవేసుకొంటాను,
పూర్తిగా ఒంటరిగా ఉంటాను,
పెనుతుపానులో.

# సెలవు

(ఫ్రెంచి మూలం : గిలామ్ అపొలినార్ — ఆంగ్లంనుంచి)

నేను ఏరుకొన్నానీ భంగుర దూర్వాదళాన్ని
తల పగుల ఎన్నడో చనిపోయిన హేమంతాన్ని.
ఒకరినొకరు చూడలేము మరి ఎన్నడు ?
కాలగంధం దూర్వాదళం, ఇదిమాత్రం మరువకు.
వాచి ఉన్నాను నేను మన కలసిన బ్రతుకు కొరకు.

XXXV

# సోదిసాని

(ఫ్రెంచి మూలం: గిలామ్ అపాలినార్ - ఆంగ్లంనుంచి అనువాదం)

సోదిసానికి తెలుసును ముందునుంచి
మార రహస్య నిశాబద్ధ జీవితాలను గురించి
సెలవు చెప్పుకొన్నాం మేము, అంతట ఆశ
ఉప్పొంగింది నిర్హేతుకంగా ఆ కూపం నుంచి.
ప్రేమ ఒక మధుమత్త భల్లూకంలా
నిలబడి ఆడింది మా స్వల్పపుటిచ్ఛలపై.
నీలిపిట్ట కోల్పోయింది అందాల ఈకలూ
జపం చేసుకొనేవాళ్ళ హారాల్లో పూసలూ.
మాకిక విముక్తి లేదని మాకు తెలుసు
కాని అచ్చట సైగచేసి ఉన్న ఆశ;
చేయి చేయి కలిపిన మాకు జ్ఞప్తికి తెచ్చింది,
సోదిసాని మా గురించి ముందే చెప్పినదాన్ని.

# ఏనుగు

(ఫ్రెంచి మూలం : గిలామ్ అపొలినార్ - ఆంగ్లంనుంచి)

ఏనుగుకు దంతాలు ఉన్నట్టే
నా నోట్లోనూ ఉందొక విలువ గలిగిన కానుక
ఓ ఆరక్త మరణమా ! నా కీర్తిని నేను కొనుక్కొంటాను
నా చక్కని శబ్దాలు వెచ్చించి.

XXXVIII

# ప్రేయసి

(ఫ్రెంచి మూలం : పాల్ యూలార్డ్ - ఆంగ్లంనుంచి)

ఆమె నిలచి ఉన్నది నా రెప్పలపైన
ఆమె జుత్తు కలసినది నా జుత్తులోన
నా కన్నులు పోలచినదే ఆమె చాయ
నా చేతులు మలచినదే ఆమె కాయ.
నా నీడలో నిమగ్నమైన దామె,
గగన పృష్ఠ భూమి క్రమ్మి కనుపించని శిలవోలె.
ఆమె కన్నులు ఎన్నడూ మూతబడవు
నన్నుకూడ నిద్దుర షోనివ్వదామె.
ధగధగమనే పగటివేళ ఆమె స్వప్నాలు
సూర్యులను ఆవిరిగా మార్చేస్తాయి
నన్నవి నవ్విస్తాయి, ఏడ్పిస్తాయి, నవ్విస్తాయి
పలుకదగినది లేని వేళ పలికిస్తాయి.

# కడపటి కవిత

(ఫ్రెంచి మూలం : రాబర్ట్ డెస్నాస్ - ఆంగ్లంనుంచి)

నిన్నుగూర్చి నేను ఎంతటి తీవ్ర స్వప్నాలు కన్నానంటే
ఎంతదూరం వెళ్ళానంటే, ఎంతగా చెప్పానంటే
నీలోని ఒక్క నీడను ఎంత గాఢంగా ప్రేమించానంటే
ఇక ఇప్పుడు, నీవు నా కేమీ ఏ మాత్రం మిగలలేదు.
నీడలలో నీడనుగా నేనుకూడ మిగిలాను
నీడకంటె వందరెట్లు నీడనుగా.
నీడనుగా, నీ సూర్యరూపాంతరిత జీవితాన
మరల మరల పడటానికి.

# చీకటిని సొంతం చేసుకొన్నాం

(ఫ్రెంచి మూలం : పాల్ యూలార్డ్ - ఆంగ్లంనుంచి)

చీకటిని సొంతం చేసుకొన్నాం, చేయి చేయి కలిపి మేలుకొని ఉన్నాం.
నా యావచ్ఛక్తితోటి నేను నిన్ను పరిపోషిస్తున్నాను.
నీ శక్తుల నక్షత్రాన్ని శిలపై చెక్కుతున్నాను.
లోతుగల గీతలు, అచట, నీ దేహంలోని మంచి ఫలిస్తుంది.
నాలో నేను నీ గోప్యనామాన్నీ, నీ ప్రకటిత కంఠాన్నీ గొణుగుతాను
నీవు దీన భిక్షుకునిలా చూచే గర్విత మహిళను
గురించి ఇంకా నవ్వుకొంటుంటాను.
నీవు గౌరవించే పిచ్చివాళ్ళుగాని, నీవు హర్షించే అమాయకులుగాని,
వీరంతా నా మనసులో మెల్లగ నీలో కలసిపోతారు రాత్రివేళ
నీవు వహించే అద్భుత ప్రతిరూపాన్ని గురించి నేను
విస్మయం చెందుతాను,
నిన్ను పోలి, నే ప్రేమించే సర్వస్వాన్నీ పోలిన
మరొక మహిళ - నిత్య నవళ.

# హెచ్చరిక

(ఫ్రెంచి మూలం : పాల్ యూలార్డ్ - ఆంగ్లంనుంచి)

అతని మృత్యువు ముందు రాత్రి
అతని జీవితములోకెల్ల సంక్షిప్తమైనది.
తానింకా ఉన్నాననే తెలివి
అతని నాడులలో రక్తాన్ని రగిలించింది.
అతని ఒడలు బరువు అతనికే దోకు తెప్పిస్తోంది
దాని సత్తువ ప్రేవుల్లోంచి మూల్గులు రప్పిస్తోంది.
కాని అంతలోనే ఆ భీషణ యమయాతనల
పాతాళంలోంచి అతను, మెల్లగా నవ్వసాగాడు.
అతని సహచరుడు అచ్చట ఒక్కడు కాడు ;
లక్షల కొలది, కోట్ల కొలది.
పగ తీర్చుకోగలరనే నమ్మిక కుదిరిందతనికి
ప్రొద్దు పొడుస్తున్నదపుడు అతని కొరకు.

XLI
XXXXI

# ఘంటారావం

(ఫ్రెంచి మూలం : పాల్ రివర్డ్ - ఆంగ్లంనుంచి(

అంతా ఆరిపోయింది
గాలి కూనిరాగం తీస్తూ పోతున్నది.
చెట్లు వణుకుతున్నాయి.
జంతువులు చనిపోయాయి.
ఎవ్వరూ మిగలలేదు - చూడు, చూడు.
చుక్కలన్నీ మెరవటం మానేశాయి.
భూమి తిరగటం మానేసింది.
ఒక శిరస్సు ముందుకు వంగింది
జుత్తుతోటి రాత్రిని ఊడ్చివేస్తూ.
మిగిలి నిలిచి ఉన్న కట్టకడపటి ఘంటస్తంభం
పన్నెండు కొడుతున్నది.

# సూర్యుడు

(ఫ్రెంచి మూలం : పాల్ రివర్డ్ - ఆంగ్లం నుంచి)

ఎవరో అతను ఇప్పుడే వెళ్ళిపోయాడు,
గదిలో ఒక నిట్టూర్పు వదలిపోయాడు.
పాడుబడిన బ్రతుకు, వీథి ;
తెరచిన కిటికీ తలుపు.
పచ్చిక బయలులోన
సూర్యుని కాంతి కిరణం !

XLIII

# అతులస్యం

(ఫ్రెంచి మూలం : పాల్ రివర్డ్ - ఆంగ్లంనుంచి)

ఈ లోకం నా చెరసాల, నేను ప్రేమించినదే నాకు దూరమైనప్పుడు
మీరు కాదు నా దిగంత తీరాల దూరపు జైలు కటకటాలు
శోక బహుళ చిహ్నాంకిత భూమిపైన
శూన్యతమ వ్యోమంలోన, ప్రేమకాని, స్వేచ్ఛకాని ;
మృత్యుసంపదగా ఉన్న కఠోర పదార్థాలను
ఒక మోము వెలిగిస్తుంది, వెచ్చన చేస్తుంది.
ఇకమీదట నే నా మోములో నుంచే పలుకుతాను.
ఈ తీరులు, ఈ గొంతుక —
నా హృదయం మారుమ్రోగి, దడదడ కొట్టుకొంటూ,
మంటల తెరలా, రజనీ పరిచిత కుడ్యాల మధ్య
ఒక మృదులచ్ఛాయలాగు, నిష్ఫలతమ ఏకాంతాల
మోహక పరిధి, ప్రస్ఫుర ప్రతిబింబ రాశి ; పశ్చాత్తాపాల ప్రోవు,
కాలపు ఈ చెత్తప్రోవు కుంపటిలో రగులుతోంది.
మంటలో విసరివేసిన మరో పథకం
గురితప్పిన మరో సూత్రం.
మరణాసన్న నరుని నుంచి
తీసుకోవటానికి మిగిలేది కొంలది.

# ముద్దు

(ఫ్రెంచి మూలం : జాక్వెస్ ప్రివర్ట్ - ఆంగ్లంనుంచి)

అతను తన తలతో కాదంటాడు
కాని అతని హృదయం ఔనంటుంది.
అతను తన కిష్టమైతే ఔనంటాడు
తన పంతులును మాత్రం కాదంటాడు.
నిలబడి ఉన్నా డతడు
రకరకాల ప్రశ్నలు, రకరకాల సమస్యలను
గురించి అడుగుతున్నారు అతనిని.
హఠాత్తుగా అతడు ఆపుకోరాని నవ్వుతో గిలగిల లాడుతాడు.
నవ్వుతో అంతా తుడిచేస్తాడు.
ఆ అంకెలూ, శబ్దాలూ
తేదీలూ, పేరులూ
వాక్యాలూ, ఉచ్చులూ, వలలూ,
పంతులు బెదిరింపులను లెక్కచేయక
బాలవిద్యార్థుల వెక్కిరింతల నడుమ
రంగురంగుల సుద్ద బలపాలన్నిటితో
ఆ దరిద్రపు నల్లని చెక్క పలకపైన అతడు
ఆనందపు ముఖాన్ని చిత్రిస్తాడు.

XLV

# ఇచట, ఇంకా ఇచట

(ఫ్రెంచి మూలం : ఇవాన్ బోనీఫ్ - ఆంగ్లంనుంచి)

ఇచట ఇది కాంతి సద్మం, ఉదయం కడచిపోయింది.
చెప్పదగిన తన కోరికలతో పగలు అప్పుడే వచ్చేసింది.
నీ కలలలోని పాటల ఎండమావులలో మిగిలినది
రానున్న వజ్రాల మిలమిల మాత్రమిది.
ఇచట చీకటి పడేదాక ; నీడల పూలు
గోడల పైవంకకు మరలుతాయి. గడియల రోజాలు
తమ నిశ్శబ్దపు రేకులు రాలుస్తాయి. మెరిసే చప్టారాళ్ళు
పగలును ప్రేమించే ఈ మెట్ల వరుసను తమ ఇష్టంగా తీసుకుపోతాయి.
ఇచ్చట, ఇంకా ఇచ్చట ; రాయిపై బడిన రాయి.
స్మృతి నిర్దేశిత దేశాన్ని నిర్మించాయి·
మామూలు పండ్లు రాలిపడే సవ్వడి నీలోన
రేకెత్తించదు మరల, త్వరలో నయమయ్యే కాలజ్వరాన్ని !

# అలా మనం నడుస్తాం

(ఫ్రెంచి మూలం : ఇవాన్ బోనీఫ్ - ఆంగ్లంనుంచి)

అలా మనం నడుస్తాం, విస్తృత గగన శిథిలాల్లో
దూర దృశ్యం చూపులలో నిండుతనం పొందుతుంది
ప్రస్ఫుట ప్రకాశంలో, భాగ్య లిపిలా—
మన మనాదినుంచి వెదకిన సుందరతమమైన దేశం
మనముందు పరచుకొంటుంది - అదే సువర్ణ మౌన దేశం.
నీ వంటావు — అదిగో, ఆ రాయి చూడు,
దానిలో మృత్యువున్నది.
మన అంగాంగ విన్యాసాల, ముఖ భంగిమల
లోనుంచి ప్రజ్వరిల్లే రహస్య ప్రదీపమదే —
అలా మనం కాంతి కలిగి నడుస్తున్నాం.

X LVII

# చతుష్పదులు

(హిందీ మూలం : రామధారీసింహ దినకర్)

విస్మృతిలో సుఖమేముందో మరి, అడుగు గాయమొందిన వానిని
జగతికి దూరంగా గొనిపోయిన దెవనిని ప్రియబాధామానిని
జ్ఞానివి, జాగరూకుడవు, నీవీ మర్మమొకటి కనుగొనలేదు
చెబుతా డడుగు వాని నా పూవుల సంకెలలో చిక్కినవానిని.
నీవు యాచనకు వచ్చావనగా భూహృది గడగడలాడింది
ఏమున్నది నీకిచ్చేందుకు నా పేదకోర్కె అల్లాడింది
మంటల ఒడిలో పూర్ణాహుతిగా ఇంక దుముకుదా మనుకోగా
'ఈ రక్తాభిషేక మెందుకు నాక'ని నీ రూపు నవ్వి అంది.
ఛవిచింతనమున వాసవధనువై హృదయకాంతి నూతనమైనది
ప్రాణబంధములు విడి చైతన్యం రూపజలధిలో లయమైనది
హృదయరాగ మొలికే వీక్షణముల నీవు నన్ను గాంచినతోనే
దృక్కుల సౌఖ్యార్ద్రస్మితితో నా తుహినకణము రంజితమైనది.
కలల రూపు వెదుకుతూ శూన్యమున పో ఒంటిగా నిర్విరామం
పాంథా! చేయగలిగినది ఒకటే; పలుకు రూపహీనుని నామం
భూతలాన్ని ప్రేమించనివానికి అవలంబం నభాన లేదు
భ్రాతా! ఇక ప్రణమిల్లు మృత్తికకు, కఠిన సాధనల దీ ధామం.
భువినుంచి ఎగసినది వెచ్చయూర్పు, నా కసహమైన దా దాహం
హృది కరగికరగి ఉబికినది కాని పారలే దశ్రు పరివాహం
ఒక్కటే చింత నా కహర్నిశలు మొగమెలా చూపటం ప్రభువుకు,
నే చెప్పదలచి వచ్చిన రహస్సు చెప్పనేలేదు, వివశోహం.
రంజిత సుమదళములపై నుండిన దదియొక క్షణభంగుర చిత్రం
అరుణిమలో దాగి తొంగిచూచెడి ఋతరోచిర్జగతి పవిత్రం
"ఏమిటి చూచావా రేకులపై, మారేల పలుకవ"ని అడుగకు
మౌనంగా నీవు తలంచినదది నా విస్మయవాణీస్తోత్రం.

# మహాభియానం

(హిందీమూలం : రామధారీసింహ దినకర్)

ప్రజ్వల దహిశ్శిఖాగ్రకీలవై ఎగసినావు మత్ప్రాణ గగనమున
కవితా! శాంతిలేక, తృష తీరక, నేను తిరుగుతున్నాను భువనమున
దాహము హృదిని, జ్వాల నా గళమున, సమ్ముఖమున పరమేశు మరుస్థలి
ఒక్కచుక్క రాల్చదు తృషితా ధ్వగరసనల మృగమరీచి ఛలనావళి
పొగలు, సెగలు, ఇంటింటా విన్నా నీ జగతికి నిప్పంటుకొన్నదని.
దాహము, దాహము మానవాళికని, ఎలుగెలుగున తృష భగ్గుమన్నదని.
నీలాంబర రస మిరిగిపోయినది, లేశము త్రావి విశ్వ విషసారము
ఆవిరిగా పైకెగిరిపోయినది సర్గతాపమున వర్షాసారము.
మానవాశ్రు మిశ్రమమై నీరధి క్షారమైన మరునిముసము ఫెళ్ళున
కొండబండ గుండియలు చీల్చుకొని సెల యురికినది నా మనసు చల్లన.
మహాశ్చర్య మది త్రాగ సాగినది నన్నే చలద్వీచికాధరముల,
కొండ గుండె చీల్చుకొని దప్పిగొని ఉన్నానన్నది మృదు సుస్వరముల
అహో విషమవిధి! నా నిర్భాగ్యత! పోలలేను ధన్యుల నా కవులను.
నష్టాభావుల, దృష్టానావృత తావక పావన జీవచ్ఛవులను.
దాహదగ్ధ పృథివికి దూరంగా, గగన కుసుమ సురభిత వనసీమల
చరిస్తావు జలదాలస లీలల, నీవు వారి కల కోమల ప్రేమల
గగనామరవల్లీ సుమభూషలు, అలిభాషలు, అచ్చట తావెక్కడ ?
కులిశ ఘోషలకు; పూవుల తావుల తేనియకాని వేము లేదక్కడ.
సుకృతు లా కవులు, కలుస్తారు నిను, మృదుల కల్పనా శిల్పతల్పమున
చరణతలోద్గత మృద్గీతశ్రుతి చెరుపలేదు స్వప్నాలు స్వల్పమున.
సుందరి! నాకూ ఉందొక కోరిక అందానికి నా తల ఒగ్గాలని,
మాధవ చరణానుగమన లయుడనై, సుమనస్స్నేహ పణము నెగ్గాలని.
నా కోరిక మాలినీతీర వనతరుశాఖాగత తస్కృతేక్షణము-
మునిబాలల యౌవన భారానతస్రతను కటిధృత ఘట మృదుగమనము
ప్రథమ స్పర్శాకుల పులకారణ తరుణీ వదన మసృణ సుమకలనా

XLIX

భాస్వర భూస్వర్లోక సదృశమా లతాకుంజమున తొంగిచూడనా ?
జనకానన రోదన మానని కడ స్వప్ననీడములు నిర్మించేదా ?
జగదార్తధ్వని వీనుల వేచని ఆశ్రమాన తలదాచుకొనేదా ?
ఊర్మి డోళికల ఊగిన కిరణం సంజమసకలో మాసినటులనే
ఆటల పాటల ప్రొద్దుబుచ్చి, నేను చెరగిపోనా స్వప్నతటులనే ?
కాని శూన్యమున నీడము పొసగదు, పన్నినాను ఎన్నెన్నో యుక్తులు
కమలి, సమసిపోతాయి కల్పనలు, శిల్పమొదిగినా పొసగవు రక్తులు.
ఉండి ఉండి పడిపోతాను నేను భూరుదనంలో ఆహతఖగమై
తుడుచుకపోతుంది ఒక విసురుతో, స్వప్నరాజ్య మస్రోర్మి సహాగమై
దైవకోప శాపాగ్నులు తలపై, శాణకృపాణ శంపలై ఆడగ
మూఢ భావనలు భస్మంచేస్తూ జ్వలిస్తుంది హృదయం రాపాడగ.
పశ్చిమ రక్తమేఘ వలయంలో త్రస్తాస్త రవిబింబగత దైన్యము
తిలకించి, మనసు కరగి కనులలో క్రమ్ముతుంది కలుషావృత శూన్యము.
విషమ మరణ రాగిణీజనిత మీ వికటవిశ్వ హింసామహోత్సవం
అణగిన శాపతాప ప్రేతాళికి, పునఃప్రభవ మిది, వసంతోత్సవము.
రక్తాక్త కృపాణహస్త సంస్కృతి, శోణితమైన విశుభ్రాశావళి
దీన దరిద్రాస్థుల ఉల్కాలతో స్వర్గద్వారము కడ దీపావళి.
అరుస్తున్నది రాక్షస నాగరికత 'శాంతి' 'శాంతి' అంటూ భూతలమున
అడగం డెవరైనా తన కోరలు తడుపుతోంది ఎందుకని గరళమున ?
ఒకవంక చర్మ మొలచినాసరే, 'శాంతి' మేము మెదలనేకూడదా ?
ఒకవంక గొంతు కోసినాసరే, 'శాంతి' పెదవి మెదపనేకూడదా ?
'శాంతి' క్షుధార్తుల నోటిముద్దలే లాక్కొంటున్నవి చీదరకుక్కలు
శాంతి బందిపోటులు రాగానే, ఇల్లువదలి పోకుంటే చిక్కులు
తుపాకిగుండ్లే అక్షరాలుగా నీగ్రోలకు సంస్కృతి పాఠాలా ?
'శాంతి' హృదయగత జ్వాలాకారకు పెగపొక్కని అధర కవాటాలా ?
దనుజుల రక్తపిపాసులతోనా శాంతిభాషణం కావ్యకుమారీ !
పాపానికి ప్రతికృతి చేయలేని శాంతి భ్రాంతి కాదా సుకుమారీ !
మండుటెండయైనా, చలియైనా పాపం రైతులు శాంతి ఎరుగరే
ఎద్దులతోడిది బ్రతుకు నిరాశల పెనుచీకటిలో కాంతి ఎరుగరే.

L

నాలుక నోటను, సత్తువ రెక్కల, సుఖం జీవితాల్లో కనుపించదు
వ్యంజనాలు సరి, గ్రుక్కెడు గంజే ఆ కాలే కడుపులకు లభించదు.
స్వప్న వ్యోమానికి సుదూర మతి శోకాకులపు భూతలి చాలా
పంట కల్లములలో మంటలు ఇట, ఇంట్లో గోల గిజగిజలు చాలా.
వృషభానుజ హలధరులు వీరు, మరి ఏడంతా ఎట్లా గడపాలో
కనులు చెమర్చవు, పెదవులు మెదలవు, కన్నీట తినే వెతను తడపాలో ?
పాపం, ఆ పాపల గతి ఏమిటి ? కన్నీరులు త్రాగ నేర్వలేదే ?
ఎండిన రొమ్ములు చప్పరించినా, ఎంత ఏడ్చినా నిద్దుర రాదే ?
పేదతల్లి కన్నులముందే పసిప్రాణ మెగిరిపోతుంది గిలగిలా.
వజ్ర వక్షమది పాలకు మారుగ తన రక్తం కార్చేది జలజలా !
ఒకొక సమాధిని, ఒక్కొక బాలుని, క్షుధితాస్థిక ప్రచండ రోదనము.
పాలు ! పాలు ! నిశిలో అడుగడుగున కరుణారవాల విఫలయాచనం.
పాలు ! పాలు ! పాపా ! దేవళాలలోన బహుళ బధిర పాషాణాలు.
పాలు ! పాలు ! ఈ పిల్లల దైవం ఎక్కడ ? చెప్పవు నక్షత్రాలు !
పాలు ! పాలు ! నిదురించే ధారుణి, ఇపుడెక్కడ దొరుకుతాయి పాలు !
పాలు ! పాలు ! ఓ దేవతలారా ! రాల్చండి నాల్గుచుక్కల పాలు
పాలు ! పాలు ! గంగా ! నీవైనా నీటిని పాలుగ మార్చగదమ్మా !
పాలు ! పాలు ! ఈ క్షుధిత శవాలను పాలతోటి ఓదార్చగదమ్మా !
పాలు ! పాలు ! మళ్ళీ పాలేనా ? పాలు మరువలేరా క్షణమైనా ?
పాలు ! పాలు ! చచ్చినా, పాలులేకున్న నిదురరాదా క్షణమైనా ?
సీమకుక్కలకు పాలస్నానం చేయించేవారూ ఉన్నారు
పాలకొరకు గోరీల్లో కెవ్వున ఏడ్చే పసివారూ ఉన్నారు.
ఈ అమాయకపు చిట్టిదేవతల శాపంలా నిలచిన హిమాలయం !
సృష్టిమూలమే కదులుతున్నదా ? ఏమనుకొంటున్నది హిమాలయం !
పాలు ! పాలు ! గోరీల గొంతు అది ! పాలిప్పుడు కావలసిందేనా ?
దుగ్ధదధుల గంగను ఈ భువికి తప్పనిసరి తేవలసిందేనా ?
జయము లోకసాక్షిణీ భూమాతా ! జయము నీకు ఓ నీలాంబరమా !
జయము నగాధిప! జయము వింధ్యగిరి! జయమో హిందూరత్నాకరమా!
తప్పుకోండి ; మేఘాల మార్గమున స్వర్గం దోచేందుకు వస్తున్నాం.
పాలు ! పాలు ! పాపా ! నీ కోసం, ఇదిగో పాలు వెదకి తెస్తున్నాం.

L1

# శ్రద్ధాంజలి

(మూలం : విందాకరందీకర్ మరాఠీ నుంచి)

(విందాకరందీకర్ ఆధునిక మహారాష్ట్ర కవుల్లో ముఖ్యులైనవారిలో ఒకరు. ఈ కవిత ఆయన మర్ఢేకర్‌కు శ్రద్ధాంజలి సమర్పిస్తూ వ్రాసింది.)

బాధల పొక్కులు గిల్లి జీవితాన్ని దర్శించినవారి కనుల
హారతులొస్తాయి నేడు పూజకు
ఒక పిడికెడు చీకటులేమి ? ఒక గుప్పెడు వెలుతుర్లేమి ?
రెంటికి కావాలిగదా కరుణాసంసిక్త మూక మృత్తికావలంబం మరి
ఈ శ్రద్ధాస్రవచ్ఛుష్క తనీ గళాన
వీణియ ఇరవొందియున్న నీ గళాన
కాని నీవు ఆగలేదు మధ్యమంతో
మరి చెవులే గోడలైనవి
అనంతం మ్రింగేసింది, ఈ గ్రుక్కను తొందరపడి
కాని నీవు మటుకు దీన్ని తొందరపడటమనవు నాకు తెలుసునులే!
నీవు బయలుదేరక మునుపే చేరావచట,
నీవు మటుకు తొందరపడటము నాకు తెలుసునులే !
ఐనా నేడు తుకారాముని భజన చెక్కల తాళం తప్పింది
మొట్టమొదటిసారి ; తప్పిపోయింది.
బ్రహ్మీభూతుడా !
బాధల పొక్కులు గిల్లి జీవితాన్ని దర్శించినవారి కనులు
హారతులిస్తాయి నేడు నీ పూజకు.